Recd
17/5/58

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




మే 1958

సంపుటము 35 : : సంచిక 5

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1958


| | | |
|---|---|---|
| వంతెన | శ్రీ సి. నారాయణరెడ్డి ... | 1 |
| మధ్య ప్రాచ్య రాజ్యాలు : వాని విశేషాలు | శ్రీ పి. వి. ప్రసాదరావు ... | 3 |
| పర్యవసానం | శ్రీ ఆర్. యం. చిదంబరం ... | 8 |
| శాకుంతల చతుర్థాంకము : పినవీరభద్రుని రచన | శ్రీ ప. గోపీచంద్ ... | 18 |
| అశోక ప్రశస్తి | శ్రీ కల్లూరు వేంకటనారాయణరావు ... | 23 |
| చీకటి తెరలు | శ్రీ అందే నారాయణస్వామి ... | 25 |
| సత్యభామాస్వరూపము | "రాజేశ్వరి" ... | 31 |
| సత్యవ్రతుడు | శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి ... | 36 |
| గాథాసప్తశతి - ఆంధ్రానువాదాలు | శ్రీ టి. పి. యస్. రామచంద్రాచార్య ... | 41 |
| పసులకాపరి | "శండిల" ... | 47 |
| ఆంధ్రదేశంలో పూర్వ కాలంనాటి చేతిపనులు | శ్రీ కామఋషి సత్యనారాయణవర్మ ... | 53 |
| రాగబంధం | శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి ... | 58 |
| శ్రీనాథుని రచనలో భక్తి శృంగారభావ శబలత | శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి ... | 69 |
| విషాదం పొంగి పొర్లింది | శ్రీ జనస్వామి కోదండరామశాస్త్రి ... | 77 |
| వాల్మీకికోకిల | శ్రీ శనగన నరసింహస్వామి ... | 86 |
| తెలుగు కన్నడసాహిత్యాల బాంధవ్యం | శ్రీ కె. సుబ్బరామప్ప ... | 88 |
| కలగూరగంప | ... | 94 |
| గ్రంథవిమర్శనము | ... | 96 |

# వంతెన

శ్రీ సి. నారాయణరెడ్డి

గత ధరాగర్భమును ద్రవ్వుచు
రతనముల్ జతసేయుచుండగ;
వర్తమానము నాకు విద్యు
ద్వల్లి వలె మిరుమిట్లు గొల్పెను.

ఎంత జవనాశ్వమునకైనను
ఎప్పుడో ఒక్కప్పుడైనను
నాగ పుచ్ఛము బోలెడు కశాం
చలము సోకక వేడి పుట్టదు.

కొన్ని నాళ్లగ 'నిన్న'పై నా
కున్న ప్రేమ మ్మిమ్మడించెను.
'నేటి'పై నా చూపులేదను
మాట కేవల తర్క విషయము.

గతమె మరకతముల్ ఫలించిన
క్రమ శాద్వలమనుచు కొందరు.
కొందరేమో వర్తమానమె
కుందనపు మాగాణి యందురు.

ఒక రకమ్ముగ నేను ఈ రెం
టికి అతీతముగా మెలంగితి.
కాదు—రెంటిని కలిపి కుట్టెడు
సూది కానగలేక క్రుంగితి.

గతమనెడు వజ్రంపుగోడల
కట్టడముపై నిట్టనిలువున
శిరసు నెత్తిన స్వర్ణమయ గో
పురము సుమ్మీ వర్తమానము.

అంత కడవెడు పాలపై ఒ
క్కింత మీగడ పేరినట్లుగ;
మనకు మిగులును గతములోపలి
మంచి—అదియే సంప్రదాయము.

సంప్రదాయము స్తన్యమట్టుల
జాతి నాడులలో చొరంబడి,
శైశవ స్థితినుండి బ్రహ్మ
జ్ఞాన పదవికి చేరవేయును.

సంప్రదాయము స్తబ్ధమగుచో
జాతి రోగగ్రస్తమై చను.
లోని నెత్తురు గడ్డకట్టిన
మేని జీవ చెడకుండునా మరి?

క్రొత్త నీటిని జేర్చుకొని తర
గెత్తు నదివలె; ఎట్టి జాతియు
ముందు కేగిన యంతకాలము
మూడు పూవులు ఆరుకాయలు!

నా క్రొత్త కావ్యం నుండి

# మధ్యప్రాచ్యరాజ్యాలు: వాని విశేషాలు

శ్రీ పి. వి. ప్రసాదరావు

ఈనాడు ప్రపంచ రాజకీయవాతావరణంలో మధ్యప్రాచ్యరాజ్యాలు వహిస్తున్న పాత్ర అన్నివిధాలా విశిష్టమైనది. దానికి ఈ క్రింది కారణాలు కనిపిస్తున్నవి.

1. మధ్యప్రాచ్యం ఆర్థిక, భౌగోళిక, మతవిషయకమైన ప్రాధాన్యం గలది. ప్రపంచరాజ్యాలలో అత్యధిక భాగం ఈ మధ్యప్రాచ్యంలోని నూనెగనులమీద ఆధారపడింది. తత్కారణంగా మధ్యప్రాచ్యరాజ్యాలలో అరేబియా, ఇరాక్ రాజ్యాలు ముఖ్యంగా కోట్లకొలది ధనం సంపాదిస్తున్నవి.

భౌగోళికంగా ఈ ప్రాంతం పశ్చిమ యూరపును, సిరియాను, ఆఫ్రికాను కలుపుతున్నది. అంతర్జాతీయ విమానాలన్నీ దాదాపు మధ్యప్రాచ్యంమీదుగానే పోతవి.

మతవిషయకంగా ఆలోచిస్తే, క్రైస్తవమతం, జాతీయమతం, ఇస్లాం మతాలు ఈ ప్రాంతంలోనే ఉద్భవించినవి.

2. కమ్యూనిజానికి, ప్రజాస్వామ్యానికి ఈ ప్రదేశంలో నిరంతర ఘర్షణ జరుగుతున్నది. అదే పాశ్చాత్య రాజ్యాలకు, రష్యాకు జరుగుతున్న ప్రచ్ఛన్నయుద్ధం.

3. ఇజ్రాయిల్, అరబ్ రాజ్యాల మధ్య కలహాలు. ఇవే మధ్యప్రాచ్యంలో యుద్ధానికి దారితీస్తవి. ఈ యుద్ధమే మూడవ ప్రపంచయుద్ధం కావచ్చును.

4. అరబ్‌లకు అరబ్‌లకు మధ్య స్పర్థలు గలవు. ఇన్ని స్పర్థలు ఉన్నా విదేశాలతో వ్యవహరించవలసి వచ్చేటప్పటికి అన్నీ ఏకం అవుతవి.

5. పశ్చిమరాజ్యాలలో పశ్చిమ రాజ్యాలకే ఘర్షణ ఉన్నది. ఈ ఘర్షణ అరేబియా, ఇరాక్‌లలో నూనె కాలువిషయంలో బ్రిటన్, అమెరికాలమధ్య కనిపిస్తున్నది.

పైగా, అమెరికా ఐసెన్‌హోవర్ పథకం ఈ మధ్యప్రాచ్యరాజ్యాలలో ఆధిపత్యం సంపాదించుకొనటం నిమిత్తం ఏర్పడినట్టిదే. ఈ అంశం మాత్రం ఎన్నటికీ విస్మరించరాదు.

ప్రపంచ శాంతిభద్రతలదృష్ట్యా మధ్యప్రాచ్య రాజ్యాల శాంతిభద్రతలను పరిరక్షించవలసి ఉన్నదని, కనుక వాని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు ఏ దేశాల-ముఖ్యంగా రష్యా- దాడులనుంచి అయినా భంగం కలిగితే సహించేదిలేదని ఐసెన్‌హోవర్ పథకం స్పష్టం చేస్తున్నది. అంటే దాని అంతర్యం మధ్యప్రాచ్యంమీద ఆధిపత్యం చెలాయించటమేనని చెప్పవచ్చు. దీనికి అనుగుణంగా రష్యాకూడ మధ్యప్రాచ్యంలో పలుకుబడికోసం విశ్వప్రయత్నాలు చేస్తున్నది. ఈ ప్రయత్నాలమూలంగా రష్యాకు సుముఖంగా తయారయిన రాజ్యాలు ఈజిప్టు, సిరియా, ఎమెన్.

ఫ్రాన్సుకు మధ్యప్రాచ్యంలో పలుకుబడి పూర్తిగా తగ్గిందనే-అసలు లేదనే, చెప్పాలి. ఈ మధ్య ట్యునీషియా వ్యవహారంతో ఇది బాగా స్పష్టం అయినది. అల్జీరియాలో ఫ్రెంచివారితో పోట్లాడటానికి గాను కొన్ని అరబ్ రాజ్యాలు అల్జీరియను సైనికులకు, విముక్తిదళ సైనికులకు—గొరిల్లాయుద్ధంలో మహత్తరమైన శిక్షణ ఇస్తున్నవి.

కనుక ఈ అన్ని అంశాల కారణంగా మధ్యప్రాచ్యంలో రాజకీయవాతావరణం వివిధంగా ఉన్నదీ, ఆ ప్రాంతంలోని రాజ్యాలు ప్రపంచ రాజకీయాలలో ఏలాంటి పాత్ర వహించనున్నదీ, సులభంగా అర్థం చేసుకోవచ్చును.

వస్తుతః ఈ రాజ్యాలకు సైనిక బలం స్వల్పం. కాకపోతే ఒక్క ఇజ్రాయిల్ విషయంలో అలా గాదు. ఇక ఈ రాజ్యాలలో ముఖ్యమైనవానికి సంబంధించిన విశేషాలను ఈ దిగువ వివరిస్తాను.

## ఈజిప్ట్

మధ్యప్రాచ్య రాజకీయాలలో ఈజిప్టు వహిస్తున్న పాత్ర చరిత్రప్రసిద్ధమైనది. అరబ్ జాతీయవాదసౌధానికి పునాదిరాయి ఈజిప్టులోనే వేయబడినది.

మధ్యప్రాచ్యంలో పాశ్చాత్య రాజ్యాలపట్ల ద్వేషం, అయిష్టత ప్రబలటానికి దోహదం గల్గించింది ఈజిప్టుమీద బ్రిటన్, ఫ్రాన్సు, ఇస్రాయిల్ దేశాలు 1956 అక్టోబరులో జరిపిన దండయాత్రయే. ఈ దండయాత్ర కారణంగా పాశ్చాత్యరాజ్యాలపట్ల విముఖత్వం, రష్యాపట్ల సుముఖత్వం ఏర్పడినవి. ఇది మధ్యప్రాచ్యచరిత్రలోనే గాక ప్రపంచచరిత్రలో ప్రధానమైన ఘట్టం.

ఈ దండయాత్రలో ఈజిప్టు చాలా దెబ్బతిన్నది. కాని మరల అప్పుడే కోలుకొంటున్నది. అరబ్ రాజ్యాలన్నిటికన్నా ఈజిప్టు సైన్యమే పెద్దది అన్నివిధాల. సైనికబలం లక్ష ఉన్నది. ఇది అల్జీరియాకు గూడ అమన్య ఆయుధసహాయం చేసింది. ఈజిప్టు జనాభా 22,900,000.

అరబ్ రాజకీయరథాన్ని నడుపుతున్న వ్యక్తులలో ఈజిప్టు అధ్యక్షుడు నాజర్ ప్రధానంగా చెప్పుకోదగిన వ్యక్తి. దేశాన్ని అనేకవిధాల ముందుకు నడిపిస్తున్నాడు.

మధ్యప్రాచ్యంలో అరబ్ రాజ్యాధిపత్యంకోసం అటు సావూదిరాజు, ఇటు నాజర్ విశ్వప్రయత్నాలను గావిస్తున్నారు. మధ్యప్రాచ్యంలో ఆధిపత్యంకోసం అమెరికా రష్యాలు పోటీపడుతున్నట్లే, అరబ్ రాజ్యాలమీద ఆధిపత్యంకోసం అరేబియా, ఈజిప్టులు పోటీలుపడుతున్నవి. ఈ రెండూగూడా అరబ్‌లమధ్య చీలికలు పూడ్చడానికి ప్రయత్నిస్తున్నవి. ఈ ప్రయత్నాలన్నింటిలో, ఈ పోటీలలో ఎవరు విజయం పొందుతారో గమనించవలసిఉన్నది. అరేబియా అమెరికామీద ఆధారపడితే, ఈజిప్టు రష్యామీద ఆధారపడి ఉన్నది. అంతే తేడా.

కాని వస్తుతః అరేబియాకన్నా ఈజిప్టు ఎన్నోరెట్లు బలవత్తరమైన దేశం. ఇదిమాత్రం వాస్తవం. సూయజ్ వ్యవహారంలో ఈజిప్టు గైకొన్న చర్యవలన ఈజిప్టుకు క్రొత్తబలం, క్రొత్త ధైర్యం వచ్చినవి. ఈ విషయం ఆధారంగా ఈజిప్టుకు మధ్యప్రాచ్యంలో హోదా వచ్చినది.

ఆసియా ఆఫ్రికా జాతుల మహాసభను ఈ మధ్య కైరోలో ఏర్పాటుచేసి కర్నల్ నాజర్ ఆయాజాతులకు నాయకత్వం వహిస్తున్నట్లు, ఆయాజాతుల సమస్యలను పరిష్కారము చేయటానికి, సామ్రాజ్యవాదశక్తులను ప్రతిఘటించటానికి కృషి చేస్తున్నట్లు లోకానికి తెలియబరుచుకున్నాడు. దీనితోగూడా నాజర్ ఘనత అరబ్ రాజ్యాలలో—ముఖ్యముగా మధ్యప్రాచ్యంలో పెరిగిపోయినది.

## ఇస్రాయిల్

ఇది 1948 లో పాలస్తీనా స్థానములో ఏర్పడినది. దీనికి అమెరికా సహాయం అత్యధికం. అరబ్ రాజ్యాలవారికి ఇస్రాయిల్ అంటే గిట్టదు. పాలస్తీనా నుంచి లక్షలాది అరబ్‌లను వెళ్ళగొట్టడంతో ప్రపంచములోని యూదులందరికి ఇది ఆశ్రయంగా తయారు కావటంతో, అరబ్ కాందిశీకుల సమస్య ఇంతకాలం గడిచినా అపరిష్కృతంగానే ఉండిపోవటంతో, అరబ్ రాజ్యాలకు, ఇస్రాయిల్‌కు మధ్య స్పర్థలు ఉన్నవి. మధ్యప్రాచ్యంలో యుద్ధం అంటూ వస్తే మూడు వంతులు ఈ రెంటి స్పర్థల మూలముగానే వస్తుంది.

ఈ రెంటి స్పర్థల నాధారం చేసికొనే పశ్చిమ రాజ్యాలు, రష్యా ఎప్పటికయినా దురాక్రమణకు దిగుతవి. అందుకని అరబ్ రాజ్యాలు, ఇస్రాయిల్ — ఈ రెంటిమధ్య శాశ్వత శాంతిరక్షణ సంధులు, దురాక్రమణకు పూనుకోకుండా ఉండగలందులకు ఒప్పందాలు జరగాలి. అప్పటికిగాని శాంతిభద్రతలకు ప్రమాదము రాకుండా ఉండదు.

ఇస్రాయిల్‌కు అనుకొని మూడుప్రక్కలా 600 మైళ్ళ పొడవున సరిహద్దులలో సిరియా, జోర్డాన్ ఈజిప్టు రాజ్యాలు ఉన్నవి. ఏ మాత్రం కాస్త, వ్యవహారము చెడినా ఇస్రాయిల్‌కి ప్రమాదం తప్పదు. ఈ ప్రమాదందృష్ట్యానే ఇస్రాయిల్ అమెరికాతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొన్నది.

ఈ అరబ్ ఇస్రాయిల్ తగాదాలను శాశ్వత పరిష్కారం చేయటానికి ఐక్యరాజ్యసమితి గట్టి ప్రయత్నాలు చేయాలి. లేకపోతే ఎప్పటికప్పుడు ప్రమాదమే.

ఇస్రాయిల్ రాజ్యం కొద్దిదే అయినా మంచి బలవత్తరమైనది. ఇచ్చటి ప్రజలలో మంచి నైతికబలం, గుండెబలం, శక్తిసామర్థ్యాలు గలవు. అందుకనే కొద్ది రోజుల వ్యవధిలోనే ఇస్రాయిల్ 2 లక్షల మందిని సైన్యంలో చేర్చగలదు. మధ్యప్రాచ్య రాజ్యాలన్నిటిలోకి దీని సైన్యం (50,000) శక్తివంతమైనది. మంచి విమానబలం కూడా ఉన్నది. ఇందులో 100 వరకు జెట్ విమానాలు గలవు. నౌకాబలం కూడా బలమైనదే.

ఈ దేశంలో, మిగతా మధ్యప్రాచ్య దేశాలలో ఎక్కడా లేని ఆరోగ్యకేంద్రాలు గలవు. ఇప్పుడిప్పుడే సినిమా పరిశ్రమకూడా అభివృద్ధిలో ఉన్నది.

రాజ్యంలో అరబ్‌లు 1 లక్షా 50 వేలు. మొత్తం జనాభా 17,50,000. ఇందులో ముఖ్యమైన నగరాలు మూడు గలవు. 1 టెల్ అవీవ్. అమెరికాకు న్యూయార్కు నగరం ఎలాంటిదో ఇది ఇస్రాయిల్‌కు అలాంటిది. 2. హాయిఫా. ఇది బ్రహ్మాండమైన రేవు పట్టణం. 3 జెరూసలెం.

## లెబనాన్

లెబనాన్ 1949 లో ఏర్పడినట్టిది. ఇచ్చట అధిక సంఖ్యాకులైన ముస్లిములమీద క్రిస్టవుల ఆధిపత్యం ఉన్నది. ఇక్కడ అరబ్ జాతీయవాద శక్తుల ప్రభావం గూడా లేకపోలేదు.

లెబనాన్‌కి సిరియాకు చాలా కాలం నుంచి స్పర్థలు ఉన్నవి. లెబనాన్‌కి పడమర సిరియా, దక్షిణాన ఇస్రాయిల్ సరిహద్దులుగా ఉన్నవి. సిరియా ఏజంట్లు లెబనాన్ సరిహద్దులు దాటి లెబనాన్ ప్రజలలో ఏవో జోక్యం కల్పించుకుంటున్నారనీ, సిరియాలోనుండి లెబనాన్‌లోకి దొంగతనంగా ఆయుధాలు చేరవేయటం జరుగుతున్నదనీ, సిరియాలోగుండా లెబనాన్‌లోకి వచ్చే దిగుమతుల విషయంలో, ఇచ్చటినుంచి సిరియా గుండా వెళ్లే ఎగుమతుల విషయంలో సిరియా అనవసరంగా జోక్యం కల్పించుకొంటున్నదనీ ఈ రెండు దేశాలమధ్య స్పర్థలు ఉన్నవి. ఇవి ఇప్పట్లో తీరేవి గావు. ఇవి అలా ఉండగా సరిహద్దుల విషయంలోనూ తగాదాలు ఉన్నవి. కనుక వీని అన్నింటి మూలంగా సిరియాకు లెబనాన్‌కు ఎప్పుడూ ఘర్షణ ఉంటూనే ఉన్నది.

కాని ఎన్ని ఉన్నా యుద్ధంమాత్రం రాదు. ఎందువలన అంటే సిరియావంటి పెద్దరాజ్యంమీదకి లెబనాన్ దండెత్తజాలదు. అంతేగాకుండా పెద్ద రాజ్యాలు ఏవీ గూడా లెబనాన్‌వంటి చిన్నరాజ్యం మీద సిరియా దండెత్తటాన్ని సహించవు.

ఇక సైన్యం సంగతి.

సైనిక బలం 8,300. జనసంఖ్య 1,400,000.

## ఎమెన్, ఏడెన్

ఎమెన్, ఏడెన్ ఈ రెండూ అరేబియాలో ఎఱ్ఱసముద్రంనుండి పర్షియన్ సింధుశాఖవైపుగా ఉన్నవి. ఈ రెంటికిగల ఆర్థిక, సైనిక ప్రాముఖ్యం బ్రహ్మాండమైనది.

ఎమెన్ స్వతంత్రరాజ్యం. ఇది ఈజిప్టుకూటమిలో చేరినట్టిది. ఇది రష్యా సహాయం పొందుతూ ఉంటుంది. అరేబియాలో మాదిరిగా ఇక్కడ కూడ బానిసల వ్యాపారం విపరీతంగా ఉన్నది.

ఈ స్వతంత్రరాజ్యం రాజు ఈజిప్టు మద్దతుతో, ప్రక్కనే ఉన్న బ్రిటిషు పాలితప్రాంతమైన ఏడెన్‌తో సరిహద్దు తగాదాలను త్రవ్వుకొంటున్నాడు. ఏడెన్ చాలా కీలకస్థానంలో ఉన్నది.

ఎమెన్ జనాభా 4,500,000.

## సిరియా

సిరియావ్యవహారం ఈమధ్య చాలా గందరగోళంగా పరిణమించింది. సిరియాలో కమ్యూనిస్టు భావాలు గల అధికారులు కొందరు ఉన్నతపదవులలోనికి తీసికొనిరాబడటంతో సిరియా కమ్యూనిస్టు రాజ్యం అయిందని విదేశాలు గోలపెట్టినవి. సిరియా సరిహద్దునే గల టర్కీ సిరియాలో జరిగిన పరిణామాలకు అలజడి చెందటం, అమెరికాగూడా ఆందోళనపడటం, క్రమంగా సిరియా, టర్కీలు కాల్పులుజరుపుకోవటం, ఈ సమస్య ఐక్యరాజ్యసమితికి వెళ్లటం, రష్యా సిరియా ప్రక్కన నిలబడటం—ఇవన్నీ మరువరాని ఘట్టాలు.

అసలు సిరియాకు, టర్కీకి అనాదిగా కొన్ని స్పర్థలు గలవు. 1939 లో సిరియా కొంత ఒత్తిడి కారణంగా టర్కీకి అలెగ్జాండ్రెట్టా అనే ప్రాంతాన్ని ఇచ్చింది. దాన్ని మరల సిరియా ఇమ్మని అడుగుతుందని, సిరియాను స్థావరంగాచేసికొని తనమీదకి

రష్యా ఎప్పుడైనా దండెత్తవచ్చునని టర్కీ భయం. ఆభయమే ద్వేషంగా పరిణమించింది.

ఇక మరో విషయం.

సిరియాలోనే కమ్యూనిస్టులకు వ్యతిరేకమైన ప్రాంతం ఒకటి ఉన్నది. దానిపేరు అలెప్పొ. ఇది సరిగా టర్కీ సరిహద్దునే ఉన్నది. ఈ ప్రజలు ఎప్పటికైనా టర్కీ మద్దతుతో తిరుగుబాటు లేవదీస్తారని, అంతేగాక, టర్కీ ఈ ప్రాంతాన్ని కలుపుకుంటుందనీ సిరియాభయం. కాని ఇది సాహసంతో కూడినపని, ఎందుకంటే రష్యా టర్కీ దర్జా సహించదు.

సిరియా 1945 లో స్వాతంత్ర్యం పొందింది. దీని ముఖ్యపట్టణం డమాస్కస్. ఈ నగరం బ్రహ్మాండమైన, సుందరమైన భవనాలతో కలకలలాడుతూ ఉంటుంది. అరేబియా తర్వాత మహమ్మదీయమతం ఇక్కడే బాగా పాతుకుపోయినట్లు కనిపిస్తున్నది.

సిరియాలో ప్రజలు 4 మిలియనులు. సైనికబలం 65 వేలు. సిరియాకు, రష్యా ఆర్థిక సైనిక సహాయం చాలా ఉన్నది.

అమెరికాను సహాయం అడిగితే అంగీకారయోగ్యంగాని షరతులు పెట్టిందని, కాని రష్యా ఏ షరతులు పెట్టకుండా సహాయం చేసిందని సిరియా ప్రధాని స్పష్టంచేశాడు.

## అరేబియా

మధ్యప్రాచ్యంలో ఈజిప్టుతరవ్వాత చెప్పుకోవలసిన రాజ్యం అరేబియాయే. అరేబియా అమెరికాకు నూనెగనులను కౌళ్లకుఇచ్చి ఏడాదికి 250,000,000 డాలర్లు సంపాదించుకొంటున్నది. ఈ మొత్తం రాజకుటుంబానికి చేరవలసిందే. ఆ కుటుంబం రాజకీయపు పెట్టుబడులకోసం ఈ ధనాన్ని అత్యధికంగా ఖర్చుపెడుతుంది.

అరేబియా ఒకప్రక్క అమెరికాతో స్నేహంగా ఉంటూ, దానితో సంబంధ బాంధవ్యాలను నిలుపుకొంటూ వేరొకప్రక్క సిరియామీద, సిరియామీదనే గాదు, ఏ అరబ్ రాజ్యంమీదనయినా - దురాక్రమణ జరిగితే సహించనని చెప్తున్నది. అరబ్ రాజ్యాలలో చీలికలు రాకుండా చూడటానికి, అరబ్ రాజ్యాల మీద ఆధిపత్యం చెలాయించటానికి అరేబియా రాజు విశ్వప్రయత్నాలు చేస్తున్నాడు.

అరేబియాలో ఈజిప్టు ప్రాబల్యం తగ్గించాలనే తాపత్రయంతో అరేబియాకు అమెరికా ఆర్థిక సహాయం చేస్తున్నది. అరేబియా సైన్యానికి అమెరికా శిక్షణ ఇస్తున్నది.

అరేబియా జనసంఖ్య8, 000,000 అందరూ అరబ్‌లు. అరబ్ జాతీయవాదానికి జీవంపోస్తున్న రాజ్యాలలో ఈ అరేబియా ఒకటి. మధ్యప్రాచ్య రాజకీయాలలో అరేబియా వహిస్తున్న పాత్ర ప్రధానమైనదీ, ప్రముఖమైనదీను.

## జోర్డాన్

జోర్డాన్ రాజుపేరు హుస్సేన్. ఇతని వయస్సు 21 సంవత్సరాలు. ఇతను 1953, మే 2 వ తేదీన సింహాసనం అధిష్ఠించాడు.

జోర్డాన్ అమెరికా సహాయంమీద ఆధారపడిన రాజ్యం. జోర్డాన్‌కు ప్రతి సంవత్సరం బ్రిటన్ 125 లక్షల పౌనులు సహాయం ఇచ్చేది. క్రితం మార్చిలో జోర్డాన్ సంధి రద్దుకావటంతో బ్రిటన్ ఆ సహాయాన్ని ఆపుచేసింది. అప్పుడు ఈ సహాయాన్ని తాము ఇస్తామని అరేబియా, సిరియా, ఈజిప్టులు అన్నవి. కాని సిరియా, ఈజిప్టులు తమ వాటా చెల్లించనందున జోర్డాన్‌లో లోటు బడ్జెటు ఏర్పడింది. ఆర్థిక సంబంధమైన సౌమతను కలిగించటానికి అమెరికా దీనికి కోట్ల డాలర్లు ఇస్తున్నది.

ఈ సహాయం అలా ఉండగా హుస్సేన్‌ను పదవిచ్యుతుని చేయాలని కొన్నివర్గాలు ప్రయత్నిస్తున్నవి. పాశ్చాత్యరాజ్యాలకు వ్యతిరేకంగా ఇతడు సిరియా ఈజిప్టు కూటమిలో చేరాలని ఆ వర్గాల అభిమతం. ఎప్పటికైనా ఈజిప్టు, సిరియాల కుట్రచే జోర్డాన్‌లో విప్లవం బయలుదేరుతుందనీ, అలాంటి విప్లవం గనుక జరిగితే, ఇస్రాయిల్, ఇరాక్‌లు తిరుగు దాడులు లేవదీస్తవనీ అనుకొంటున్నారు. ఏది ఎలా అయినా, జోర్డాన్ భవిష్యత్తు అయోమయస్థితిలో ఉన్నదనే చెప్పాలి.

జోర్డాన్ రాజధాని అమ్మాన్. మొత్తం రాజ్యం జనాభా 14,00,000. సైనికబలం 88,000. రాజు హుస్సేన్ తన తల్లి సలహామీదనే వ్యవహారాలన్నిం

టిని వదులుకుంటాడు. ఇతని సోదరుడు మహమ్మద్. ఇతను ప్రస్తుతం బ్రిటన్‌లో విద్యాభ్యాసం చేస్తున్నాడు.

జోర్డాన్ 1946 లో స్వతంత్రరాజ్యం అయినది.

## ఇరాక్

సిరియా, టర్కీ, ఇరాన్, అరేబియాలమధ్యగా ఉన్నది ఇరాక్. ఇది అరబ్ దేశమే అయినా, బ్రిటన్, వంటి పాశ్చాత్యరాజ్యాల సహాయాన్ని పొందుతూ, వాని ప్రభావానికి లోనయినది. అంతే గాక వాని అండతో మధ్యప్రాచ్యంలోని అరబ్ రాజ్యాలమీద ఆధిపత్యం చెలాయించాలని చూస్తున్నది. అందుకుగాను ఏర్పడినట్టిదే బాగ్దాదు ఒడంబడిక. ఇరాన్, టర్కీ, బ్రిటన్, పాకిస్తాన్‌లతో కలిసి ఇరాక్ బాగ్దాద్ ఒడంబడికను రూపొందించుకొన్నది. ఇరాక్ బాగ్దాద్ ఒడంబడికకు పట్టుకొమ్మగా ఉన్నది. బాగ్దాద్ ఇరాక్ రాజధానీ నగరం.

మధ్యప్రాచ్యం అంతటికీ కలిపి రష్యాకు వ్యతిరేకంగా, ఆగ్నేయ ఆసియా రక్షణవ్యవస్థవంటి వ్యవస్థను ఏర్పాటుచేయాలని మొదట్లో బ్రిటన్, అమెరికాలు విశ్వప్రయత్నాలు చేసి విఫలమయినవి. అందుకని ఇరాక్, ఇరాన్, టర్కీ, బ్రిటన్, పాకిస్తాన్‌లతో కలిసి బాగ్దాదుకూటమిని ఏర్పాటుచేసినవి.

ఈ బాగ్దాదు కూటమిని భగ్నం చెయటానికే అరేబియా, ఈజిప్టులు ప్రయత్నాలు చేస్తున్నవి. చేసినవి. ఆ ప్రయత్నాల ఫలితమే డెమాస్కస్ ఒడంబడిక. ఈ ఒడంబడికకు మూలం ఈజిప్టు. అరేబియా ఈ బాగ్దాద్ కూటమిని భగ్నం చేయటానికి, తనకు నూనె బావిమీద వస్తున్న కోట్లకొలది ధనాన్ని ఖర్చుపెట్టింది.

ఇరాక్‌లో మంచి నూనెగనులు ఉన్నవి. ఈ నూనె సిరియాలోనుండా నూనెగొట్టాలద్వారా మధ్యధరా సముద్రంలోకి వెళ్ళి అక్కడినుంచి టాంకర్ల మీదుగా విదేశాలకు వెళుతున్నది. ఇరాక్‌లో నూనె వ్యాపారాన్ని అధికంగా చేసికొంటున్న రాజ్యం బ్రిటన్. అరేబియాలో అమెరికా తన పలుకుబడిని హెచ్చించుకోవాలని చూస్తుంటే, ఇరాక్‌లో బ్రిటన్ తన పలుకుబడిని హెచ్చించుకోవాలని చూస్తున్నది. ఈ విధంగా రెండు పాశ్చాత్యరాజ్యాలకు ఈ నూనె మూలంగా తగవులాటలు ఏర్పడినవి. కాని ఇవి లోపల లోపల సాగుతున్నట్టివే. ఎప్పుడో అగ్నిపర్వతం బ్రద్దలవుతుంది.

నూనె మూలంగా వస్తున్న ధనాన్ని ఇరాక్ ఒక్కటే సద్వినియోగం చేస్తున్నది. వెనుకటి ప్రధాని అయిన నూరీ అను అతను ఈ ధనాన్ని సద్వినియోగం చేయాలని అభిలషించి అభివృద్ధి మండలి అను ఒక సంస్థను నెలకొల్పాడు. అందులో ఒక బ్రిటిషువ్యక్తి, ఒక అమెరికా దేశీయుడు, ఏడుగురు ఇరాక్ పౌరులు ఉన్నారు. ఈ మండలి ఆధ్వర్యాన దేశంలో బ్రహ్మాండమైన పునర్నిర్మాణ కార్యక్రమాలు జరిగినవి. జరుగుతున్నవి.

టైగ్రిస్ నది వరదలవలన ఇరాక్ ముఖ్యపట్టణమైన బాగ్దాద్ నగరానికి ప్రతిసంవత్సరం ప్రమాదం జరుగుతున్నది. ఈ ప్రమాదంలో నగరానికి కొన్ని కోట్ల రూపాయల నష్టం వస్తున్నది. ఆ నష్టం రాకుండా చేయడానికి ఈ మండలి కొన్ని కోట్లు ఖర్చుపెట్టి ఒక డామును నిర్మించినది. ఇలాంటి పనులు ఇంకా ఎన్నో చేయబడినవి. నీటి పారుదల పథకాలకు చాలా డబ్బు ఖర్చుపెట్టడం జరిగింది.

బాగ్దాద్ నగరంలో బ్రహ్మాండమైన మ్యూజియం ఉన్నది. ఇందులో 5000 సంవత్సరాలనాటి నాగరికతా విశేషాలను తెలియజేసే మహత్తర వస్తుసంపద ఎంతో ఉన్నది.

బాగ్దాద్ నగరం టైగ్రిస్ నది ఒడ్డున మహాసౌధాలతో కలకలలాడుతుంటుంది.

ఇజ్రాయిల్ తర్వాత మధ్యప్రాచ్యంలో ఉత్తేజకరమైనరాజ్యం ఈ ఇరాక్ అని చెప్పాలి.

ఇరాక్ జనాభా 4,800,000. సైనికబలం 60 వేలు. ఇరాక్ సైనిక బలంలో 100 విమానాలు ఉన్నవి బ్రిటన్, అమెరికాల నుంచి ఇరాక్ జెట్ ఫైటర్ విమానాలుకూడా కొంటున్నది.

# పర్యవసానం

శ్రీ ఆర్. యం. చిదంబరం

రెండోసారి శశివంక చూడలేకపోయాను. అనుకోకుండా ఎదురుపడింది. ఆమె కళ్ళల్లో ఎలాంటి భావాలు మిళితమై వున్నాయో వూహించే శక్తి లేదు. చేతులారా, వికసిస్తున్న పువ్వును త్రుంచివేసి 'అయ్యో!' అంటూ సానుభూతి చూపటం హాస్యాస్పదం. ఆమెలో అసూయ - ద్వేషం - అలక్ష్యత - చీకటి వెలుగులు - ఎన్నో భావాలు పల్చటి తెరలోంచి చూడవచ్చు. అమాయకత్వం మాత్రం లేదు.

బొటనవేలు చుట్టూ శశి పల్చటి గుడ్డను చుడుతోంది. ఆ పొడుగాటి తెల్లని వేళ్ళు అనేక కోణాల్లో ఎన్నోసార్లు నా వేళ్ళతో దోబూచులాడాయి. కాని అందులో తియ్యదనం - వేడి - మంచుబిందువుల చల్లదనం ఏవీ లేవు గాలివీచని మిట్టమధ్యాహ్నపు రోజులా వుంది.

అవును - ఒకనాడు నేను చేసిన నిర్ణయం మరో విధంగా వుంటే ఆ స్పర్శలో ప్రతి అణువులోనూ అనంతమైన అనురాగం ప్రవహించేది.

కాని అలా జరగలేదు.

తాత్కాలికంగా జనించిన ఉద్రేకంలో - ఇతరులు సృష్టించిన సుడిగుండంలో చిక్కుకుని నిజానిజాలు, భవిష్యత్తును గమనించక చేసిన నిర్ణయం - కాలక్రమేణ తన ఫలితం చూపింది. కట్టుకట్టడం పూర్తయింది. డాక్టర్ సావంత్ చిరునవ్వు నవ్వి లేచాడు. 'శశీ!... నేను అర్జంటు కేసొకటి చూడటానికి వెడుతున్నాను. వచ్చేసరికి అరగంటవుతుంది... ఓ - కే - సార్! మీరు అయిదారు రోజులవరకూ వచ్చి మందు వేసుకోండి - అతుక్కుంటే సరేసరి - లేకపోతే కత్తిరించేద్దాం.' అని వెళ్ళిపోయాడు.

పరిస్థితులన్నీ ఒక్కసారి అనుకూలిస్తాయి. ప్రతికూలిస్తాయి. ఏనాడూ లేనిది ఆనాడు క్రికెట్ ఆటలో బొటనవేలు చితికిపోవటం, అది సెప్టిక్ అవుతుందేమోనన్న భయంతో డాక్టరు దగ్గరకు రావటం జరిగింది. శశిని ఎన్నో ప్రశ్నలు అడగాలని వుంది. అయిదు సంవత్సరాల క్రితం ఆమె జీవితానికి చిచ్చుపెట్టాను. ఆ తరువాత ఆ మంటలు ఎలా ఆర్పుకున్నదీ నాకు తెలియదు.

ఆమె బాగా ఎదిగింది. ఓ చీకటిముద్దను రెండు భాగాలుగా చీల్చినట్లు రెండు జడలు - ఓ జడలోంచి 'ఇదుగో పడిపోతానం'టూ బెదిరిస్తున్న మద్రాసు కదంబపూలదండ. నుదుటిమీద చుక్కలబొట్టు సరిగ్గా అమరలేదు. నా కళ్ళకు "పారలాక్స ఎర్రర్" వుందేమో మరి. నిరంతర సౌందర్యతపస్సు జరుగుతున్నట్టుగా వుంది.

'శశీ!...నువ్వు! నువ్వు!...' అంటూ ఆగిపోయాను. నీరు మంచుగడ్డగా మారినట్లు కంఠంలో ఏదో అడ్డుపడింది.

'సారీ!...మీరింకా తెలుసుకోవలసినది వున్నట్లయితే డాక్టరుగారు వచ్చేదాకా ఆగండి. మీ సందేహాలకు ఆయన సమాధానం చెప్తారు' అంటూ స్వచ్ఛమయిన హిందీలో కొరడా ఝళ్ళుమనిపించి తనపనిలో నిమగ్నురాలయింది. అంతటి బాధలోనూ నవ్వుకున్నాను—ఈ స్వల్పకాలంలో శశి తెలుగుకూడా మర్చిపోయిందా?

తల వంచుకుని బయటకొచ్చేశాను...

అందరూ అదృష్టం నామీద వాలిందన్నారు. శశి స్కూలు ఫైనలు వరకూ చదువుకుంది. ఆమె నవ్వితే ఒక్క పెదవులూ, కళ్ళూ కావు—శరీరంలో ప్రతి అణువూ పిచ్చికోరికతో వసంతం చిమ్మినట్లు నవ్వుతుంది. ఎర్రటిబుగ్గల్లో వున్న చంద్రుణ్ని వదులుకుని ఎక్కడో ఆకాశంలో ఎవరికీ అందని దూరంలోవున్న చంద్రుడికోసం పరుగెత్తటం వెర్రితనమనిపించింది. నిండు పాలకుండలాంటి యౌవనం. ఆమెను చూడగానే పరవశంలో నన్ను నేను మర్చిపోయాను. పెళ్లి

చూపుల తతంగం పూర్తయి అందరూ లేచారు. నేను మాత్రం పిచ్చివాడిలా అలా చూస్తూ కూర్చున్నాను. శశి ఇంకా అక్కడే సిగ్గుతో తలవంచుకుని కూర్చున్నట్టు భ్రమ. అందరూ గొల్లుమన్నారు. అమ్మాయి నచ్చిందా అని నన్నెవరూ అడగలేదు.

కాని—పెళ్లి స్థిరపడే ముందు కొన్ని అడ్డంకులు తలెత్తాయి.

అందులో కొన్ని శశి వర్ణనలు. ఆమె పుట్టగానే తల్లిని మింగివేసిందట—ఆ కుటుంబంలో ఎవరో ఆత్మహత్య చేసుకున్నారట—అంతే కాక ఆమెకు విధవాయోగం వుందని భవిష్యత్తులోకి తొంగి చూడగలిగిన జ్యోతిష్కుల హెచ్చరిక—ఇలా పలు వైపులా గోతులు వున్నప్పుడు మా పెళ్ళి ఎలా జరుగుతుంది?...కాని తెగించి నిలబడ్డాను. హిమాలయా పర్వతాన్ని చిటికెన వేలుమీద ఆడించటంలాంటిదది! చివరకు నా పంతం నెగ్గింది.

అసలు మూఢనమ్మకాలు ఎలా పుట్టాయన్న ప్రశ్నకు సమాధానం లభిస్తుందనుకోను. ఆ పరిహద్దుల వంక పోవడంకూడా ప్రమాదకరం! దుశ్శకునంలో బయలుదేరినవాడిని మానే దాంపత్యం ఏముంటుంది? 'నా మాట విన్నావా?... చూడు! నీ కాలికి గాజు పెంకు గుచ్చుకుంది...లారీని ఢీకొబోయావు.' అంటుంది. అయితే మంచి ఎదురులో వెళ్లినవారికి కష్టాలెందుకు కలుగుతాయో! నిదర్శనాలు కనపడగానే ఆ నమ్మకాల విలువ స్థిరపడుతుంది.

రేపు పెళ్లి—అందరం సిద్ధంగా వున్నాం—రెండెడ్లబళ్లు బయలుదేరటమే తరువాయి. ఆకాశం కొంచెంగా నల్లరంగు పూసుకుంది. వర్షం వస్తుందన్న భయం ఒకవంక వుండనే వుంది. మా అమ్మ ఏదో మర్చిపోయి తీసుకురాటానికి లోపలకుపోయింది. అయిదు నిమిషాల తరువాత పెద్దకేక వినిపించింది. అది మా అమ్మగొంతు. అందరం లోపలకు పరుగెత్తాం—నూతిపక్కనుండే విజయగర్వంతో బారెడు త్రాచు చరచర పాకుతూ వెళ్ళిపోయింది. సంగతి అర్థమైంది—అమ్మ ప్రాణాలు నిలుపుకునేటందుకు వృథాగా పోరాటం సాగించింది. వైద్యుడు వచ్చి శాయశక్తులా శ్రమించి విఫలుడయ్యాడు.

అంతా పూర్తయింది. కళ్ళమ్మట ఏకధారగా వెలువడుతున్న కన్నీటిని ఏ కారణంతోనూ, ఏ పూరడింపుతోనూ ఆపుకోలేకపోయాను. 'ఎందుకూ దొంగ ఏడుపు?... నేను ముందే చెప్పాను. విన్నావా? నీస్వార్థంకోసం అమ్మను చంపుకున్నావు. నా బతుకు ధ్వంసంచేశావు. నీ మొహంచూస్తే ఏడు జన్మలనాటి పాపం అంటుకుని వదలదు.' అంటూ నాన్న పరిస్థితులు సృష్టించిన విషపు వాతావరణానికి నేనే కారణమని దుమ్మెత్తిపోశారు. ఆ క్షణంలో నా గుండెను ఎక్కడికో పారేశాను. వెదకి తీసుకురావాలి. ఎక్కడుందో ఏమో మరి. ఆ మర్నాడు నాన్నగారు తమకీ సంబంధం వద్దని లక్ష కారణాలు చూపిస్తూ చెప్పేశారు. అప్పట్లో అడ్డుకునే మనోధైర్యం కాని, సమర్థనీయమైన ఋజువు కాని కనపడక వూరుకున్నాను. ఆ తరువాత రెండు నెలలకు నాన్న బొంబాయి వచ్చేశారు. శశి కింక పెళ్ళికాదని నాకు తెలుసు.

శశి అందని నక్షత్రం-హృదయంలో ఏవో ఆశలు చూపిరారమ్మని ఆహ్వానించి శూన్యంలోకి పోనిచ్చి అక్కడ శాశ్వతంగా బంధించి వేసింది. అప్పట్నుంచీ జీవితం యాంత్రికంగా నడచిపోతోంది. ఎన్నో నెమళ్ళు నృత్యం చేశాయి. కోయిలలు ఆకాశాన్ని చీల్చుకుపోయే గీతాలు ఆలాపించాయి. రామచిలకలు ముద్దుముద్దుగా, తియ్యతియ్యగా మాట్లాడాయి. ఇంద్రధనుస్సులు కనిపిస్తూ, మాయమవుతూనే వున్నాయి. కాని చలనంలేని చెట్టు శీతకాలపు మంచువానలా నవ్వి వూరుకుంది...శశి జీవితం రూపరహితంగా చేశాను. అంటే ఆమెను పెళ్ళిచేసుకోవాలనుకునేవాడు తన కుటుంబంలో ఎవరో ప్రధానవ్యక్తిని పోగొట్టుకోవాలన్నమాట.

ఇప్పుడు స్వాతంత్ర్యపు గొడుగు ఎండవానల నుంచి రక్షిస్తోంది. శశిని సమాధానపరచి ఎలాగైనా పెళ్ళిచేసుకోవాలని నిశ్చయించుకున్నా. ఆ మర్నాడుదయం సిగ్గుపడుతూనే సావంత్ డిస్పెన్సరీకివెళ్లాను. నిన్న రాత్రి వచ్చి మళ్లీ తెల్లారేసరికి హాజరుకావటం అసందర్భంగానే వుంటుంది మరి. అతను చదువుతున్న 'ధర్మయుగ్' దీపావళి సంచిక టేబిలు మీదుంచి నవ్వుతూ 'ఏవిటి సంగతి?' అనడిగాడు. శశి ఎక్కడా కనిపించలేదు.

'రాత్రంతా నిద్రపట్టలేదు' (రాత్రి పడుకున్న నాకు తెల్లవారటం తప్పించి మరేమీ తెలియదు.)

'బాధ సహించలేకపోతున్నా.!' (ఓ చెయ్యి తెగగొట్టి పారేసినా నొప్పి వుండని మొండిశరీరం.)

కూర్చుంది. కనుక నోటీసులు - దావాలు - అవసరం లేకుండా ఆ సొమ్ము యిచ్చేస్తామని అనుకుంటున్నాను. అన్నట్టు ఆ లిస్టులో 'రాత్రి షికార్లకు' అనటం మర్చిపోయాను.' అంటూ విరగబడి నవ్వటం మొదలు పెట్టాడు. 'అలాగే...స్టేట్ బాంక్ కి చెక్ రాయమంటావా? లేక లాయిడ్స్...ఎదైనా ఫరవాలేదు...అది సరే కాని ఆ హైనెక్ డ్ శ్యామల వుంది చూశావూ?' అంటూ మొదలు పెట్టాడు. ఆ ధోరణి పదినిమిషాలదాకా సాగిపోయింది.

'హలో! మిస్టర్ శివరావు! ఎలావుంది? బాధ తగ్గిందా?' అంటూ వో నర్సు వచ్చింది. తలెత్తి చూశాను. ఎవరో శరీరంమీదుగా టాంకులు నడిపించి నట్టైంది. అమాంతం ఎత్తి నయాగరా జలపాతంలోకి విసిరి వేసిన అనుభూతి. శశి!......తెల్లటి దుస్తుల్లో ఇంకా—ఇంకా—అలంకారాల రహితంగా వుంది. ఆ తెలుపుదనం హృదయంలో ఉన్నదీ లేనిదీ తెలుసుకోటం చాలా కష్టం.

'ఓ. కె. సిస్టర్! ఇప్పుడు చాలా నయం. ఒక్క విషయం చెప్తాను వినండి—మీరలా ఎదురుగా నిలబడితే చాలు—మంచు బిందువులు కురుస్తున్నట్టుగా వుంటుంది...అన్నట్టు మామిత్రుణ్ణి పరిచయం చేస్తాను. ఇతను సుందరమూర్తి. పట్టె అమాయకుడు. తెల్లవన్నీ పాలని, నల్లవన్నీ నీళ్ళనీ నమ్మేరకం. జీవితంలో జయమంటే ఏవిటో తెలీదు. అపజయమంటే అసలు తెలీదు', అంటూ సాగసాగాడు. శశి ఏమీ మాట్లాడకుండా నవ్వుతూ అతను చెప్పేదంతా వింటూ నిలబడింది. సహనం ఆమెలో శిక్షణపొంది వుండాలి. నెమ్మదిగా ఇంజక్షనిస్తూ 'బాధగావుందా?' అనడిగింది.

'ముందే చెప్పాను. మీరున్నంతవరకూ ఆ మాటకర్థం లేదు.'

ఆమె వెళ్ళిపోతూంటే కన్నార్పకుండా చూస్తూ శివరావు ప్రశ్నించాడు.

ఆ అమ్మాయి ఎవరో తెలుసా?'

'తెలుస్తూనే వుంది. తెల్లదుస్తుల్లో వున్న ఓ పాలరాతి విగ్రహం.'

శివరావు పకపక నవ్వాడు. దాంతో ఆపరేషన్ చేయబడినచోట నొప్పి పుట్టిందిగాబోలు. బాధగా మూలిగాడు.

'నువ్వు రాతియుగంలో పుట్టవలసినవాడివి. ఆమె తెలుగుదేశపు చందమామ. నక్షత్రాల్లోవున్న తళుకు బెళుకులన్నీ వున్నాయి. ఒక్క చిరునవ్వు నవ్విందంటే అడవిపువ్వుల సువాసనంతా గుప్పుమంటుంది.'

'మాదు శివరావు! నీ వర్ణనలన్నీ ఓ కాగితం మీద రాసి తరువాత యిద్దువు కాని—చదివి సంతోషిస్తా-'

'ఇంతకూ నేను చెప్పేది నువ్వు పూర్తిగా వినలేదు. ఆ అమ్మాయికి పెళ్ళి నిశ్చయమైంది.'

గుండెలో రాయిపడింది. 'చచ్చాంపో—' అన్నాను.

'చాలా కాలంక్రిందట-పెళ్ళికి ఓ రోజుముందు పెళ్ళికొడుకు తాలూకు వారెవరో చనిపోతే అందుకు కారణం ఆ అమ్మాయి జాతక మేనన్నారట. పెళ్ళి రద్దైంది. వరుడు పట్టి చవటయ్యుండాలి. ద్రాక్షపళ్ళ గుత్తిని చేతికిచ్చినా తినలేదు. 'తినకు నాయనా! అది విషం!' అన్నారుట పెద్దలు. దూరంగా విసిరేశాడు. ఆ పరిస్థితుల్లో నేనైతే ఆ అమ్మాయిని హెలికాప్టరులో ఎత్తుకుపోయి బొంబాయిలో వాలిపోదును.'

ఇంతలో శశి అక్కడకు రావటంతో సంభాషణ ఆగిపోయింది.

'మీరు ఎక్కువగా మాట్లాడకూడదు...గాయం మానేవరకూ జాగ్రత్తగా వుండాలి...నిన్నరాత్రి పాలు వద్దన్నారట! ఏవిటి కారణం? ఇక్కడ మీ కిచ్చే ఆహారమే తక్కువ. అదికూడా వద్దని సత్యాగ్రహంచేస్తే బ్లడ్ సర్క్యులేషన్ సరిగ్గావుండదు.' అనేసి టెంపరేచర్ చార్టులో గుర్తుపెట్టి వెళ్ళిపోయింది.

'అయితే శివరావు!...ఇప్పుడు నిన్ను అనుగ్రహించేదెవరు? నీ కింకా పెళ్ళికాలేదు. మంచి వుద్యోగం వుండేవుంటుంది. ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు? అయినా నా వ్రతికాని తతంగమంతా యీ పాటికి పూర్తయ్యేవుంటుంది.'

'అది సరేకాని 'తతంగం' అన్నమాటకు నానార్థాలు చాలా వున్నాయి కనక దాన్ని వుపసంహరించుకోవలసింది...నిజం చెప్తున్నాను. ఈ నర్సుల ప్రేమమీద నా కంతగా నమ్మకంలేదు. వాళ్ళ జీవ

తంలో పరిపక్వ వ్యక్తిని, అంటే తమ అభిరుచులకు సరిపడిన, తమతో సహకరించగలిగిన వ్యక్తిని పెళ్ళి చేసుకుంటారని నాకు నమ్మకంలేదు. రోగుల విషయాలు తెలుసుకోగలరు కాని తమ జీవితాలు నిర్ణయించుకోలేరు.'

ఎవరో పేషంటుకు ప్రమాదించినటుగా వుంది. ముగ్గురు డాక్టర్లు, నర్సులు, సర్జను పరుగెత్తారు.

'అది నేను వొప్పుకోను.'

'అవును. శశి ప్రేమించింది నన్ను కాదు. మరొకరిని.'

శివరావు తీరే అంత-ఆకాశంకేసి చూపించి 'అదుగో-ఏవిటో సుంద్రంగా, పలకలుగా మెరుస్తోంది.' అని నక్షత్రంకేసి చూపిస్తాడు. ఆ మరొకరెవరని ప్రశ్నించేలోగా 'అదుగో! అప్పుడే విలన్ తయారు' అన్నాడు. అటు తిరిగి చూసేసరికి జూనియర్ డాక్టర్లతో మాట్లాడుతూ సావంత్ కనిపించాడు—శశి మరాఠీపిల్లని సావంత్ ఎందుకన్నాడో ఇప్పుడే కొద్దిగా అర్థమవుతూంది. శివరావు చెప్పుకుపోయాడు.

'నీ కళ్ళల్లోవున్న వేలాది ప్రశ్నలు నేను చదవగలను. శశి ఓమరాఠీ డాక్టరును ఎలా ప్రేమించిందని- ప్రేమకు అలాంటి తేడాలులేవు-అంతేకాదు - వాళ్ళిద్దరికీ పెళ్ళైవుంటుందని నేననుకుంటున్నా. ఈ సంగతి నేనెలా గ్రహించానన్న అనుమానం నీకు రాకుండా వుండదు. నేను సగం మత్తులో వున్నప్పుడు వాళ్ళ ప్రేమకలాపాలు నా చెవుల్లోంచి దూసుకుపోయ్ మెదడులో గిలిగింతలు పెట్టేవి. అతను అదృష్టవంతుడు.'

శివరావు ఆయాసంతో ఆగిపోయాడు. కుళాయి తిప్పగానే నీరువచ్చేటు కట్టివేసేదాకా అతని ధోరణికి అంతంటూవుండదు. 'సరేలే!...తరువాత మాట్లాడుకుందాం. మళ్ళీ రెండురోజుల్లో వస్తా,' అనేసి బయటకువచ్చేశాను. మాటవరసకు అలాగన్నానే కాని రావటం నాకెంతమాత్రం యిష్టంలేదు. అతను కొత్త కొత్త సమస్యలు సృష్టించి పద్మవ్యూహంలోకి విసిరి బలపరీక్ష చేసుకోమంటాడు. సర్జికల్ వార్డు వదిలి బయటకురాగానే గడియారం అయిదు కొట్టింది. నా చేతిగడియారం ఇంకా అయిదుకు అయిదు నిమిషాలుందంది. ఒక్క నిమిషం పోయాక అవతల వార్డులో వున్న గడియారం అయిదు కొట్టింది. నాకు నవ్వొచ్చింది. మనుష్యుల హృదయాలకు మల్లే రెండు గడియారాలు కూడా సరైనకాలాన్ని చూపించవు. జీవంలేకపోయినా ఈ విరుద్ధభావాల మధ్య యుద్ధం తప్పదు. దిగటానికి లిఫ్టు లభ్యంకాదు. కనక నాలుగు మెట్లు దిగేసరికి శశి ఎదురుగా వచ్చింది. మా హృదయాల మధ్య దూరం కొన్ని వేల మైళ్ళైనా ఆమె నాకు అడుగుదూరంలో వుంది. అక్కడెవరూ లేరు.

'చూడుశశీ.......మనిషన్నవాడు ఏదో పొరపాటుచేయక మానడు. ఒకవేళ నేను నీకు అన్యాయం చేశానంటే అది పరిస్థితుల ఒత్తిడివల్ల - అందుకు నేనెంతగానో బాధపడుతున్నా, నువ్వు క్షమించాలి.'

'క్షమించటానికి నేనెవర్ని? అయినా ఆమాట కర్థంలేదు. మీరు నావిషయంలో చేసింది వుపకారమే కాని అపకారం కాదు. నేను అందరికి మల్లే బతికి వుంటే ఈ తృప్తి వుండేదికాదు- రోగులకు సేవ చెయ్యటం నాకెంతో ఆనందంగావుంది...మిమ్మల్ని నేనుకోరేది ఒక్కటే. దయవుంచి నన్ను బాధపెట్టకండి- నాగురించి ఎలాంటి శ్రద్ధతీసుకోవద్దు. జరిగినదంతా మర్చిపోండి.' అనేసి వెళ్ళిపోయింది. నాభుజం మీద బరువైన చెయ్యిపడటంతో వెనక్కి తిరిగి చూశాను. సావంత్! అతను మాసంభాషణ వినే వుంటాడు - అయినా అతనికేవీ అర్థమైవుండదు.

'పదండి! అలా బీచ్ వేపు వెడదాం-' అన్నాడు.

చలనంలేకుండా వెంబడించాను. శశి మాటలు విస్పరింగ్ గాలరీలో ధ్వనులమాదిరి పదేపదే వినిపించాయి.

బయట ఎర్రటి మెర్క్యురీకారు నిలబడుంది. అయిదు నిమిషాల్లో వేగం అందుకుంది. ఏదో చిన్న గాయానికి చికిత్సకోసం వెళ్ళినందుకు సావంత్ నన్నింతగా ఆదరించి గౌరవిస్తున్నాడనుకోను. పెద్ద పెద్ద మేడలు వెనక్కి కదలిపోతున్నాయి. మెరైన్ డ్రైవ్ వచ్చింది. సముద్రంవుంది కానితీరం లేదు. అందుకు బదులు పొడుగాటి గట్టువుంది. సావంత్ కారు ఓమూల నిలిపి ఫిషింగ్ రాడ్ తీసుకుని బయలుదేరాడు. ఆలాపిస్తూ

గట్టు చివరకు చేరుకుని ఓ రాతిమీద కూర్చున్నాను. సముద్రపు టలలు ఏదో అపురూపమైన వస్తువుదొరికి నందుకుగాబోలు సంతోషంతో ఎగిరి పడుతున్నాయి. నాపక్కనే వున్న మహమ్మదీయుడు ప్రార్థనలు వల్లిస్తున్నాడు. ఓ గుజరాతీ దంపతులు అస్తమిస్తున్న సూర్యుడికోసం కాసుక్కూర్చున్నారు. సావంత్ వీలై నంతవరకు గాలంవిసిరాడు. ఒక్కడుగు కిందకు వేసి మరో రాతిమీద నిలబడ్డాడు. అతనికాళ్ళను తడిమి వేయబడ్డ నీటిప్రవాహాలు చుట్టు ముడుతున్నాయి. ఆంగ్లంలో ఆలాపించిన 'చెక్నిక్' గీతం నెమ్మదిగా పాడుతూ ఆలోచనలో వున్న వాడిలా కనిపించాడు. ఏ ఆశయ సిద్ధికోసం నిద్రాహారాలు మానుకుని ఈ జలప్రవాహం మేలుకుని వుందో తెలుసుకోటానికి ప్రయత్నిస్తూ—బాహ్య ప్రపంచానికీ, నాకూ మధ్య వల్ల తెరదించుకుని—శిబరావులకు కేకలకు దూరంగా ఇంకొదూరంగా అక్కడే వుండిపోవాలనిపించింది. గోల్డ్ స్మిత్ వర్ణించిన 'నైట్ ఫాల్స్' జ్ఞప్తికివచ్చింది. హిల్టన్ పొగడిన టిబెట్ దేశపు స్వర్గంలోకి విసిరి వేయబడ్డాను. ఆ ప్రవాహం ఒక్కసారిగా మీదపడి నన్ను ముంచివేసినా నాకు తెలియదు. ఆ సముద్రంలో యీదటానికి ఎవరో వ్యక్తి ఒక్కసారి దుమికేసరికి నిద్రలోంచి మెలకువ వచ్చింది. సావంత్ నెమ్మదిగా దారం రివైండ్ చేసి ఎరని విరిచాడు. మళ్లీ మరోదిశగా బలం కొలదీ విసిరాడు.

'చేప చిక్కనే లేదా?' అనడిగాను.

'లేదు...ఒక్కోనాడు చిన్న చేప కూడా దొరకదు. ఒక్కొక్కప్పుడు మరొకరు తన్నుకు పోతారు. ఏంగ్లింగ్ అంటేనాకు శ్రద్ధ తగ్గుతుంది! చేప నే మాటకేకి అన్వయిస్తుం దేమోనని చూశాను.

రెండునిమిషాలు మళ్ళీ నిశ్శబ్దం-ఒకరి మనసు మరొకరికి తెలుసు కాని అభిప్రాయాలు ఎలా వ్యక్తం చేయాలన్న దే సమస్య.

'మిస్టర్ మూర్తి!...మీరు అపార్థం చేసుకోవద్దు. కళ మీకెంత ప్రీతమో తెలుసా?'

ఆలోచించి సమాధానం యివ్వటానికి అవధి లేదు.

'అవును—తెలుసు' అన్నాను.

'ఎలా?' అనడిగాడు. అతని చూపుల్లో మార్పును గమనించాను. నిజాన్ని చెప్పటమా! మానటమా? ఏదో సినిమాలో నిజం చెప్పమంటారా? అబద్ధం చెప్ప మంటారా?' అన్నమాటలు జ్ఞాపకాని కొచ్చాయి. నిజంచెబితే, శివరావన్నట్టు అతనికి కళకి మధ్య ప్రేమ వుంటే నాకథ కొంత తుఫాను సృజించక తప్పదు. ఏదో అబద్ధం చెప్పి తప్పించటానికి ప్రయత్నిస్తే వృథా అవుతుంది. అబద్ధం ఆడటానికైనా మంచి నేర్పు వుండాలి. ఏమాత్రం లోపంవున్నా నూనెలేని దీపంలా తన స్వరూపం చూపిస్తుంది. అయిదారు వాక్యాల్లో కథను వ్యక్తంచేశాను. సావంత్ విన్నాడు. ఏమీ సమాధానం చెప్పలేదు. మరో అరగంటకు వెనక్కి తిరిగాం - చేపమాత్రం అతని గాలంలో చిక్కనే లేదు.

ఆనాటినుంచి మా మైత్రి బలిసింది. రెండు ఆది వారాలు నన్ను 'ఇరాన్'లో బాల్ డాన్సు చూడ టానికి తీసికెళ్ళాడు. నన్నొకమాటు బాల్ డాన్సు నేర్చుకోమని బలవంత పెడితే అప్పుడోలేనంత నవ్వొచ్చింది. ఓనాడు మలబార్ హిల్ కు తీసుకువెళ్ళి ఫోటోలు తీశాడు. మరోనాడు 'ఎలెఫెంటా' గుహలు చూశాం. అతని జీవితవిధానం చూస్తే స్థితి మంతుడని, కేవలం ఈ ప్రాక్టీసు మీద ఆధారపడటం లేదని అర్థమైంది:

'మెట్రో'లో ఏదో ఆంగ్ల చిత్రానికి టికెట్ బుక్ చేసి తనకోసం కాసుకుని వుంచమన్న సావంత్ కనిపించక పోయేసరికి ఆశా భంగం కలిగింది. షో మొదలు పెట్టేశారు. ఇంక అతనురావటం వుండదని ఫోన్ చేశాను. అతనికి మూడురోజులుగా జ్వరంగా వుందని, వచ్చి చూడవలసిందని జవాబు వచ్చింది.

సాయంత్రం నేనువెళ్ళేసరికి ఎవరో లేడీడాక్టరు ఇద్దరు ముగ్గురు పేషంట్లను చూస్తోంది. సావంత్ పైన వున్నాడని వెళ్ళి కలుసుకోమంది. గదిలో అతి కొక్కడే మంచంమీద పడుకుని వున్నాడు. ఈ మూడు రోజుల్లో అతను నెలరోజులపాటు వ్యాధి హస్తంలో చిక్కి శల్యమైనమనిషిలా కనిపించాడు. సావంత్ నన్నుచూసి నవ్వాడు.

'డాక్టర్! మీరే పేషంటయ్యారు.' అన్నాను దగ్గరగా కూర్చుంటూ. ఆ లేడీ డాక్టరు టెంపరేచర్ చూడటానికి వచ్చింది.

'ఈమె డాక్టరు శోభ - మేం యిద్దరం ఒకే సారి ఎం. బి. బి. యస్. పట్టా పుచ్చుకున్నాం. నా డ్యూటీ ప్రస్తుతం తను చేస్తోంది.'

ఆమెవంక చూశాను. రబ్బరుముక్క సాగదీసినట్టు మొహమంతా చిరునవ్వు వ్యాపించివుంది. వయసు ఇరవై సంవత్సరాల కెక్కువ వుండదు. ప్రపంచంలో సులభంగా తెలుసుకోలేని విషయాల్లో స్త్రీ వయసు ఒకటి. క్రిందనుండి ఫ్యూను పిలవగానే ఆమె వెళ్ళిపోయింది.

'మిస్టర్ మూర్తి! మిమ్మల్ని చాలాకాలంగా అడగాలనుకుంటున్నా. శశి నాగురించి ఏమైనా చెప్పిందా?'

'అంటే?'

'మరేం లేదు .. మేం యిద్దరం వివాహం చేసుకున్నట్టు కాని .. మరేదైనా' నాకేం బోధపడలేదు.

'అది నిజంకాదప్పుడు ఎందుకలా చెబుతుంది?'

'స్త్రీ మనసు చంచలమైంది. ఆమెను నేను ప్రేమించినట్టు చెబితే అంతగా బాధపడను. ఎన్నో ప్రేమలు నిరాశలో అంతరించాయి. కాని జరగనిదొకవిషయాన్ని చెప్పిందంటేమాత్రం సహించలేను' కోధవచ్చి యింజక్షన్ యిచ్చిపోయింది. అతను మళ్ళీ మొదలుపెట్టాడు.

'మీరు నన్ను అపార్థం చేసుకోగలరు. చేసుకున్నారు కనుక నిజం చెప్తున్నాను. ఒకప్పుడు మేం ఇద్దరం ప్రేమించుకున్నాం. ఆమె ఇదివరకు నా డిస్పెన్సరీలో వున్న సంగతికూడా మీకు తెలుసు. నన్నడిగితే స్త్రీ తన మనస్సులో వైమోగ్యవంతు మాత్రమే బహిర్గతం చేస్తుంది! చూడండి డాక్టర్!...మనిషి సగం జరిగినదానివల్ల-సగం జరుగుతుందని వూహించి భయపడుతున్నందువల్ల మనసు పాడుచేసుకుంటాడు. ఆమె మీ విషయం నాతో ఎప్పుడూ ప్రస్తావించలేదు. అందుకవకాశం లేదుకూడా. మీరు రెస్టు తీసుకోండి. తరువాత కలుసుకుందాం' అని సెలవు తీసుకుని బైటపడ్డాను.

సావంత్ పెద్ద సమస్యలో ఇరుక్కున్నాడు. అతని మాటలు, ప్రవర్తన జాగ్రత్తగా పరిశీలించిన మీదట నాలో నేనే కొన్ని సిద్ధాంతాలు కల్పించుకున్నాను. రుజువు చేయలేను కనుక అవి పూర్తిగా సరైనవని నేనూ నమ్మను. అందచందాలు చూసి అతను శశిని ప్రేమించివుంటాడు. ఆమె సౌందర్యాన్ని అనుభవించి వుంటాడేమో నన్నది వూహించలేని విషయం—కాని అందుకు అటంకాలే ఎక్కువ. స్వజాతికి చెందిన అమ్మాయి పెళ్ళి చేసుకోటం అతనికి రుచించకపోవచ్చు. లేక వగ్నాగా వుండటం యిష్టంలేదేమో! రోగులకు సేవచేయటం తనకిష్టమని శశి యిదివరకే చెప్పింది. గుండెలో ప్రతి అణువూ అర్పించలేని స్త్రీని ఎవరూ ప్రేమించలేరు. ఈ వాదం వితండవాదంలా ధ్వనించినా సత్యదూరం మాత్రం కాదు. దారాన్ని తెంపివేయడానికైనా, కత్తిరించటానికైనా కొంత శ్రమ అవసరం. ఏకీభవించిన హృదయాన్ని విడదీయటానికి దూరాన్నుంచి పదునుకత్తిని ఝళిపిస్తే చాలు. ఫలితం లభిస్తుంది. కొంతకాలానికి ఆమె అంటే అసహ్యం కలిగివుంటుంది. అయితే ఇద్దరికీ వివాహమైందని ఎందుకు చెప్పటం? అది కేవలం అతని మీద పగ తీర్చుకోటానికి చేసే ప్రచారం. సావంత్ జ్వరతీవ్రతలో లేనిపక్షంలో యీవిధంగా విప్పి చెప్పేవాడు కాదు. అతని హృదయం వెలుగు ప్రవేశించలేని గుహలాంటిది. దాన్ని తెరవటానికి తాళాలు ఎక్కడో ఇసుకలో పడివుంటాయి. వెదకి తీసుకురావాలి.

రెండు రోజులవరకూ సావంత్ ను కలుసుకోలేదు. అతన్నిగురించి ఆలోచించటం కూడా మానుకున్నాను. మూడోనాడు మధ్యాహ్నం దుర్గా నర్సింగ్ హోం నుండి టెలిఫోన్ కాల్ వచ్చింది. ఎవరో డాక్టరు శివరావు చనిపోయాడని వచ్చి చూడవలసిందని చెప్పాడు. బాస్ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళేసరికి రెండు గంటలయింది. ఆపరేషన్ తరువాత బాగానే కోలుకుంటున్నాడట—కాని మధ్య మధ్య ఎవరిమాటా వినకుండా బయటకు వెళ్ళి ఆకాశంకేసి చూస్తూ నిలబడేవాడట. ఉన్నట్టుండి పన్నెండు గంటలకు బాధ ఎక్కువై చనిపోయాడట. చివరిక్షణంలో టెలిఫోన్ నంబరిచ్చి విషయం తెలియజేయమన్నాడు. అతని తలిదండ్రులు గుండెలు బాదుకుని ఏడుస్తున్నారు.

'ఈ పుత్తరం మీకిమ్మన్నారు' అంటూ ఓ కవరందించారు. కడసారిగా అతని మృతశరీరం వంక చూశాను. అతనికీ నాకూ ఉన్న పరిచయం పెద్దది కాకపోయినా అతనంటే నాకోవిధమైన అభిమానం, ప్రేమా వున్నాయి. ఆ పుత్తరంలో ఏముందో చదవబుద్ధి వేసిందికాదు. నిజాన్ని ఎదుర్కోటం నాకు భయంగావుంది. తీరాచేసి ఆ పుత్తరం చదివితే

అందులో ఎలాంటివార్తలుంటాయో! తిన్నగా డిస్పెన్సరీకి వెళ్లాను. ఏనుగు తలకాయంత తాళం వేలాడుతూవుంది. పక్కనున్నవారి నడిగితే వుదయం పూనా వెళ్లాడని తెలిసింది.

ఆ మర్నాడుదయం ఖాళీగావున్న ఫస్టుఫ్లోర్ గదిలోకి ఎవరో అమ్మాయి వచ్చిందని తెలిసింది. ఈ పాటికి మీరు వూహించే వుంటారు. ఆఫీసునుండి వచ్చాక తిన్నగా అక్కడకు వెళ్ళాను. తలుపు వేసుంది. కిటికీలోంచి దొంగచూపు చూస్తే అద్దంముందు నిలబడి తల దువ్వుకుంటున్న శశి కనిపించింది. ఎంత పొడవున్న జుత్తో! దానితో వందమంది ప్రియుల్ని కట్టి వేయగలదు. బాల్కనీ చివరి వరకూ వెళ్ళి రెండునిమిషాల పాటు ఏదో చూస్తున్నట్టు నటించి తిరిగివస్తూంటే శశి గుమ్మందగ్గర నిలబడుంది.

'అలా దొంగలా చూసి వెళ్ళటం దేనికి? లోపలకు రండి' అంది. ఆశ్చర్యపోతూ లోపలకు వెళ్ళాను. కళ్లల్లో ఎంతకోపం వుందని చూశాను. పెదవులు బిగించి నవ్వుతూ కళ్లు చిట్లించింది. గదంతా చూశాను. శశి స్టౌ వెలిగించి కాఫీకి నీళ్లు పెట్టింది. రెండుమూడు పెట్టెలు—నర్సు యూనిఫారంలో నవ్వుతూంది. ఇంకా ఎవరెవరివో ఫోటోలు గోడమీదున్నాయి. ఆ వ్యక్తులెవరూ నాకు పరిచితులు కారు. చిన్న బుష్ రేడియోలోంచి ఏదో పాశ్చాత్య సంగీతం కొద్దిగా వినిపిస్తోంది. పదినిమిషాల్లో టీ సెట్టు టీపాయ్‌మీద వుంచింది. తనే స్వయంగా కాఫీ కలిపిచ్చింది. నాచేతులోకి రాగానే జారి కిందపడి ముక్కలై లయగానం చేసింది.

చొక్కామీద కొంత కాఫీ తొలికింది.

శశి కొంచెం కంగారుపడింది.

'ఇది కూడా దుశ్శకున మే ననుకుంటా!' అంటూ నవ్వటానికి ప్రయత్నించింది. అదో హెచ్చరిక లాంటిది.

'లేదు శశీ!...ఆ అభిప్రాయాలు ఏనాడో నన్ను వదులుకున్నాయి.'

తరువాతి రెండు నిమిషాలను నిశ్శబ్దం మింగి వేసింది.

డాక్టర్ సావంత్ డిస్పెన్సరీ వదిలే వరకూ పైన గదిలో వుండేదాన్ని. ఆయనకూ నాకూ మన స్పర్థలు రావటం మూలాన ఇక్కడకు మారవలసి వచ్చింది. అదృష్టవశాత్తూ మీకు దగ్గరగా వచ్చేశాను. ఆనాడు ఎందుకలాగన్నా నని పశ్చాత్తాప పడని క్షణంలేదు.' అంటూ ఏదేదో చెప్పుకుపోయింది. ఈ స్వల్పకాలంలో శశి వూహించలేనంతగా మారి పోయింది. ఓ కాగితంమీద నలుపు తెలుపు గీతలుగీస్తే ఎలా వుంటుందో అలా వుంది ఆమె జీవితం.

ఆ తరువాతి నాలుగైదురోజుల్లో శశికీ నాకూ మధ్య అనురాగం తిరిగి చిగురిస్తున్నట్టనిపించింది. హఠాత్తుగా శివరావు వుత్తరం విషయంజ్ఞాపకానికి రాగానే దానికోసం వెదక సాగాను. అరగంట నా సహనాన్ని పరీక్షించి బరువుగా అరచేతిలో వాలింది. కవరు చించి చదివాను.

'డియర్ మూర్తి!

చివరి పలకరింపు—మన బతుకు మనకు ముందే తెలుసులే! నీకో చివరి సలహాయిచ్చి మరీ ఆకాశంలోకి ఎగిరిపోదామని యీ వుత్తరం రాస్తున్నా. శశి నాకు చిన్నప్పట్నుంచీ తెలుసు. ఆమె నిన్ను ప్రేమించవచ్చు-కాని మోసపోకు. ఆమె ప్రేమలో నాకు నమ్మకంలేదు. శశి నన్ను ప్రేమించిందంటే ఆశ్చర్యపడతావా?...అబ్బే! అలాంటిదేమీ లేదు. నీలాంటి మందబుద్ధికి షాక్ ఇవ్వటం న్యాయం కాదు. వూరికే అన్నాను అంతే. గోతిలో మాత్రం పడక బుద్ధిగా నడుచుకో.'

వుత్తరం మడిచి ఓ పుస్తకంలో భద్రపరచి కిటికీలోంచి బయటకు చూశాను. పసుప్పచ్చని టాక్సీ రోడ్డు వారగా ఆగింది. రెండు నిమిషాల్లో డాక్టర్ సావంత్ నా గదిలోకి రావటం ఆశ్చర్యాన్ని కలిగించింది. అతని గడ్డం బాగా పెరిగింది. కళ్ళకింద నల్లటిగీతలు కనిపించాయి. అతని వెనకాలే టాక్సీ డ్రైవరు వచ్చాడు. 'మిస్టర్ మూర్తి! దయవుంచి అతనికి అయిదు రూపాయలివ్వగలరా?' అనడిగాడు. డబ్బిచ్చి అతన్ని పంపి వేశాను.

'డిలక్స్' తప్పించి మరోరకంకాల్చని సావంత్ 'చార్ మినార్' వెలిగించి మేఘాలు సృష్టించాడు.

'మీకు నన్ను చూస్తే అసహ్యంగా వుంది కదూ!...ఎవరెస్టుమీదనుంచి ఆల్ప్సుమీదకు ఒక్కసారిగా దూకేయాలనుకుంటే ఏమవుతుంది?'

'ఏ ఒక్క శిఖరంమీదనుంచి దూకినా పదిగజాల కంటే వెళ్ళలేం. వెళ్లేది మళ్లో లోకానికైనప్పటికీ'

'అలా ఎందుకనుకోవాలి?... నా విషయంలో జరిగినట్లు కొత్యూ చేతులా వివరమ్ము.'

'డాక్టర్! ఎందుకీ పొడుపు కథలూ, చిక్కు ప్రశ్నలూనూ? జరిగిన సంగతి చెప్పండి.'

'నా బతుకులో రెండో అధ్యాయం ప్రారంభమైంది. ఇంతకాలంగా నేను చేసినదంతా నటన-నా ప్రాక్టీసు సరిగ్గా లేదు అప్పుల మధ్య చిక్కుకున్నాను. ఓ పెద్ద అడవిలోంచి నడచి వెళ్లాలంటే జాగ్రత్తగా ప్లాను వేసుకుని వెళ్లటం అవసరం. లేకపోతే ఏ పామో కాటు వేస్తుంది. ఏ పెద్దపులో సగం కొరికి వదిలేస్తుంది. పోనీ-మింగవన్నా మింగదు.'

నేనేమీ సమాధానం చెప్పలేదు. కొంతసేపు పూరుకున్నాక మళ్ళీ మొదలుపెట్టి చివరకు తనకో వెయ్యి రూపాయలు కావాలన్నాడు. నేనా సాయం చేస్తానని అతనూ నమ్మివుండడు. నా అశక్తతను వెల్లడించాను.

'శశి ఎక్కడుందో తెలుసా?' అనడిగాడు వెళ్ళటానికి లేస్తూ-'పైన మూడో నంబరు గదిలోవుంది.' అన్నాను. పైన వున్న నక్షత్రంలోంచి కొంచెం వెలుతురు అతని కళ్ళల్లో జారిపడ్డట్టయింది. విపరీతంగా బూట్ల చప్పుడు చేసుకుంటూ పైకి వెళ్లాడు. నేనతన్ని వెంబడించటం హాస్యాస్పదం. పావుగంటలో తిరిగి వెళ్ళిపోయాడు. కొంత వాగ్వాదం-పెనుగులాట జరిగివుండాలి. నెమ్మదిగా పైకి వెళ్లాను. శశి ఏడుస్తూ కూర్చుని వుంది. మెడదగ్గర తెల్లటి చర్మంలోంచి నెప్పలు గీతలా రక్తపుజీర తొంగిచూస్తోంది.
నన్ను చూడగానే నవ్వటానికి ప్రయత్నించింది.

'నా మెళ్ళో వున్న నెక్లెస్ హావంత్ నాపుట్టిన రోజుకు బహూకరించింది. బలవంతాన లాక్కుపోయాడు. అదీ ఒకందుకు మంచిదే—' అంది. రెండు రోజులు గడిచాయి.

రీగల్‌లో 'ఒమర్ ఖయ్యాం' పిక్చర్ చూద్దామని మాపక్కనున్న కృష్ణమూర్తితో వెళ్లాను. షో మొదలు పెట్టేసరికి శశికూడా వచ్చింది. సగం చిత్రం చూశాక వెళ్ళిపోదామంది. కృష్ణమూర్తి ఏమనుకుంటాడోనని కొంచెం తటపటాయించినా చివరకతనికి తీరూపణ చెప్పుకుని బయటకొచ్చేశాను. చల్లగాలికి తట్టుకోలేక పోయింది గాబోలు పమిటతో ఒళ్ళంతా కప్పుకుంది.

'ఏం శశీ!...కర్నల్ వైల్డ్ నటన నచ్చలేదా?' అనడిగాను.

'కాదు ఒమర్ ఖయ్యాం ఫిలాసఫీ అంటే నాకు నచ్చదు.'

'అయితే ఎందుకు వచ్చావు?.........నిజానికి లోతుగా ఆలోచిస్తే అతని ఫిలాసఫీ సరైనదనిపిస్తుంది. మనిషి జీవించటం సుఖించటం కోసమంటాడు. అందులో తప్పేముంది? రేపు ఏం జరుగుతుందో తెలియదు. నిన్న జరిగిన దానితో మనకు సంబంధం లేదు. మనసులోవున్న అభిప్రాయాన్ని మొహంమీద చెప్పేయమంటాడు.'

'అందరూ అతన్ననుసరిస్తే ప్రపంచం మాటేమిటి?'

'అందుకని ఏడుస్తూ కూర్చుంటే సుఖం దొరుకుతుందంటావా?'

శశి మాట్లాడలేదు.

మంచికీ—చెడుకీ మధ్య సల్పటి తెరమాత్రమే అడ్డం—ఒక్కోసారి—అర్ధరాత్రి చీకటిలో—అది కాస్తా చిరిగిపోతుంది. అంతవరకూ ఆకాశంలో అందకుండా తిరుగుతున్న మనసు ఒక్కసారి నేలమీదపడి ముక్కలైపోతుంది. ఆముక్కల్ని ఏరి అతికి రంగు పూసి కొత్త మనసు తయారుచేసే ఓరిక, ఓపిక ఎవరికీ వుండదు. పీడనశక్తి అవధి దాటిపోగానే రబ్బరు బెలూను పగిలిపోయినట్టు, ఆలోచనల ఒత్తిడి—అనుభవాల భయంకర నిశ్శబ్దం—'అన్ కాన్షస్ మైండ్' లో ఇనుపకీకుల్లా ఒక దానిమీదొకటి పేర్చబడి వున్నప్పుడు స్థలంచాలక 'సభ్యత'ను పగలగొడతాయి. ఇది ప్రతి వ్యక్తి మెదడులోనూ జరిగే నిత్య సంఘర్షణ. ఏడ్లర్ వ్రాసిన సిద్ధాంతాలన్నీ జ్ఞప్తికి వచ్చాయి. అలా ఎక్కడికి నడచిపోతున్నామో తెలియదు. గమ్యస్థానం గురించిన ప్రశ్న ఎవరికీ కలగలేదు. జహంగీర్ హాల్ — రాజాభాయ్ టవర్ — మెర్కంటైల్ బిల్డింగ్ — సి. టి. ఆఫీసు అన్నీ వెనక్కి జరిగిపోయాయి. ఫ్లోరా ఫౌంటెన్ దగ్గరకు వచ్చాక ఎటు వెళ్ళాలన్న ప్రశ్న వుదయించింది.

'నా వెంట రండి' అంది శశి గాలికి ఎగిరిపడుతున్న ముంగురులు సరిచేసుకుంటూ—తిన్నగా మెరిన్ డ్రైవ్ అగ్రం చేరుకుని రాతిమీద కూర్చున్నాం—శశికీ నాకూ మధ్య దూరం లేదు. అదేచోట సావంత్ నా కథంతా విన్నాడు.

మరొకరైతే శశివంక కన్నెత్తయినా చూడరు-కాని అదో జబ్బులాంటిది-పెద్ద నవ్వులాంటిది. ఎన్ని అడ్డంకులు కలిగించినా ఆగని ప్రవాహంలాంటిది. అలా నడుస్తూవుంటే ఎర్రటి గులాబీపువ్వు నేలమీద పడివుంది. ఒక రకం వ్యక్తి దాన్ని తన మొరటుచేతితో తీసి రేకలు వూడి, సౌందర్యం అంతరించి, కన్నీరు కాల్వలు కట్టేటట్లు దాన్ని ఆఘ్రాణించి నలిపి పారేస్తాడు. మరోరకం వ్యక్తి దాన్ని చేతిలో తీసుకుని గట్టిగా ఏడుస్తూ 'అయ్యో! పువ్వమ్మా!' అని ఆక్రోశిస్తూ గజం లోతున గొయ్యి తవ్వి దాన్ని సమాధి చేస్తాడు. వీళ్లంతా అసాధారణ వ్యక్తులు. నాలో అలాంటి భావాలేవీ లేవు. దాని మృదుత్వం, సొగసు చెడకుండా ముద్దు పెట్టుకుని వాడిపోయేదాకా చూస్తూ కూర్చుంటాను. అంతే! ఏ రకమైన హానీ తలపెట్టను.

'శశీ!... ఆలోచనకు అంతుండదు. ఆలోచిస్తూ కూర్చుంటే ఏ నిర్ణయానికీ రాలేం. నా మాట విను. మనిద్దరం వివాహం చేసుకుందాం-గడచినదంతా పీడకల.'

శశి నావంక పిచ్చెత్తినట్టు చూసి తలవంచుకుని కూర్చుంది. ఆమె కళ్లల్లో అనంతవిశ్వం సంద్రంగా కదులుతున్నట్లనిపించింది. ఆ రాత్రంతా తీయని అనుభూతులతో నిద్ర పట్టలేదు. కృష్ణమూర్తి ముందుగా నే వెళ్ళి నాగురించి కొంత ప్రచారం చేశాడు. కాని మేం ఎవర్నీ లక్ష్యపెట్టలేదు. ఆ రాత్రి పన్నెండు గంటల దాకా మాట్లాడుతూ కూర్చున్నాం-నా క్కావలసింది అందచందాలు, డబ్బు—హోదా—కీర్తి ప్రతిష్ఠలు కావు—అర్థంచేసుకోగల్గిన హృదయం—అదే చివరకు లభించింది. శివరావు వుత్తరం నన్ను మార్చలేదు.

ఆ మర్నాడు నిద్రలేచేసరికి ఎనిమిదైంది. శశి అప్పటికే ముస్తాబైంది.

'అన్నట్లు చెప్పటం మరిచాను. నేను నర్సుగా వుండకూడదని నిశ్చయించుకున్నాను' అంది.

'కాని నా హృదయానికి మాత్రం నర్సుగా వుండాలి' అన్నాను. సిగ్గుతో తలవంచుకుంది.

తొమ్మిది గంటలకు నా పేర టెలిగ్రాం వచ్చింది. అది జబ్బల్‌పూర్ స్టేషన్‌మాస్టర్ ఇచ్చిన టెలిగ్రాం.

'డాక్టర్ సావంత్' అనే వ్యక్తి రైలుకింద పడి చనిపోయాడని, అతని కోరికమీద నాకు వైరివ్వటం జరిగిందని దాని తాత్పర్యం—శశికి చూపించాను. ఆమె కుప్పలా కూలిపోయింది—కుడిచేత్తో నుదుటిమీదున్న అర్ధ చంద్రాకారపు బొట్టు చెరిపి వేసుకుంది. అయోమయ పరిస్థితిలో పడ్డాను-మరో అయిదు నిమిషాలకు పోస్టుమేన్ వుత్తరం అందించాడు. అది సావంత్ వ్రాసింది.'

'మిస్టర్ మూర్తి!

ఈ వుత్తరం అందేసరికి నే నెక్కడుంటానో తెలియదు. నిర్భయంగా మీతో ఒక్క సంగతి చెబుతున్నాను. నర్సుకోర్సుకు ట్రెయినింగ్ అవుతున్నప్పుడే శశితో నాకు స్నేహమైంది. తరువాత ఏడాదికి ఆమెను—(కంగారు పడకండి—మీకీ వార్త పిడుగు పడ్డట్టే వుంటుంది) వివాహం చేసుకున్నాను. తరువాత మామధ్య అభిప్రాయభేదాలు కలిగాయి. దాంతో శశి నన్ను విడిచింది. డాక్టరు శోభను రిజిస్టర్ మారేజీ చేసుకుందామనుకున్నాను. అది సాగలేదు. నాజీవిత పతనం ఆరంభమైంది. అంతం కాబోతూంది. ఇంక అదృష్టం మీదే!—'

శశి మొహంమీదకు ఆ వుత్తరాన్ని విసరికొట్టి కిందకు వచ్చేశాను. నాలో అణగివున్న శక్తులు మేల్కొన్నాయి. తడిగుడ్డతో గొంతుకు కోసినట్టు ఆమె ఎంతటి పన్నాగం పన్నింది! సహించలేకపోయాను—ఆ విసురులో తాళం వేసుకుని ఆఫీసుకు వెళ్ళి రాత్రి ఎనిమిదిగంటలకు తిరిగి వచ్చాను. మేడ మీదకు వెళ్ళేసరికి శశిగది తలుపు తాళం వేసి వుంది.

ఎందుకో ఆమె తిరిగి రాదనిపించింది.

ఒకటి—రెండూ—మూడూ—అలా రోజులు దొర్లిపోయాయి. శశి తిరిగి రాలేదు. రాదుకూడా—మళ్ళీ ఎక్కడో కొత్తగా జన్మించి జీవితం ప్రారంభిస్తుంది. ఒక్క విషయం మాత్రం నిశ్చయంగా చెప్పగలను. ఆమె ఎన్నడూ ఆత్మహత్య చేసుకోదు. ఎప్పుడో, ఎక్కడో అకస్మాత్తుగా తళుక్కుమని మెరుస్తుంది. ఆరోజుకోసం ఎదురుచూస్తూ కూర్చోవలసిందే!

# శాకుంతల చతుర్థాంకము: పినవీరభద్రుని రచన

శ్రీ ప. గోపీచంద్

శ్రీనాథుని కాలము పురాణ ప్రబంధ కాలములకు సంధికాలము. (The Age of Transition) కవిత్రయాదుల పురాణేతిహాస లక్షణములును, దరువాతి ప్రబంధము లక్షణములు కొన్నియు నీ సంధికాలము నందలి కావ్యములయందు వెలకొనియున్నవి. ప్రఖ్యాతము గొంత గ్రహించి (వస్తు స్వీకరణము), కల్పనములను, వర్ణనములను జేయుచు రసాభివ్యక్తికిఁ బ్రాధాన్యము నొసఁగి రచియించుట మిశ్రకావ్యధర్మము.

ఈ సంధికాలమునందు శ్రీనాథుని సమకాలీనుఁడైన పిల్లలమఱ్ఱి పినవీరన శృంగారశాకుంతల కావ్యమట్టి మిశ్రకావ్యము. ఇది తరువాతి పెక్కు ప్రబంధముల కెన్నియో రీతుల మార్గదర్శకమై యున్నది. ప్రబంధ కావ్యసామగ్రి యగు నష్టాదశవర్ణనాదికములు, అంగిరసముగ శృంగారము, అంగముగ వీరము నీ కావ్యము నందున్నవి. వస్తువిన్యాసమున భారతేతిహాసమును, గాళిదాసాభిజ్ఞానశాకుంతల నాటకము నాధారములయ్యును గవి స్వకపోల కల్పనాశిల్పము జూపఁగలఁడు. కావ్యరచనమున భారతముకంటె, కవి చాలవఱకుఁ గాళిదాసీయమునే యనుసరించినాఁడు.

కాళిదాసు రచించిన శాకుంతలనాటకము దృశ్యకావ్యము. నాటక ముఖ్యలక్ష్యము రంగ ప్రదర్శితమైన సామాజికులకు రసనిష్పత్తిఁ గల్గించుట. నాటకమునందుఁ బ్రదర్శనార్హమగు కథాసంవిధానము స్థలకాల నియమబద్ధము. కాని, ప్రబంధమునందలి కథా సంవిధానమున కట్టి నియమములుండవు. ఈ కావ్యరచన మీ మార్గముననే సాగినది. ఇట్టి యెడలనే కవి కల్పనా శిల్పము చూపట్టుచున్నది.

కృతిపతి చిల్లర వెన్నమంత్రి కవితోఁ జెప్పినటుల,

"భారత ప్రోక్త కథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము గొంత
తావకోక్తి నభినవశ్రీ వహింపఁ
గూర్చి కృతిసేయు నాకు శాకుంతలంబు"—

ఇట 'అభినవ శ్రీ' యనుటలో 'నవ్యత' (అదియే కల్పనము) యను భావము స్ఫురించుచున్నది. పై పద్యము వలన రెండు మూలములు గొంతవఱకు నాధారము లయ్యును గవి స్వకపోలకల్పనము కూడ నున్నట్లభివ్యక్తమగుచున్నది. ఈ కల్పన మీ కావ్యమునఁ గథాంశముల యందే కాక సన్నివేశముల యందును గోచరించును. ఈ సన్నివేశ కల్పన మనునది కవి స్వతంత్రకల్పనాశక్తికిఁ గొంత, కాళిదాసీయ సన్నివేశములకుఁ గొంత సంబంధించినది. గీర్వాణసాహిత్యమునందలి నాటకము ప్రబంధీకృతి మగునపుడిట్లు జరుగును. ఈ సన్నివేశ కల్పనాశిల్పమునకుఁ గారకమైన కవి ప్రతిభా సువర్ణమున కీ కావ్య చతుర్థాశ్వసము నికషోపలము.

శాకుంతలనాటకమునందలి చతుర్థాంకము ముక్తాహారము నందలి నాయకమణి వంటిది. పినవీరన చాలవఱకీ చతుర్థాంకము ననుసరించి చతుర్థాశ్వసమును రచియించెను. అందలి రెండు రసవత్తర ఘట్టములను పరిశీలించుట ప్రకృతలక్ష్యము.

కణ్వుఁడు శకుంతలను భర్తయొద్దకనుపు ఘట్టము రసవంతమును, సుశ్లోకతరమునై, సహృదయహృదయము లార్ద్రములగునంతటి విషాదరేఖా శబలితమై యున్నది. ఆ సందర్భ మిది :

"వ. అని ప్రసంగవశంబున గొన్ని కులకన్యకా ధర్మంబు లెఱింగించి, యనసూయా ప్రియంవదలు మున్నుగాఁ గొందఱు వృద్ధతపస్వినీ జనంబులను జతురమతులగు విద్దెఱు శిష్యులం దోడువెట్టి శకుంతలం దుష్యంతుపాలి కనుప సమకట్టె" న కణ్వుని యనిర్వాచ్య పుత్రికావియోగవ్యథను, చిరకాలము తన కాశ్రమము నందలి వస్తువులతోడను వ్యక్తులతోడను గల దృఢానుబంధముచే నాశ్రమమును విడువలేక విడువలేక భర్తృసన్నిధి కరుగునప్పటి శకుంతల పొందిన పరితాపము నీ ఘట్టము చిత్రించుచున్నది. అట్టి భావోద్వేగస్థితి యందుఁ గణ్వుఁడు,

"సామ్మనఁ జూచుఁ, జూచి, మదిఁబుట్టిన ప్రేమను
పేర్మి బాష్పముల్
గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడమొగంబయి కన్నుల
నీరు ద్రింగుచుం
గ్రమ్మఱఁ జా శకుంతల మొగంబగు, వ్రశులు
వించుఁ గొంత సే

పద్మిని జాలిఁ బొంది, ధృతియంతయు నిల్వక
విచ్చి పోఁ గన్."

ఈవిధ సంతాపమియు, ద్వంద్వాతీతుఁడు నగు కణ్వునకుఁగూడ నీ వియోగవ్యథ తప్పలేదు. దీని నే కవి హృద్యముగ నిట్లు నుడువును :

"ఎంద మునీంద్రులందు విజితేంద్రియుఁడైన
తపస్వి కూర్మిగా
పెంచి శకుంతలం బెనిచి విశ్రుతి నొందిన
మోహపాశముల్
ద్రెంచుకొనంగలేక, తియదీప్తులఁ జిత్తము
గాసిజెందె, త
లించిన నెవ్వఁడింక వదలింపఁగ నోపెడు
మోహపాశముల్.

వ. ఇట్లు బంధురంబగు మోహాలతాబంధంబున నమ్ముని సింధురంబు గట్టువడి ప్రకృతిజనంబు కైవడి శకుంతలాభిముఖుండయి."

* * *

తల్లి లేని శకుంతలను దానే కన్నతల్లికి మిన్నగాఁ బెంచిన (కన్నతల్లియే యామెను నిర్దయగా విడిచిపెట్టి వెడలిపోయినది!) మహర్షి యామె యత్తవారింట నెట్లుండవలయునో హితముఁ గఱపుచున్నాఁడు :

"నాపయి కూర్మి తద్గురు జనంబులపై నిడి, మాని
కన్యకా
చాపలవృత్తి బంధు జనతా తతియందు ఘటించి,
యిష్ట స
ల్లాపములందు నిచ్చటఁ దలంపక నిచ్చలుఁ
బ్రాణనాథ సే
వా పరతంత్రవై యెటుల వన్నెఁ దెచ్చెదో
నాకుఁ బుత్త్రికా!"

"ఎటుల వన్నెఁ దెచ్చెదో నాకుఁ బుత్త్రికా!" యనుటలోని యాతని కామె పైఁగల పుత్త్రికా మోహ మంతయు వెల్లివిరియుచున్నది. తాను బోధించిన హితమునంతయు జాగరూకతతో నామె యాచరించి, తన యింటిపేరు నామె యెట్లు నిలుపునో యను భావము కణ్వుని పై హృద్యరీతియందు వ్యక్తమగుచున్నది.

పిమ్మట,

"ఎన్నఁడు నామది న్మఱతు నేనిటఁ బుత్త్రిక!
పూఁట పూఁట యా
సన్న సరోవరంబునను సంస్కరణంబొనరింప సంతత
దీవ్యన్మరంద సిక్త సరసీజముఁ దాఁచి,
మదంతికంబునం
గన్నుల నీటితోడఁ గుశికంబగుచున్న
భవన్ముఖాబ్జమున్."

అని కాంతసేపూరకుండి వెచ్చనూర్చి తనకుఁదా నిట్లూరట నొందుచున్నాఁడు.

"కాంత సుఖంబునుం గలదు కోమలి! నాకిటఁ
బర్ణశాలికా
ప్రాంతమునందు నీవు పెనుపం, బరువొందిన
మాలతీ లతా
క్రాంత మనోజ్ఞమైన సహకారముఁ గన్గొను నప్పు
డెల్ల దు
ష్యంతుఁడు మా శకుంతలయు సంగడి నుండుటగాఁ
దలంపఁగన్."

చిరకాలము శకుంతల పెనిచి పెద్దసేసిన మాలతీలత తనకుఁ జెంత నేయున్న సహకారము నల్లుకొని మనోజ్ఞముగ నుండుటను గణ్వుఁడు చూచుటచేఁ "గొంత సుఖము" కూడఁ గలుగునఁట. ఎట్లు? శకుంతలా దుష్యంతులు కూడ మాలతీలతా సహకార సామ్యమునఁ బరస్పరానురాగబద్ధులగుట మదిఁ దోఁచుటవలననే యా సుఖము కలుగుట.

వ. అని ప్రేమాతిశయంబున లతాతరువితానం బవలోకించి,

సీ. అలపెఱుంగక తావకాలవాలములకు
నెమ్మితో నిరవొంద నీరు వోసి
క్రమవృద్ధిఁ బొందు మార్గంబు లరసి నమ్మి
పూఁట పూఁటకుఁ జాలఁ బ్రోదిసేసి
ప్రేమాతిరేకత ప్రియమండనమునకుఁ
జిగురాకుఁ గోవకోరఁ జిదుమ వెఱచి
పరిపాటి నల్లన ప్రసవోద్గమంబైన
సఖులఁ దానును మహోత్సవ మొనర్చి
తల్లిరొ పెంచె మిమ్ము నీ తలిరుఁబోఁడి
యత్తవారింటి కరిగెడు నాలతాంగి
క్షితిరుహములార! పుష్పిత లతికలార!
యనుమతింతురు గాత! కల్యాణయాత్ర."

అని నిండారఁబొంగి వెలి కుబుకు తన యావేదనము ను గణ్వుఁడు వెలిబుచ్చును.

మఱల,

"నేఁడు నీడయుఁబోలె నీ తోయజాక్షి
పెరిఁగె నిన్నాళ్ళు మాలోనఁ బెద్దదయ్యెఁ
బురుషునింటికి ననుపక పుట్టినింట
నునుచ రాదు గా! యంచు నుస్సురనుచు"
నిట్టూర్చును.

కన్నతండ్రి కాకున్నను గన్నతండ్రివలెఁ బలచించును. పై పద్యమున

"పురుషు నింటికి ననుపక పుట్టినింట
నునుచు కొనరాదుగా!" యనుటలో నే యాతని తీవ్ర వైరాగ్యమంతియుఁ దెలియుచున్నది. ఆమె పై నెంత మక్కువయున్నను, వా మె తనయొద్ద నే యుండ వలయునను వాంఛ యెంత యుజ్వలమైనను వా మె భర్తృసన్నిధి కంపుటమాత్రము తప్పదుకదా! తల్లి తోడునీడవలె లేక, కణ్వుఁడే మాత్రమే తండ్రియై యనసూయా ప్రియంవదలే కూరిమి చెలిచెలులై యింత కాలము శకుంతల పెరిగి పెద్దదైనది. ఆమెకు దుష్యంతునితో గాంధర్వవిధినిఁ బెండ్లియైనది. అట్టియెడ శకుంతలపైఁ గణ్వున కెంత పుత్త్రికా స్నేహమున్నను, వా మె కాతనిపై నెంత పితృప్రేమ మున్నను బెండ్లియైన పిమ్మట వియోగము తప్పదు. సహోదరుని శకుంతల కణ్వునివలెఁ బూర్ణముగ వియోగదుఃఖభార చేతస్క కాలేదు. కారణ మామె సహోదర యగుటయే. క్రొత్తగఁ బెండ్లియై యత్తవారింటికిఁ దొలిసారిగఁ బోవు తారుణ్యవతి పుట్టినింటిని విడుచుచున్నందుల కొకవంక దుఃఖించుచున్నను, భర్తృగృహమునకుఁ బోవుచున్నందులకు మఱియొకవంక సంతసించు చుండును. అత్తవారింట మగఁడు తనపై నెంతటి ప్రేమ సుధావర్ష ముఁ గురియునో యనియే యామె చింతించును. ప్రకృతము శకుంతల యిట్టి స్థితి యందున్నది. పాపము, పూర్ణముగ వియోగవ్యథ ననుభవించునది యొక్క కణ్వుఁడే. కావున్న, ప్రియంవదా అనసూయలు!

వ. "ఎట్టకేలకు ధైర్యంబు వట్టికొని శకుంతలం దోడ్కొని యగ్నిహోత్రంబునకు దండంబు వెట్టించి, మునులకును నమస్కారంబు చేయించి, పుణ్యతపస్వినీ జనంబులకు మ్రొక్కించి, తదీయాశీర్వాదంబులతో డం దానును దీవించి యనుపుటయుఁ దండ్రి పాదంబులకుఁ బ్రణామ మాచరించి,

సీ. "జనకుఁ డుండెడు ననుష్ఠాన వేదికఁ జూచుఁ
జూచి క్రమ్మఱఁబోయి చూడవచ్చు
స్నానార్థ నియమిత జలజాకరముఁ జూచుఁ,
జూచి క్రమ్మఱఁబోయి, చూడవచ్చు
నిజ హస్త పోషిత కుజవల్లికలు సూచుఁ,
జూచి క్రమ్మఱఁబోయి, చూడవచ్చుఁ
గుంజ కోటరకుటి క్రోడవీథులు సూచుఁ
జూచి క్రమ్మఱఁబోయి, చూడవచ్చు
తండ్రిఁ బాయంగలేని సంతాప జలము
న త్తవారింటి కేఁగను హర్ష జలము
గోరు వెచ్చైన పాలిండ్ల కొనలుఁదడుప

వెడపఁ దడపవ పయ్యెదఁ దుడిచికొనుచు"న్న శకుంతల చేష్టాదికములను గవి చిత్రకారునికంటె మిన్నగఁ జిత్రించి పాఠకుల మనోనయనములకా సన్నివేశమునందలి పాత్రలకు రూప సాక్షాత్కారము నొసఁగినాఁడు.

సీ. "కదలు వాలుగు మూఁడు పదములు క్రమ్మఱి
తండ్రి పాదంబు లొఁదల ఘటించుఁ
గొంత దవ్వేఁగు నేఁగుచు వచ్చి కణ్వుని
కడుపులోఁ దలమోపి కౌఁగిలించు
వరుగుఁ గొండొక వేగఁ దిరిగి మూసులకు 'మా
యయ్య సుఁడీ'! యని యప్పగించు
గమనించుఁ జెలిమల్లి, కాశ్యపు దెసఁజూచి
'నేఁ బోదు' నంచుఁ గన్నీరు నించు
జనకుఁ డుపలాలనము సేయ, సంయమీంద్ర
భామ లదలింప, వనసూయ పట్టి తిగువ
నిగిడి యడుగిడె నొక ధింకి మగిడి మగిడి
చూచుకొంచు శకుంతలా సూనగంధి!"

అభిజనము దుస్త్యజముకదా. వినను భర్తృసన్నిధికిఁ జను సమయము సమీపించినపుడు తండ్రి పైనను, ఆశ్రమ వాసులపైనను, చెలుల పైఁను గల దృఢానుబంధభావమును బరిత్యజించి పయనించుటయే యామెకు విహితధర్మము. ఇట్టి వియోగావస్థ యందున్న పితాసుతల చిత్తప్రవృత్తి సామాన్యలోకమున నెట్లుండునో యట్లే చిత్రితమైనది. పాత్రల యవస్థలను వర్ణించుపట్ల సహృదయు లార్ద్రమానసు లగునంత రసవంతముగఁ గవి సన్నివేశములను గల్పించి, కావ్యపాత్రలకు రూపసాక్షాత్కారముఁ గల్గింపఁ గలఁడు. కవి రచనమునందలి జీవధర్మమైన కథాకథన మిట్టి సన్నివేశ కల్పనాశిల్పముతో సాగుచు రసాభివ్యక్తికి దోహదకారి యగుచున్నది.

ఇట్టి కవితాశిల్పమే వేఱొక ఘట్టమునందును గలదు.

శకుంతలను భర్తృసన్నిధికిఁ గొని తెచ్చిన యనసూయా ప్రియంవదలకును, రాజునకును జరిగిన సంభాషణ సన్నివేశ మిట్టి కల్పనా రామణీయకముతోడను, పాత్రల యవస్థా చేష్టా నిరూపణ నైపుణితోడను, రసస్ఫూర్తితోడను విరచితమైనది.

దుర్వాసో శాపముచే దుష్యంతుఁడు శకుంతలను విస్మరించెను. ఎదుటి తాపసకన్యక లాతఁడు శకుంతల నుపేక్షించినవాఁడని పల్కుటకు వెఱఁగొంది—

"అనిన నమ్మాటలకు నసహ్యంబు నొంది
యొఱగుపై నున్నవాఁడు చెట్టులికి లేచి
కర్ణములు మూసికొని, శిరఃకంప మొందవ
తొలఁటే హరహరహర యంచుఁ బలికి పలికి

ముని కన్యకను దాను కణ్వునకు దెలియకుండ పెండ్లియాడినచో ముని చంద్రవంశము నశించునట్లు శపింపఁడా, యనుచు నిట్లనును.

"ఎరుక నే మున్న ధర్మశాస్త్రంబు లవ్వి
కామినీరతి కలుషంబుగా నెఱుఁగనె
యవ్వసతి మాత్రమే కాశ్యపాత్మజాత
యరయ నంగార కల్పితయైన ప్రతిమ"

యని భీతిల్లును. కాశ్యపసుత సామాన్యయా? 'అంగార కల్పితయైన ప్రతిమ' యని తానెఱుఁగియు నామెను వలచునా? వంచించునా? ఇట్లు శకుంతలను బరభామినిగ భావించి,

"నా హృదయంబు పరవధూసుఖంబునకు విముఖంబు గాని సముఖంబు కా"దని పల్కు రాజు మాటల కచ్చెరు వంది, యనసూయా ప్రియంవదలు, "అహో! లెస్స; విచారమే మొదల నీవాఖేట కేళీమహోత్సాహంబొప్పఁగవచ్చి, యాశ్రమము నిచ్చం జొచ్చి, యచ్చోట సన్నాహప్రీతి శకుంతలం గలఁచి గాంధర్వక్రియాలక్ష్మ నుద్వాహంబైన ప్రకారమంతయును నాత్మ విస్మృతిం బొందనే?"

యని మాటిగఁ బృచ్ఛించిరి. తమకత్యంత ప్రేమపాత్రయగు తమ నెచ్చెలి యట్లు భర్తృతిరస్కృతి యగుట వారికిఁ గ్రోధహేతువైనది. ధర్మపాలకుఁడగు రాజే యధర్మప్రవర్తకుఁడగుటఁ జూచి, తొల్లి యాతఁ డామెను బెండ్లియాడుటను జ్ఞప్తి కెలయించిరి. రాజుల సహజ నిర్లక్ష్య స్వభావమును గర్హించి, శకుంతల యీ దీర్ఘకాలము జరిపిన విప్రయోగినీ వ్రతము పాషాణములు ద్రవించునట్లు వర్ణించి, యట్లయిన రాజు చిత్తము పరివర్తన మొందునేమో యని తలఁచిరి. ఆమె వ్రతధారణ మెంత కఠినమో చూడుఁడు:

"కేలఁ గలనైనఁ బెన్నెరి వేణి పోషింపఁ
దలకుఁ జేరఁగ నీదు తైలధార
ఋతుమతియైనచో దేహశుద్ధికి నైన
పైపాడ నొల్లదు మజ్జనంబు
మాసి కండూతి మున్మరమైనఁ గట్టదు
ద్వాసించి వేఱొక్క వల్కలంబు
ప్రాణరక్షార్థంబు పర్ణాంబువులు గాని
యాతిమృష్టగు కందమూలఫలము
లెన్ని దివసంబులో నీవు తిన్నఁగాని
నాఁటనుండియు నీ శకుంతల, నృపాల!
నేఁటి దాఁకను వడపె నిద్రాది నిష్ఠఁ

"దీర్ఘతర మైన విరహ వీరవ్రతంబు" ఈ వ్రత మింత కఠినమైనదని 'వీర' శబ్దమే సూచించుచున్నది. ఇంత వర్ణించినను రాజు లొంగనా!

"పరమ పవిత్రత యగు నీ, తరుణీమణిఁ బాయ
నెట్టి ధైర్యముఁ గలిగెరా
మఱుపుఁ దినయంత వచ్చిన, నరవర! ఎఱుఁగవన నెట్లు
నాలుక యాడెన్?" అని చీవాట్లువైచి, ధర్మ ప్రసంగము బలవనైన నాతఁడు లొఁగు నేమోయని,

"గుణవతియుఁ బుత్రవతియును గులవతియును
నైనభామను విడుచు నన్యాయకారి
కిహపరంబులు లేవని యెందు ప్రసిద్ధ
ధర్మశాస్త్రంబు లెఱుఁగవా . ధరణినాథ" .యని

మందలించి యపుడును ప్రయోజనము లేక తుదకు పుత్రమోహమైన యాతనిని వశమొనర్చు కొను నేమో యని,

"అద్దములోని నీడవలె నాకృతి యుంకొక లేశ మాత్రముం
బిద్దము గాక నీకుఁ బ్రతిబింబమువోలె వెలుంగుచున్న నీ
పెద్దకుమారు, భూవర, యభిన్నమతిన్ మొగ మెత్తి చూడుమా!
ముద్దియ నీపయిం గలుగు మోహము, భక్తియుఁ గావనయ్యెడున్". అని వేఁడుకొనిరి. కాని శప్తుఁడగు రాజు,

"..........కటకటంబడి," మీర లాడువారలు. మీతోడ నిట్టిటుల యుక్తంబు గాదు. ఆశ్రమంబునకు నేఁడు రేపట యెల్లి యెల్లుంట వచ్చి కణ్వమహామునీంద్రుం గని తదాదిష్ట మార్గంబున నడచెదం గాని పొం"డని దిగ్గన లేచి యొంటులైనవారి బారినుండి తప్పించుకొన నెంచినాఁడు. కాని యాకాశవాణి సత్యము నెఱిఁగించెను. అపుడు ప్రియంవద కుపితయై

"……..శకుంతల లాంగుళీ
స్థాపితమైన యుంగరముఁ జయ్యన నూడిచి,
మీఁదవైచి, యో
పాపపు రాజ! యెట్లెదియు బాలిక
వ్రేలికి వచ్చెఁ? జెప్పుమా,
యీ ప్రజ లెంగతిం బనిచి రేఁగద మాగతి నన్న"

ప్పటి సభలోని వారల యవస్థాక్రమ మిట్లుండెను.

సీ. విస్మయాక్రాంతులై వినువారు కొందఱు
జగతీశు నెసఁ జాల నెగులు వడిరి
'మహనీయమతి నకార్యంబు చేసితివి నీ'
వని రమాత్ములు, మాన్యులైనవారు
నృపతి నేమియు నన నేర కూరక వృద్ధు
లను బంధువులఁ జెవులూన్చి కొనిరి
యాఱడి నోము లయ్యెను గదా తన కందు
వని శకుంతల వెక్కివెక్కి యేడ్చె
నంగుళీయక భానూదయంబు చేత
విప్రసంభవ శాపజంబైన నృపతి
మేనకాసుత మీఁద నజ్ఞాన మొదవఁ
గ్రమ్ముకొనియున్న చిమ్మచీఁకటులు విరిసె.

అంతఁ దనకును శకుంతలకును నడుమ జరిగిన ప్రణయకథన మంతయు స్మృతికి రాఁగా, మూర్ఛిల్లి, తెలివొంది దుష్యంతుఁడు

అల్లనలన తెలిసి, ధైర్యంబు నూఁది
దిక్కుఁ గూర్చుండి, తలయూచి, ముక్కు మీఁద
వ్రేలు ఘటియించి, మిగుల, గ్రొవ్వేఁడి యొదవ
దట్టముగ దీర్ఘనిశ్వాస ధార వఱపె.

ఇది యప్పటి యాతని యవస్థా వర్ణనము. ఎదియో స్వప్నమున జరిగినటులను, విశ్వసింపరాని విషయము ప్రత్యక్షముగ జరిగినట్లను, నప్పుడప్పుడే విస్మృతి సంఘటనము స్మృతి పథమునఁ జరించు నట్లును రాజున కనుభూతి మగుచుండెను. అట్టి యవస్థ యం దాతఁడు

సీ. "అత్యంత కుపితాత్ములై తనదిక్కు చూ
చు ప్రియంవదను ననసూయఁ జూచి,
కన్నీరు మున్నీరు కాలువలై వెల్లి
గొనఁ జేయు మేనకా తనయఁ జూచి,
యవయవశ్రీఁ దన యచ్చొత్తినట్లున్న
కులదీపకరుఁడైన కొడుకుఁ జూచి,
నామాక్షర ప్రమాణదినంబునకుఁ జేరి
గిరవున్న ముద్రయుంగరముఁ జూచి,
ద్రష్టలైనట్టి మంత్రివర్గంబుఁ జూచి,
'సర్వముడిగితో' యనెడు మిత్రములఁ జూచి,
పలుఁకలుంకుల నాడెడు ప్రజలఁ జూచి,
తన యవజ్ఞాప్రకారంబుఁ దలఁచి చూచి"

క్రమముగ గతివృత్తమెల్ల స్మృతి పథమున గోచరింపఁ దనకును, శకుంతలకును మున్ను జరిగిన యుద్వాహోదంతమును సభ్యులకు వినిచి, తుదకు శకుంతలను బరిగ్రహించినాఁడు.

ఇట్లు రాజ్యసభ, యందలి వ్యక్తులు, దుర్వాసో శప్తుఁడై సంభ్రమాశ్చర్యములతో డోలాందోళన చేతస్కుఁడగు రాజు, భర్త తన్నుపేక్షింప దారియుఁ దెన్నును దెలియని స్థితియందున్న శకుంతల తమకూరిమి సఖి నాతఁడవమానించినందులకుఁ గుపితలైయున్న యనసూయాప్రియంవదలు, కన్నెదుట నీ సర్వవృత్తాంతము నాటకమునందువలె జరుగుచుండఁ గాంచుచున్న సభ్యులు నీ సన్నివేశమునఁ బాఠకుల మనోనయనములకు సాక్షాత్కరించుచున్నారు. యథాభావ రసావస్థ నముగ నీ సన్నివేశము నిట్లు చిత్రించుటయే పినవీర కవితాశిల్పసర్వము.

పై రెండు సన్నివేశములు కవి కల్పనా శిల్పమునకుఁ, పాత్రచిత్రణమునకు, నవస్థానిరూపణ నైపుణికిఁ, కథాకథనచాతుర్యమునకు, రసస్ఫూర్తికి దృష్టాంతములుగ నున్నవి.

ఈతని కథాకథనము రసవత్తరమును, గుణోత్తరమునై చిత్రలేఖకుని రూపచిత్రణమువలె భావుకుల మనశ్చక్షువులకుఁ బాత్రస్వరూపములను సాక్షాత్కరింపఁజేయును. నాటకము రంగ ప్రదర్శితమగునపుడు పాత్రలు జవనికాంతరమునుండి యాకస్మికముగ సామాజికుల యెదుట నిలుచునటుల, కవి, పాత్రల వేర్వేరైన యవస్థలను వర్ణించుటతోఁ గల్పనా శిల్పము ప్రదర్శిత మగును. ఈ మార్గము నే తరువాతి ప్రబంధ కాలమునందలి మను, వసు చరిత్రము లనుసరించినవి. ఇట్టి కవితా శిల్పముండుట వలననే పినవీరన శృంగార శాకుంతల కావ్యము సుప్రసిద్ధమై, భావి ప్రబంధములకు మార్గదర్శిగను, నితరకవిప్రణీత శాకుంతల కావ్యములకు ధ్రువతారగను ప్రకాశించుచున్నది.

# అశోకప్రశస్తి

శ్రీ కల్లూరు వేంకటనారాయణరావు

ఏ సార్వభౌము సహీన శాసన శిలా
    సింహాలి స్వాతంత్ర్య చిహ్నమయ్యె,
నే మహామహు ఘనప్రేమ పాలనఁ బంచ
    శీలముల్ దొలికలి నేలఁ బర్వె,
నే వేత్తవలన సమేష్ట సత్కృతుల బ్రా
    హ్మణ బౌద్ధ నిర్గ్రంథిగణము లొందె,
నే ధన్యజన్ము సద్బోధాంబు ధార మ
    హాయాన నిర్ఝరికాదిఁ బొల్చె,

జగముజను లేనియడుగుల జాడ లరయ
సాగి రతఁడె; సమ్యగ్ధర్మ సారమూర్తి!
బలి, దధీచి, విద్యాధరేశ్వర, శిబీంద్ర
మూనృతాచార సుకృతి! యశోకనృపతి!

శతకోటి సొన్నముల్ యతుల వెచ్చమునకై
    దానంబు నిచ్చె వదాన్యుఁ డెవఁడు?
కొల్వని యాటవికులను శిక్షింపక
    సనుగులఁ జేసె ధర్మాత్ముఁ డెవఁడు?
గాంధారముఁ బెన్నగరిగాఁగ నేపాల
    మోమె నరేంద్రలలాముఁ డెవఁడు
బ్రాహ్మణ నిర్గ్రంథి బౌద్ధమతంబులఁ
    దుల్యంబులుగ బ్రోచెఁ గల్యుఁ డెవఁడు

స్వపథ మన్యంబు ననని, విశాలహృదయుఁ
డెవఁడు? తన ధర్మకాయం బహీన మగుచు
నిగుడ, నిపుడుఁ బురాస్మరణీయుఁ డెవఁడు ?
సూనృతాచార సుకృతి ! యశోకనృపతి !

ఏవురుఁ బతు లుండియే, వెత వలు వొల్వ
స్థిరచిత్తయౌ ద్రౌపదీపురంధ్రి
నడవి నీడే లేని యిడుముఁ బాసినపతి
నను రక్తిఁగను దమయంతిరాణి
సాధ్వని దన్ను బజారున నిడు హరి
శ్చంద్రు సైఁచినతల్లి చంద్రమతియు
వరపతి, బరదేశిగరితనా జతిఁ జేర్చఁ
జిచ్చుఱికిన గుణస్ఫీత, సీత

మూడు మూర్తులఁ దనయొడిఁ గూడి మూడు
సుతులుగా మార్చు, నాయనసూయ దేవి
పుట్టినట్టి యీపూజ్యార్య భూమి వెల్గె
సూనృతాచార సుకృతి! యశోకనృపతి!

'శ్రీ మదశోక చరిత్ర'నుండి

# చీకటి తెరలు

శ్రీ అందే నారాయణస్వామి

## 1

రాధ మిషన్ కుడుతూవుంది. రాధ తమ్ముడు పదిహేనేళ్ళవాడు మిషన్ ప్రక్క కూర్చుని మూడితో చొక్కాకు కాజాలు తీస్తున్నాడు. లలిత చేత్తో యేదో గుడ్డ పట్టుకవచ్చి "అక్కా నువ్వు చూపించిన పువ్వు కుట్టడం సరిగా కుదరలేదు" అంటూ చేతిలోవున్న గుడ్డ రాధకు చూపించింది.

రాధ కుడుతూవున్న మిషను ఆపి ఆ పువ్వుం కుట్టవలసిన విధానం మరియొకసారి చెప్పి గుడ్డమీద పెన్సిలుతో గుర్తులు పెట్టి యిచ్చింది.

"నువ్వు కుడితే అంత బాగా వుంటుంది మాకు కుదరదేం అక్కా!" అంది గుడ్డ తీసుకుంటూ లలిత.

"ఇదో బ్రహ్మాండమా! నేర్చుకుంటే మీకూ వస్తుంది" అంది రాధ.

"రెండు రోజులనించి తిప్పలుపడుతున్నా కుదరటం లేదు."

"ఓపికపట్టి నేర్చుకోవాలి మరి! తొందరపడితే యెట్లా?"

లలిత మిషన్‌దగ్గిరగా చాపమీద కూర్చుని గుడ్డ మీద రాధ పెట్టి యిచ్చిన గుర్తులప్రకారం పువ్వు కుడుతూ, "మిషన్ నేర్చుకుంటే యెన్నాళ్ళలో వస్తుంది అక్కా?" అని అడిగింది.

"నీ కెందుకమ్మా మిషను. నీకు యేటువంటి వుద్యోగస్తుడు, యేటువంటి ధనవంతుడు భర్తగా రానున్నాడో!" అంది రాధ.

"నేర్చుకుంటే తప్పా అక్కా! గుడ్డ కత్తిరించి చొక్కాలు అవీ కుట్టాలని నాకెంతో సరదా!" అంది లలిత.

"అయితే నేర్చుకో. రేపు నీ భర్తకు చొక్కాలు, నీకు పుట్టేపిల్లలకు లాగులు, గౌనులు సొంతంగా నే కుట్టుకోవచ్చు" అంది రాధ.

"నేర్చుకుంటే యెన్నాళ్ళలోవస్తుంది అక్కా!" అని అడిగింది లలిత.

"అది నేర్చుకునేవాళ్ళ శ్రద్ధనుబట్టి వుంటుంది. చొక్కాలు గౌనులు ఒకమాదిరిగా కుట్టటంవరకు అయిదారు మాసాల్లో రావచ్చు." అంది రాధ.

రాధ ఆ బజారులో కాపురం పెట్టి అయిదారు మాసాలైంది. ఆమెది యేవూరో, ఆమె స్థితిగతు లేమిటో అక్కడి వాళ్లకు తెలియవు. రాధ వయస్సు దాదాపు యిరవై రెండేళ్ళుంటవి. తమ్ముడూ, తనూ తప్ప యింకెవరూ లేరు. రాధ, ఆ బజారులో గది అద్దెకు తీసుకుని మిషనుకుట్టటం మొదలు పెట్టింది. చొక్కాలూ, గౌనులూ అవీ కుట్టటమే కాకుండా అల్లికం పనిలోనూ చీరెలకూ పరికిణీలకు పువ్వులూ, లతలూ రంగు రంగుల దారాలతో అందంగా కుట్టడంలోనూ మంచి నేర్పరి. ఆ వీధిలో కొందరు ఆడపిల్లలు ఆమె దగ్గర కుట్టుపనీ, మొదలైనవి నేర్చుకుంటున్నారు. ఆ నేర్చుకొనేవాళ్లలో లలిత ఒకర్తె.

రాధనుగురించి యిరుగు పొరుగు అమ్మలక్కల్లో అనేక వూహాగానాలు బయలుదేరినవి. రాధను మొగుడు వదిలేస్తే యీ వూరువచ్చి మిషను కుట్టుకుంటుందని కొందరూ, కాదు రాధే మొగుణ్ణి వదిలేసి యెవర్నో తీసుకుని లేచివచ్చిందనీ ఆ లేవతీసుకవచ్చిన వాడు రాత్రిళ్ళు వచ్చిపోతూవుంటా డనికొందరూ, ఇట్లా పుకార్లు బయలుదేరినవి. ఆ వీధి చివర వెంకమ్మ అనే వితంతువు వున్నది. ఆమెకు వేరే పనిలేదు. ఇటువంటి వార్తలు గాలికంటే వేగంగా మోసుకుని యింటింటికీ వెళ్ళి అందచెయ్యడమే ఆమె పని. ఒక రోజున వెంకమ్మకు ఆమె సమవుజ్జీ అయిన శేషమ్మకు, నీళ్ళాటికేవు దగ్గర రాధనుగురించిన వాద ప్రతివాదాలతో మాటలు ముదిరి జుట్లు, జుట్లు పట్టుకోబోయ్యారు. అయితే రాధవచ్చిన కొత్తలో వెంకమ్మే ఓ గుడ్డ పట్టుక వెళ్ళి "యిదుగో అమ్మాయ్! రవిక కుడితే యెంత తీసుకుంటావ్?" అని అడిగింది.

"మూడణాలు" అంది రాధ.

"అయ్యో! యిదేం చోద్యం! నీదగ్గర పూర్వం లేని గిరాకీ! బజార్లో రవిక కుడితే బేడ తీసుకుంటూ వుంటే మూడణాలంటావు!" అని దీర్ఘాలు తీసింది వెంకమ్మ.

"సరే! అలాగే యివ్వు అవ్వా," అంటూ రాధ గుడ్డ తీసుకుని వెంకమ్మకు రవిక కుట్టింది.

మర్నాడు వెంకమ్మ రవికకోసం వెళ్లి చేసినగోల అంతా ఇంతా కాదు. రవిక బిగువైందనీ, గుడ్డ కాజేశావనీ అందుకనే బేడకు కుడతానని ఒప్పుకున్నావనీ తగువులాడి ఆఖరకు కుట్టుకూలి బేడ యివ్వకుండానే వెళ్ళిపోయింది. అప్పటినించీ రాధంటే వెంకమ్మకు అరికాలిమంట నెత్తికెక్కుతుంది.

## 2

రాధకు తనదగ్గర నేర్చుకునే పిల్లలంతా ఒక యెత్తు. లలిత ఒక యెత్తు. వాళ్లిద్దరికీ అంత మైత్రి కుదిరింది. లలిత యింటిదగ్గర గొంతులో మెతుకులు యేం వేసుకుంటుందో అంతే ఎప్పుడూ రాధ దగ్గరేవుంటుంది. ఆరోజున లలిత రాధ దగ్గర కూర్చుని చీరకు లతలు కుడుతూ అవి సరిగా కుదరకపోవడం వల్ల సతమత మవుతున్నది.

అప్పుడు మధ్యాహ్నం పన్నెండు కావచ్చింది. రాధ మిషన్ కుట్టడం ఆపి వసారాలో నించి లోపలికి వెళ్ళి "లలితా!" అని పిలిచింది.

లలిత "ఏమిటక్కా?" అంటూ చేతిలో చీర అక్కడ పెట్టి లోపలికి వెళ్ళింది.

"భోజనంచేద్దాంరా లలితా. ఆ పీటమీద కూర్చో. ఇవాళ్ళ యేమైందనుకున్నావు రవికలు కుట్టించుకుని ఒకామె డబ్బులు యివ్వకుండా పాలు పోసింది. మావాడు యెన్నాళ్ళనించో క్షీరాన్నం వండవే అక్కా అని పోరుపెడుతున్నాడు అందువల్ల యివాళ్ళ క్షీరాన్నం వండాను. ఇద్దరం భోంచేద్దాంరా" అంది రాధ. లలిత మొహమాటపడుతూ "యెందుకులే అక్కా" అంది.

"అట్లాకాదు భోంచెయ్యాలి తప్పదు" అంటూ రాధ రెండుపళ్ళాల్లో క్షీరాన్నం వడ్డించింది. తప్పనిసరి అయినందువలన లలిత ఆ పూట అక్కడే భోజనం చేసింది.

తర్వాత నాలుగురోజులకు రాధ పెండ్లిబట్టలు తొందరగా వుండడంవల్ల రాత్రిపూట లాంతరుదగ్గర పెట్టుకుని మిషను కుడుతూవున్నది. అప్పుడు లలితతల్లి రాగా రాధ కుడుతూవున్న మిషను ఆపి "లలితకోసం వచ్చావా పిన్నీ? లలిత యిందాకనే యింటికి వచ్చిందే!" అంది.

"లలితకోసం కాదు అమ్మాయ్! నీతో మాట్లాడదామని వచ్చాను." అంది ఆమె.

"అయితే ఆ పెట్టెమీద కూర్చో పిన్నీ" అని రాధ అనగా ఆమె అక్కడవున్న గుడ్డలు వేసుకునే పెట్టెమీద కూర్చుని "లలితకు యెన్నాళ్ళనించో మంచి సంబంధాలకోసం వెతుకుతూవుంటే యెక్కడా దొరకటంలేదు అమ్మాయ్. ఇప్పుడు విజయవాడనించి ఓ మంచి సంబంధం వచ్చింది. అతగాడికి ఏదో వుద్యోగమట. రెండువందల జీతం కొద్దిగా పొలంకూడా వున్నదట. కుర్రవాడు తెలివైనవాడే. ఈ మధ్యనే భార్య చనిపోయిందట. కుర్రవాడు మంచి బుద్ధిమంతుడట. వాళ్ళ భార్యభర్తలు ఎంతో అన్యోన్యంగా వుండే వాళ్ళట. భార్య చనిపోవడంతో అతను అన్నం నీళ్లూ మాని చింతపడుతూవుంటే స్నేహితులు అతన్ని దారికితీసుకువచ్చారట. ఈ సంగతులన్నీ తెలిసినవి. ఈ సంబంధంపోతే మళ్ళా మంచి సంబంధాలు దొరకవు. రెండో పెళ్ళయితే మాత్రమేం? నిక్షేపంలాంటి సంబంధం. ఇంటిపనులుచేసేటందుకు దాసీమనిషట. ఎంతసుఖం అనుకున్నావు అమ్మాయ్. యిదంతా నీకు ఎందుకు చెపుతున్నానంటే మా లలితగాని రెండో పెళ్ళని సందేహిస్తుందేమో. నువ్వుకాస్త నచ్చచెపుతావని నీతో చెప్పవచ్చానమ్మాయ్" అంది.

"అయ్యో! అంతకంటే ఇంకేం కావాలి పిన్నీ! మంచి సంబంధమయితే యెందుకు వదిలిపెట్టడం. లలితతో నేనుకూడా చెపుతాలే" అంది రాధ.

"మాకేనా అమ్మాయ్! అతనికి యెంతోమంది పిల్లల్ని యిస్తామనివస్తున్నారట. యెంతమందివస్తేనేం పిల్ల అతనికి నచ్చవద్దు! అందులో బాగా చదువుకున్నవాడాయె! అయినా రూపంలో మన లలితకు వంకపెట్టేదెవరు? ఆ సంబంధం గనక కుదిరితే మన లలిత అదృష్టవంతురాలే! నువ్వుకాస్త చెప్పమ్మా" అని చెప్పి ఆమె వెళ్ళిపోయింది.

మర్నాడు వుదయానే వాడుక ప్రకారం లలిత వచ్చింది. లలిత వచ్చేసరికి కుట్టుపని నేర్చుకుంటున్న ఓ యిద్దరు అమ్మాయిలు వచ్చి కుట్టుకుంటున్నారు. రాధ వాళ్ళందరికీ గుడ్డమీద పెన్సిలుతో లతలూ, పుష్పాలూ, డిజైన్లు గీసియిచ్చి తాను మిషన్ దగ్గర కూర్చుని కుట్టడం ప్రారంభించింది. కాసేపు కుట్టుకుని మొదటవచ్చిన యిద్దరమ్మాయిలూ వెళ్ళిపొయ్యారు. లలిత ఒక్కతే కుడుతూ "అక్కా! ఆకులకు ఆకుపచ్చ దారంతో కుట్టాను. కాడలకు పసుపు పచ్చ దారంతో కుడుతున్నాను." అంది.

"అలానే కుట్టు" అంది రాధ.

కాసేపు ఆగి రాధ "నీ కేదో సమ్మంధం వచ్చిందటగా లలితా?" అని అడిగింది.

"అవునట అక్కా" అంది లలిత.

"నువ్వింకా వరుణ్ణి చూడలేదా?" అని అడిగింది రాధ.

"చూడలేదు అక్కా" అంది లలిత.

"నీకు చూపించకుండా యెలా చేస్తారులే! రెండో పెళ్లని విన్నాను. కుర్రవాడు లేతవాడేనట. మనం చూడవలసింది కుర్రవాడి వయస్సు, ఆరోగ్యం. రెండో పెళ్లయితేనేం! మంచి సమ్మంధం అయితే సరి. మొదటగా పెళ్ళిచేసుకున్నవాళ్లు మాత్రం యేం వరగబెడుతున్నారు? భార్యను నానా బాధలు పెట్టడం లేదు? నేను మొదటిపెళ్ళివాణ్ణే చేసుకుని ఏం బావుకున్నాను? నా జీవితం తీరని కష్టాలకు గురైంది" అని చెప్పింది రాధ.

ఈ కదలికతో వెనకటి స్మృతులు రాధ కళ్లల్లో మెదలజొచ్చినవి. తనకు యుక్తవయస్సు రాగానే తనతల్లి పినతండ్రి సహాయంతో తనకు సమ్మంధాలు వెదకడం మొదలు పెట్టింది. అసలు వాళ్ళది గుంటూరు. వాళ్ళ తల్లిదండ్రులకు ముగ్గురు సంతానం. ఇద్దరు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. తాను రెండోది. తన అక్కకు తండ్రి వుండగానే వివాహమైంది. తండ్రి కోర్టు అమీనా పనిచేసి యేమీ మిగల్చకుండా వెళ్ళిపొయ్యాడు.

తనకు యెన్నో సమ్మంధాలు చూశారు. ఆఖరకు తెనాలిలో వచ్చిన సమ్మంధం ఒకటే కుదరగా తనకు వివాహంచేశారు. వరుడు చదువుకున్నవాడు. కొద్దో గొప్పో ఆస్తికూడా వున్నది. జీవితంలో పెళ్ళికంటే ఆనందాన్నిచ్చే దేముంది? తనసంతోషానికి మేర లేదు. తానో గృహస్థురాలు అయిపోతున్నది. భర్తతో ప్రేమ జీవితం గడపవచ్చును. ఇక ఆ ఇంటికి యజమానురాలు తానే. కలగబోయే సంతానం, వాళ్లు పెద్దవాళ్లయితే మళ్ళా వాళ్లకు పెళ్లిళ్లు. కోడళ్లతో, అల్లుళ్లతో ఇల్లంతా కలకలలాడుతుంది. దోపతోటలా గంపంత సంసారం. ఇవన్నీ తలుచుకుని పొంగిపొయ్యేది. ఏ దేవో గాలి మేడలు నిర్మించుకుని ఆనందపడేది. పెళ్లికాగానే తనను కాపరానికి పంపారు. ఎన్నో ఆశలతో, ఎన్నో కోర్కెలతో అత్తవారింట్లో అడుగు పెట్టింది. తనభర్త ప్రతిపనిదగ్గరా కోప్పడేవాడు. బూట్లదగ్గరనించి తుడిచి యివ్వవలసి వచ్చేది. ఆయన ఆఫీసునుంచి వచ్చేసరికి గడగడలాడుతూ యెదురువెళ్ళి అన్నీ అందివ్వాలి. ఏది కాస్త ఆలస్యమైనా మండిపడేవాడు. ఒకనవ్వు లేదు. ఒక సరసమూ లేదు. ముఖం యెప్పుడూ ధుమధుమలాడుతూ వుండేది. భార్యాభర్తల మధ్య అనురాగం, ప్రేమ ఏమీ లేవు. తనను దాసీదానిలా చూసేవాడు. తను పుట్టింటి పరసన తహశీల్ దారు గారి ఇల్లువుండేది. ఆయన అంత ఉద్యోగి అయినా ఆఫీసునుంచి యింటికి రాగానే భార్యా భర్తలు యెదురు బల్లగా చెరో కుర్చీలో కూర్చుని నవ్వుతూ పేలుతూ యెంతో ఆనందంగా వుండేవాళ్ళు. వాళ్లు ఒకళ్ళ మీద ఒకళ్లు యెంతో అనురాగంగా వుండేవాళ్లు. భార్య అరికాలికి ముల్లుగుచ్చుకుందంటే ఆయన గడగడలాడేవాడు. దాంపత్య జీవితమంటే తాను అంత సుఖప్రదమంగా వుంటుందనుకున్నది. తాను వెళ్ళిన కొత్తలో తనభర్త రాత్రిళ్ళు యింటిపట్టు పడుకునే వాడే కాని తర్వాత తర్వాత రాత్రిళ్ళు యింటిపట్టు పడుకోవడం మానివేశాడు. తాను ఒకరోజున తనఅత్త గారితో జంకుతూ మీ అబ్బాయి రాత్రిళ్లుయింటి పట్టు పడుకోడం లేదని చెప్పింది.

అందుకు ఆమె "వాడు ఆఫీసు పనులమీద ఎక్కడికో వెళ్లుతూ వుంటాడు. ఆ పనులన్నీ మానుకొని నీకు యెదురుగా కూర్చోవాలంటావా?" అంది.

తాను యిక మారుమాట్లాడలేదు. ఆమెకు కొడుకు సంగతి యేమీ పట్టదు. ఆమెకు ఒకకూతురు వున్నది. ఆ వూళ్ళోనే యిచ్చారు. కూతుర్నీ, కూతురు పిల్లల్నీ దేవులాడడమే సరిపోతుంది. కాని కొడుకు

సంగతి కుతరామూ పట్టరు. ఒకరోజున తాను యిరుగు పొరుగువాళ్లతో కలిసి సినిమాకు వెళ్లింది. తనతోవచ్చిన పొరుగింటావిడ బెంచీలలో తమ ముందువరసలో కూర్చున్న ఓ అమ్మాయిని తనకు చూపిస్తూ "అదిగో మీ సవతి" అని చెప్పింది. అప్పుడు తనకు అంతా అర్థమయింది. తనభర్త తనను సరీగా చూడకపోవడానికి రాత్రిళ్ళు యింటికి రాకపోవడానికి కారణం యిదా అనుకున్నది. అప్పటికి తానువచ్చి ఆరు మాసాలేమో అయింది. పెళ్ళికి ముందునుంచే ఆవిడ్ని పెట్టుకొని వుండాలి. అయితే ఆవిడ్ని పెట్టుకున్నవాడు మళ్ళా పెళ్లెందుకు చేసుకోవాలి? తన తప్పులు పెళ్లిచాటున కప్పివుచ్చుకోడానికి సంఘంలో మర్యాదకోసం పెళ్ళి చేసుకొని వుండాలి. అని తనలోతాను తలపోసుకుని విచారపడ్డది.

తర్వాత ఒకరోజున తాను పంచలో కూర్చుని బియ్యం బాగుచేస్తున్నది. తనఅత్త అవతల కూర్చుని కూతురు పిల్లకు అన్నం తినిపిస్తున్నది. ఇంతలో తన పుట్టింటి వూరినించి ఒక యువకుడు వచ్చి "మీఅమ్మ పూలూ దవనం పంపింది" అంటూ ఒక కాగితంపొట్లం తనకు యిచ్చి వెళ్ళిపోయ్యాడు. ఆవాళ ఆదివారం కావడంవల్ల తనభర్త యింటివద్దనే వున్నాడు. ఆ అబ్బాయి పూలూ అవి తెచ్చిఇవ్వడంచూసి "ఆ మనిషి యెవరు?" అని ప్రశ్నించాడు. తాను "మా యిరుగు పొరుగు అబ్బాయి" అని చెప్పింది.

"ఓహో! అదా! వాళ్ళయిల్లు మీ యింటికి యెంతదూరం? అతడు మీయింటికి తరుచు వస్తుండే వాడా?" అని గుచ్చి గుచ్చి తనను అరాలు తీశాడు. అతడట్లా ప్రశ్నిస్తూ వుంటే భార్యను ప్రేమించలేని వాళ్ళకు అనుమానాలు జాస్తి కాబోసు అనుకున్నది. ఆయన అనుమానానికి తగ్గట్టు ఆ అబ్బాయి తరువాత రెండుసార్లు "మీ అమ్మ నీ యోగక్షేమాలు కనుక్కు రమ్మంది" అంటూ వచ్చాడు. ఆ అబ్బాయి తరుచు వ్యాపారం మీద తెనాలివస్తూ వుండడంవల్ల తన తల్లి ఆ అబ్బాయితో చెప్పి వుండవచ్చు.

తర్వాత ఒకరోజున రాత్రి దాదాపు పదకొండు గంటలకు ఆయన తలుపు తట్టగా నిద్రలో వుండడంవల్ల తాను ఆలస్యంగా తలుపు తీసింది. అప్పటికి భోజనాల వేళ దాటిపోవడంవల్ల ఆ వేళకు యిక రాడనుకుని తలుపులు వేసుకుని ఒళ్ళు మరిచి నిద్రపోతున్నది. తన అత్త అవతలి గదిలో పడుకున్నది. నిద్రలో ఆయన కేకలు వినపడక పోవడంవల్ల ఆలస్యంగా తలుపు తీసి వుండవచ్చు. అందుకాయన మండిపడుతూ "లోపల యెవరితో కులుకుతున్నావు? దొడ్డివాకిలిగుండా వాణ్ణి పంపడంలో ఆలస్యమయిందా?" అన్నాడు.

అప్పుడు తనకు దుఃఖం ముంచుకొచ్చింది. ఏమి సమాధానం చెప్పాలో తోచలేదు. ఆ రోజునుంచీ ఆయన తనతో మాట్లాడడం మానివేశాడు. కోపంలో అది చెయ్యమనీ యిది చెయ్యమనీ ఆ చెప్పడం కూడా లేదు. ఇక యేమి చూసుకుని తానక్కడ వుండాలి? సరీగా చూడక పోగా పైగా యీ అపవాదులు ఒకటి. తన కక్కడ వుండడానికి మనస్కరించలేదు. కొడుకూ కోడలూ సరీగా వుంటున్నారా లేదా అని తన అత్తకు యివన్నీ యేమీ పట్టవు. తన కూతురేమో తానేమో. ఒక రోజున తన అత్తతో చెప్పి తన పుట్టింటికి వచ్చివేసింది. తన తల్లితో జరిగిన విషయాలన్నీ చెప్పింది తన తల్లి "యెట్లయినా ఓపికతో అక్కడే వుండాలి గాని యిట్లా రావచ్చునా?" అని కోప్పడి "నేను తీసుక వెళ్ళి దిగవిడిచివస్తా రమ్మ"న్నది.

అప్పుడు తాను "ఆయనకు అవసరం లేంది అక్కడపడి వుండడం దేనికమ్మా? ఆయనకు కావలసి వచ్చి యెప్పుడు తీసుకువెళ్లితే అప్పుడు వెళ్ళడానికి సిద్ధంగా వున్నా"నని తన తల్లికి చెప్పింది.

తర్వాత తన పినతండ్రి సఖ్యత కుదర్చాలని తెనాలివెళ్లితే 'చెప్పకుండా లేచి పోయింది. మళ్ళా యిక్కడకు యెలా వస్తుంది' అని వాళ్లు తనను గురించి యేవేవో నిందా వాక్యాలు మాట్లాడారట.

తల్లి అక్కడ ప్రసుగులూ, ద్రకాలూ చేసుకుని జీవిస్తూవుంది. తాను ఒక పంతులమ్మ దగ్గర కుట్టు మిషను నేర్చుకుని, యీ వూళ్ళో తమకు తెలిసిన వాళ్లు ఒకళ్లువుండంచేత యిక్కడకు వచ్చి తనతమ్ముణ్ణి పెట్టుకుని మిషను కుట్టుకుని జీవిస్తున్నది.

## 3

లలితసమ్మంధం స్థిరపడ్డది. ముహూర్తం కూడా నిశ్చయమయింది. పెళ్లి విజయవాడలో వరుడిగృహంలో జరిగేటట్లు నిర్ణయించుకోవడంవల్ల పెళ్లి రేపు కద్దనంగా లలిత కాళ్ళకు పారాణి కళ్లకు కాటుక బుగ్గన చుక్కతో పెళ్లికూతురై రాధ యింటికివచ్చి పెళ్ళికి రమ్మని రాధను ఆహ్వానించింది.

"ఈ శుభసమయంలో నీతోపాటువచ్చి నీ సంతోషంలో పాలుపంచుకునే స్థితిలో లేనమ్మా!" అని విచారంతో అన్నది రాధ.

లలిత యిక బదులు చెప్పలేకపోయింది.

ఆ మర్నాడు లలితకు విజయవాడలో వివాహం జరిగింది.

తర్వాత రాధ దగ్గిరికి లలితతప్ప తతిమ్మా పిల్లలు వచ్చి కుట్టుపని నేర్చుకుంటూనే వున్నారు. రోజులు గడిచిపోతున్నవి. ఒక రోజున పోస్టుజవాను రాధకు ఒక వుత్తరం యిచ్చి వెళ్ళిపోయ్యాడు. ఆ వుత్తరం చదువుకోగా విజయవాడనించి లలిత వ్రాసింది. అందులోని సారాంశం యిది.

అక్కా నిన్ను చూసి యెన్నాళ్ళో అయినట్లుంది. ఈ నెలరోజులబట్టి నిన్ను తలవని రోజులేదు. ఒకసారి వచ్చిపోవలెను.

రాధ వుత్తరం చదువుకునేంతలో ఓ వడికారు దాటిన వ్యక్తి వచ్చాడు. తల నెరిసింది. కట్టుపంచె చొక్కా, వుత్తరీయం సామాన్యమైన బట్టలు వేసుకున్నాడు. ఆ వ్యక్తిని రాధ చూసి ఆప్యాయంగా "రా రంగయ్య మావాఁ యెప్పుడు రావడం! యిలా కూర్చో" అంది.

అతడు అక్కడవున్న పెట్టెమీద కూర్చుంటూ "ఈ వూరు పనివుండివచ్చి నిన్ను చూసిపోదామని వచ్చానమ్మాయ్" అన్నాడు.

"ఇంటివద్ద విశేషాలేమిటి మావాఁ?" అనడిగింది రాధ.

"విశేషాలేమున్నై. మీ అమ్మకు మొన్న రెండు రోజులు జ్వరం తగిలింది. ఆస్పత్రికివెళ్ళి మందు తెచ్చుకుని తాగితే నయమయింది. ఆమెకేముంది. నీమీదే చింత. పెద్ద పిల్లేమో అవిసమావాన్ని ఆవిడ కాపురం చేసుకుంటూవుండె. యెప్పుడూ నిన్ను గురించే విచారపడుతూ వుంటుంది. నేను యిక్కడికి వస్తానని తెలిసి అమ్మాయి దగ్గిరికి కాస్తవెళ్ళి రా అన్నా" అని చెప్పింది. అయితే నీకిక్కడ బాగా వుంటున్నదా అమ్మా!" అని అడిగాడతడు.

"ఫరవాలేదు కుట్టుపని బాగానే వస్తున్నది" అంది రాధ.

"మీ నాన్న యెంతమంచివాడమ్మా! యెటువంటి దర్జాకలవాడమ్మా! ఆయనగనక వుంటే నీవు యిక్కడకు వచ్చి యిట్లా తిప్పలు పడవలసి వచ్చేదా?" అన్నాడతడు.

"కర్మ యెవరి వశం మావాఁ!" అంది, రాధ.

"అంతేనమ్మా అంతే! చేసుకున్న సమ్మంధం కూడా అట్లా తగలడాలా! నీ దగ్గరేమైనా డబ్బులున్నయ్యా అమ్మాయ్! మీ అమ్మ అడిగమంది యెవరో బాకీ వాళ్ళు తొందర చేస్తున్నారట." అన్నాడతడు.

"పది రూపాయిలు వున్నై. యిస్తా పట్టుకెళ్ళు. మావాఁ అయితే మీపార్వతిఅత్తవారింటికి వెళ్ళిందా?" అని అడిగింది.

"ఆఁ వెళ్ళి పదిరోజులవుతుందమ్మాయ్! సారె అదీ పెట్టిపంపేశాం. రెండో అమ్మాయికి కూడా సమ్మంధము కుదిరింది. యిక పెళ్ళి చెయ్యాలి" అన్నాడు.

"సమ్మంధం యెక్కడ కుదిరింది మావాఁ?" అని అడిగింది.

"పామూరులో అమ్మాయ్. కుర్రవాడు చదువుకున్నవాడే. ఎక్కడా కట్నాలు! కిందపెట్టి మీదపెట్టి అఖరుకు అయిదువందలు కట్నానికి ఒప్పించేసరికి తాతలు దిగివచ్చారు. అయితే మీ తమ్ముడు యేడీ అమ్మాయ్?" అని అడిగాడు.

"ఒకళ్ళ కుట్టుకూలి ఇవ్వాల్సివుంటే అడిగిరావడానికి ఇప్పుడే వెళ్లాడు" అని చెప్పింది రాధ.

అతడు కాసేపు ఆమాటా ఈమాటా మాట్లాడి "డబ్బు ఇవ్వమ్మాయ్ యిక వెళతాను." అని అన్నాడు.

"భోజనం చేసి వెళ్దువుగాని మావాఁ" అని రాధ అనగా—"అమ్మమ్మ! యిప్పుడు భోజనం కాదు త్వరగా యిల్లు చేరుకోవాలి" అని రాధ దగ్గర పది రూపాయలు పుచ్చుకుని వెళ్ళిపోయ్యాడు.

తర్వాత వారంరోజులకు పోస్టు జవాను రాధకు రెండు వుత్తరాలు యిచ్చి వెళ్లాడు. ఒకటి లలిత వ్రాసింది. రెండోది ముస్తాబాదనించి తన పినతండ్రి వ్రాసింది. లలిత వ్రాసిన వుత్తరంలోని సారాంశము యిది:

"అక్కా నీ చెల్లెలిమీద యింత శీతకన్ను వేయడము ధర్మంకాదు. రాత్రుల్లో నీవు నా కలలోకి వుంటున్నావు. నేనుపరాధీనను అయిపోయ్యాను. నేను

నిన్ను కలుసుకోవాలంటే నా పుట్టింటికి వచ్చినప్పుడు తప్ప వీలులేదు గాన నీవు తప్పక ఒకసారి వచ్చిపోవలయును. ఏమీ వ్రాశానని అశ్రద్ధ చేయవద్దు. గాంధీ నగరంలో లక్ష్మీవిలాస్‌కు యెదురుగావున్న యిల్లేమాది అని వ్రాసింది.

రెండో వుత్తరం తన పినతండ్రి తనకు వంట్లో సరిగా వుండడం లేదనీ వచ్చి చూసివెళ్లమనీ వ్రాశాడు.

రాధకు బయలుదేరడం తప్పనిసరి అయింది. పెదవడ్లపూడినించి రైలెక్కితే ముక్తాబాదుకు రెండు గంటల ప్రయాణం. దారిలో విజయవాడలో దిగి లలితను కూడా చూసి ముక్తాబాద వెళ్ళవచ్చునని అనుకుంది.

ఆ మర్నాడు రాధ చీకటితో లేచి లాంతరు పెట్టుకుని తొందరగావున్న బట్టలను రైలువేళదాకా కుట్టి మిగతా గుడ్డలు కత్తిరించి కుట్టమని తమ్ముడికి అప్పగించి తాను రైలెక్కి విజయవాడలో దిగింది. రైలు దిగి టిక్కెట్టు గేటువద్ద యిచ్చి వంతెనమీదుగా నడిచి బండి కావాలాఅని యెదురువచ్చే గుర్రబ్బండి వాళ్లను రిక్షావాళ్ళను తప్పుకుని గాంధీనగరం స్టేషనుకు సమీపంలోవుండడంవల్ల కాలినడకన బయలుదేరి లలిత వ్రాసిన అడ్రెసు ప్రకారం వాళ్ళ యిల్లు వెదుక్కుంటూ వెళ్ళింది. రాధ వాళ్లయిలు సమీపించి లోపల అడుగు పెట్టేసరికి పంచలో కూర్చుని యేదో కుట్టుకుంటున్న లలిత రాధను చూసి సంతోషంతో "రా! అక్కా!" అంటూ ఒక్క గంతులో రాధకు యెదురువెళ్ళి "నిన్ను చూసి యెన్నాళ్లో అయినట్టుంది అక్కా" అని వసారాలోకి తీసుకవచ్చి "వారు లోపల లేరులే అక్కా యిప్పుడే డ్యూటీకి వెళ్ళారు." అంటూ ఆప్యాయంగా రాధను లోనికి తీసుకవెళ్ళింది. మధ్య హాల్లో నాలుగైదు కుర్చీలు ఓ డ్రాయరు వేసివున్నవి. గోడన ఏవో చాలాపటాలు తగిలించివున్నవి. లలిత రాధను సరాసరి పెరట్లోకి తీసుకువెళ్ళి కాళ్లకు నీళ్ళిచ్చి ఆమె కాళ్లు కడుక్కున్న తర్వాత యిది వంటగది. యిది పడకగది అని లలిత రాధకు చూపించింది. తర్వాత యిద్దరూ మధ్యహాల్లోకి వచ్చారు. లలిత గోడనవున్న ఓ పటాన్ని రాధకు చూపిస్తూ "ఈ పటం చూశావా అక్కా! యిందులో వున్న పులినీ లేడినీ టేబిలుగుడ్డమీద కుట్టాలని చూస్తున్నాను. నీ చలువవల్ల యిప్పుడు బాగా కుట్టగలుగుతున్నాను." అని చెప్పింది.

రాధ ఆ పటాన్ని చూసి "అందులోవున్న చెట్లు మొదలైన సీనరీ కుట్టులోకి రాకపోయినా పులినీ లేడినీ బాగాకుట్టవచ్చు." అంది. అలా ఆపటాన్ని చూస్తూన్న రాధ దృష్టులు అవతలవున్న మరో పటంమీదికి మళ్లినవి. అది లలిత పెళ్ళికి వాళ్ళ దంపతులు దిగిన ఫోటో. దంపతులిద్దరూ మెళ్ళో పూలమాలలతో వున్నారు. ఫోటో చూసేసరికి రాధకు గుండెఆగినంతపనైంది. తప్పి జారి యే పులిగుహలోనో అడుగుపెట్టినట్లు కంపించిపోయింది. ఇక అక్కడ నిలవలేదు. చరచరా వీధిగుమ్మం వేపు నడిచిపోయింది. అక్క చేత ఆపటంలోని రెండు బొమ్మలూ గీయించి ఆమెచేతనే మొదలు పెట్టించాలి అని ఆలోచిస్తున్న లలిత అటు చూసేసరికి రాధ వీధి గుమ్మంలోకి వెళ్ళిపోయింది. లలిత "యెక్కడికి అక్కా!" అంటూ తాను కూడా వీధిగుమ్మంలోకి వెళ్ళింది. అప్పటికి రాధ గుమ్మందిగి రోడ్డెక్కి వెళ్ళిపోతున్నది. లలితకు యిదేమీ అర్థంకాలేదు. మాటా మంచిలింపు లేకుండా యెక్కడికి వెళ్ళుతున్నట్టు అనుకుని "అక్కా! అక్కా!" అని బిగ్గరగా కేక వేసింది.

రాధ తిరిగైనా చూడకుండా వెళ్లిపోసాగింది. వచ్చి కానీసేపైనా కాలేదు. అక్క అట్లా యెందుకు వెళ్లిపోతున్నదో అర్థంకాక లలిత గుమ్మంలో కొయ్యబొమ్మలా నిలబడిపోయింది!

# సత్యభామా స్వరూపము

"రాజేశ్వరి"

'సత్యభామ' అనుపదము శ్రవణగోచర మైనంతనే వాసెనకట్టు కట్టి చీకటింటిలో అలక పులకరించిన యొక భామామణియో 'సత్యభామా విధేయుకుగాక' అని భరను గర్జించిన యొక మదవతియో ఏదో యొక సమయమున పాలయుల్కా దీర్పుటకై ప్రణమిల్లిన నాథుని 'వామపాదంబున తొలగంద్రోచిన' యొక ధూర్త నాయికయో మనకు స్ఫురించును. నిజమునకు సత్యభామ స్వరూప మది మాత్రమే గాదు. ఆ ఖండిత నాయికాత్వంక నతరస సముచ్చయము నామె గుణ పద్మమునం దొక దళము మాత్రమే—ఆమె కరకుంగట్టిన వీరవనిత. శృంగార రసరాజ్ఞి. నేర్పరితన మామెసొమ్ము. ప్రబంధ వాఙ్మయము చేగాదు ఆంధ్ర వాఙ్మయము నంతను (చరిత్రనివా) తరచి చూచినను వీరత్వమున అంతటి దిటతనముగల స్త్రీమూర్తి మరియొకటి కానుపించదు. సుభద్రలో మాత్రమా రేఖ కొంత కొంత భాసించును. ప్రత్యక్షముగ కదనరంగమున కత్తి బట్టక పోయినను, వీరత్వముట్టిపడు హృదయముతో మహాభారతయుద్ధమునకు మూర్తిధారిణి యైనది ద్రౌపది. కాని ఆమెలోని వీరత్వము పరోక్షముగ నే ప్రదర్శింపబడ సత్యభామలో నయ్యది ప్రత్యక్షమైనది.

సత్యభామ పూర్ణరూపము వీరశృంగారముల సంగమస్థానము. ఆమె తరుణాంగుళులకు వల్లకీ తంత్రుల మీటుట ఎంత కైవసమైన విద్యయో శస్త్రాస్త్ర ప్రయోగాదు లంత యలవడిన విద్యలు. నరక కర్బుర కదళికాతరుల నరుకు పాపరాధు డైన నాథుని దండించుటయందెంత సమర్థురాలో త్రిలోక పూజ్యుడగు మురళీధరుని మనసు నెఱిఁగి వర్తించుటయం దంత నేర్పరి. కాని, రాను రాను కవుల దృక్పథమున ఆమె శృంగారరసదేవతగ మాత్రమే భాసించినది. దక్షిణాంధ్ర యుగమునాటికి ఆమె గర్వితగ, కుపితగ, ఖండితగకూడ ప్రజానీకపు దృష్టిలో రూఢమై పోయినది. ఆ శృంగార రసరాజ్ఞికి ఖండిత నాయికాత్వము రమణీయతనే ఆపాదించినది. కాదనలేము—కాని, అది కేవలము మాత్రము కాదని నొక్కి చెప్పగలను. అద్దానిని ఎర్రన, నాచన, పోతనలు ఎత్తిచూపక పోలేదు. వారి రచనలలో సత్యభామ పూర్ణస్వరూపము చూడతగ్గది. అందును, ఆ పాత్రయందు చూపిన మెరుకులు అత్యద్భుతముగ పరాకాష్ఠకు పోయినవి.

పోతనార్యుని సత్యభామలో ఓర్పును మించిన నేర్పు—భక్తిని మించిన యుక్తి వీరశృంగారములు అందెగ నేక కాలమున ప్రదర్శింపబడినవి. కాని, సత్యభామపట్ల, భాగవతకృష్ణుని చర్యయే వేరు. ఆమె ప్రత్యక్షముగ నరకాసురునితో యుద్ధము సాగించు వరకు శ్రీకృష్ణుని కామె యందున్న వీరత్వాంశ అసలే తెలియదేమో యనిపించును. ఆమె హృదయపులోతు లెట్టివో కాని, కేళీమందిరమునందు భర్తతో మాటలకునకైనను ముచ్చటగ తన శక్తి సామర్థ్యములను చెప్పుకొనియుండలేదు.

నరకాసురునితో యుద్ధమునకై పోవు కృష్ణుడు తన పోకను గూర్చి యలవోకగా ప్రసంగింప, సత్యభామ హృదయము నుప్పొంగను. తానుకూడఁ గృష్ణునితో వెడలి తన ప్రావీణ్యమును ప్రదర్శింపవలెనని ఆమెకు చిరకాలమునుండియు కోర్కె. అద్దానికిది తరుణమని మురిసినది. కాని, సరసురాలు భర్తకది తానై వెలిబడి చెప్పదు. తదింగితమెరిగి అతను రమ్మని పిలువడు—పిలువనిదే ఆమె పోలేదు. అప్పటికి తన నేర్పంతయు సంధించి భర్తచిత్తంబురా నతియుక్తితో "దేవా! నీవు నిశాచరసంఘముల మర్దించి చెండాడ నీ ప్రావీణ్యము చూడగోరుదుగదా ప్రాణేశ! నన్నీవెంటన్ గొనిపొమ్ము నేను కరుణన్!" అని వినమ్రయై వేడికొనును. ఆ వేడికోలు మరుగున ధ్వనితార్థమెంత యేని కలదు. 'లోకమున—నీ మగడు వీరాధివీరుడని జనులందురు. అట్టి జగత్ప్రఖ్యాతములైన మీ శక్తిసామర్థ్యములు వారును వారును చెప్పగా వినవలసినదే గాని, నర్ధాంగినైన నాకుఁ ప్రత్యక్షముగ చూచు యోగ్యత

లేదా! చీర లిమ్మన లేదు—మాడ లిమ్మన లేదు. నాథుని సామర్థ్యము కన్నులార చూచి విస్మయింతును. అంతే మాత్రపు దానను ప్రసాదింపరాదా!' అనునది ధ్వని. అద్దానికిఁ గృష్ణుఁడు వివరమైనను వీఁగక, వినియు విన నట్లూరకున్నాఁడు. సత్యభామకుఁ గత్యంతరము తోప లేదు. మరల పైదానికనుబంధముగ " సెలాచి వీరెంచి, నీ దేవీసంహతికెల్లఁ జెప్పుదు—ధీరద్విప ప్రతాపోన్నతుల్ " అన్నది. ఈ వాక్య మొక్క మనోహరభావ విలసితము. పదారువేల గోపికలలో, ఎనిమిది పట్టమహిషులలో, ఇంకను అచ్చటచ్చటనున్న ప్రేయురాండ్రలో నే నొకరితయిందైనను, నాయందుకంటె మీ కధికమైన ప్రీతి యుండవచ్చును. అది చెప్పలేక, నాకవి మోమోటముఁ జెందవచ్చును. నిజమునకు హృదయమునంటిన ప్రేయురాలు మెచ్చినదే విజయుని సంభావించుట మాన్యము. నేను వారికి వనుమతించినచో మీ ప్రతాపములు చూచి మీ హృదయమునంటిన దేవీసంహతికెల్ల నా యంతట నేను పోయి చెప్పకొందును. అప్రయోజనమునకైనను నాకనుమతింపరాదా యని భావము. అత్యంత సత్యభామ నేర్పులో వివక్షితాన్యపర వాచ్యమై భాసించినది.

అప్పుడైనను కృష్ణుడు రమ్మనడు, సరికదా, తన అసమ్మతినే వెలిబుచ్చుచు యుద్ధమున—'వాయునిర్గత పద్మరజ రేణువులు గావు, తురగరేఖా ముఖోద్ధూత రజము గాని' 'తక్కీర్ణ జలతరంగాపారములు గావు, శత్రు ధనుర్ముక్త సాయకములు గాని, కలహంస సారస కోలాహలములు గావు, దనుజేంద్ర సంహతి కదంబకములు గాని, అని ఏమేమియో చెప్పుచు, ఆయుద్ధమైనను, సామాన్యులతో గాదు, దానవులతో సుమా, అబలవు, నీ వేష, రణరంగ మేడ? వలదు వలదనును. ఆ దిగజారు మాటలకు సత్యభామ ఉప్పొంగు తన ఉత్సాహమును జారనీయలేదు. దైత్యసమూహముతోడి యుద్ధమనిగదా, వనితను భయపెట్టున దనుకొని మరికొంత నేర్పుతో 'దానవులైన నేమి, మరిదైత్య సమూహములైన నేమి, నీమానిత దివ్యబాహువుల మాటున నుండగ నేమి శంక' యనినది. ఈ యుక్తికి ప్రత్యుక్తి లేదు. నీవుండగ నాకేమి శంక యని, సత్యభామ యనునపుడు నేనున్నాను, నీకు భయమేల. రావలదని కృష్ణుడనలేదు. కృష్ణుడే గాదు మగడనిపించుకొన్న ఏ మగవాడును, అట్లనడు. ఆ సందర్భమట్టిది. ఆ సందిగ్ధావస్థలో కృష్ణుడు తడబడుచుండ సత్యభామ వెంటనే 'కరతోయజములు ముకుళించి మ్రొక్కి' అంజలి పోసెకదా, వినమ్రురాలై, భర్తను చూచినది. ఆ చూపులోని భక్తి, వినయసంపద, భర్తృహృదయమును నేరో కలచి వైచినది. భార్యయైన నేమి, భక్తురాలైన నేమి, అభక్తివినయములకు కట్టుబడవలసినదే. శృంగారమునకు చలింపకున్న, అరసికత్వమే ద్యోతిత మగును గాని, భక్తకరుణలకు కరుగకున్న, మానవత్వము నకే కాదు దేవత్వమునకును, లోపమే. ఆకీలక మెరిగిన పోతన, కృష్ణునిచే తిరుగ మెరిగి, 'సరే' యనిపించినాడు. కదనరంగ ప్రవేశమునకు పూర్వము పోతన చిత్రించిన సత్యభామ నేర్పట్టిది. ఆ సందర్భమున ఎఱ్ఱాప్రెగడ నాచన సోమనల పోకడలే వేరు. వారి రచనలలో యుద్ధాత్పూర్వము సత్యభామకు కృష్ణునితో వాగ్వాద మేలేదు. కృష్ణుడామె కోరికను బాగుగ నెరిగినవాడు. అంతియె కాదు. తనకు యుద్ధమున తోడు వాడోడుగ నుండుటకే సత్యభామను వెంటనిడుకొనిపోయె నేమో ననిపించును.

భాగవతమున — కృష్ణుడు సత్యభామతో కూడ గరుడారూఢుడై ప్రాగ్జ్యోతిష ప్రాక్ప్రాంతము చేరి, యుద్ధమునకు గడంగ రణప్రావీణ్యానవ్య, సత్యభామ లేచి, కుంభద్వీర సంరంభరయై, 'పాలింపయ్యెద చక్కగా గురిమి, సంఘటిత నీవీ బంధయై,' తన ప్రాణేశాగ్రభాగంబున నిలచెనట. భర్త లేచి నిలువబడ్డ, భార్య బహుమాన పురస్సరముగ లేచి నిలువబడుట మర్యాద. అద్దానిని పాటించుటకు కాబోలు సత్యభామ నిలచినదనుకొనినాడు కృష్ణుడు. కాని యంతతో నామె యూరకొనియుండలేదు. యదు వంశమౌళి చేతిలోని వింటిని నెమ్మదిగ స్పృశించినది. విల్లంబులను చూచినంతమాత్రమున పోయిన నేమి యనునట్లు కృష్ణుడామె కందిచ్చినాడు. ఆ విల్లందినతోడనే సత్యభామలో నూత్నశక్తి మెరసినది. ఆహవసంరంభోత్సాహినియై వరుని యుండగా పతిని చూచినది. వ్యవధాన మీయలేదు. అగణ్యవంత తేజోవిశేషావిర్భూత ప్రతాపములతో వీరాలోక దుర్లోకయై, దైత్యసంఘము నిర్వీర్యమగునట్లు బాణ ప్రయోగోప సంహారణాద్యయూన విద్యలన్నియును, యథాక్రమముగ సంధించినది. శత్రుధనుర్ముక్త నారాచ మర్దన సమర్థనితయై ఆమె నేర్పు వీర గుణము సారింప, ఆ జ్యావల్లీ ధ్వని గర్జనముగ, విల్లు ఇంద్ర

శరాసనముగ, పయోజాక్షునకు మేఘముగ, తాను విద్యుల్లతగ భాసించెనట. అప్పుడు వీరత్వముచే వింత చెలువము నందిన ఆమె చక్కదనము ద్విగుణీకృతమైనదట.

కృష్ణుడు ఆ ప్రావీణ్యమునకు ఆశ్చర్యచకితుడై ఎదుట వీరాంగన రౌద్రరూపము చూచును. తత్క్షణమే ఆ శృంగారవనములో చక్కగా తీర్చిన చంద్రకాంత శిలామయ వేదికపై నిర్భర కౌతూహలముతో ముద్దులు గురియు సత్రాజితిని తలచుకొనును. "లఘ్వాలోకముతో, వలయాకార ధనుర్విముక్త విశిఖవ్రాతాహతారాతియై హేలాగతిని" బోరు వనితను చూచుచు పుష్పాపచయ మొనరించుచు, లేగొనసియాడ, లలాట రేఖ చెమరింప, వలసి తొలగిపోవు అలివేణిని తలచుకొనును. కౌస్తుభమణి హారము తిన్నతాను మరచి, వీణె చక్కగ బట్టు తెరవెరుగని అతివ బాణాసనము నెట్టుబట్టినదో, చిలుకకే పద్యముఁ జెప్పుచు అలసిపోవు అలివేణి అస్త్రమంత్రము లెన్నడభ్యసించినదో, సరవి ముత్యములను గూర్చజాలని తరుణి ఏనిపుణత సంధించినదో విశితశరములని వితర్కించుకొనినాడు. యుద్ధరంగమున శత్రువునకు ఆమె చేలాంచలము ఘనధూమకేతువుగను, బాణవృష్టి మహోత్పాతదాయిగను, భాసింప, కృష్ణునకది కందర్పకేతువై హర్షదాయియై యొప్పినదట. వీరాంగన ప్రావీణ్యము హృదయంగమమై యొప్ప కృష్ణుడు రసావలోకనముతో సరసముగ సత్యను జేరి "కొమ్మా! దానవ నాధునికొమ్ము లాహవమునఁ దొలగినవి, ఇచ్చెద, దిగ్విజయము గైకొమ్మా!" అని ముక్కళా విలాసినీ హస్తగత బాణాసనము నందుకొనుచు మెచ్చితిననునట్లు నిండు మనముతో చూచినాడు. నే ధన్యనైతి నన్నట్లు సత్యభామ సరసాలోకనముతోనే మ్రొక్కినది.

ఇది పోతనార్యుడు చిత్రించిన సత్యభామ. వినయమునకు లోపమురాని కార్యదీక్ష, శృంగారమునకు భంగములేని వీరత్వము, వీసము వీగకుండ సమస్థాయిలో నడపినాడు. ఇందంగిరసము వీరమే కాని, యంతకు తక్కువరాని జాజ్వల్యశోభతో శృంగారము అంతర్వాహినియై ప్రవహించినది. కావుననే సత్యభామ పూర్ణరూపము ప్రత్యక్షీకరింపబడినది.

ప్రబంధ పరమేశ్వరుని గ్రంథములో—నరకాసురుని బాణఘాతము తన ఫాలభాగమున సోక, కృష్ణుడు మూర్ఛపోవును. సత్యభామ పరిచర్య చేయగా తేరుకొని వనితను తానె రణమునకు బురికొల్పెను. సత్యావధూటి ఆహవకేళి నరకునకు ఆసన్నమరణ కారణము కాగా కృష్ణుడు వీరాంగన చాతుర్యమునకు మది మెచ్చి, పెల్లుబుకు ప్రీతితో సమరస్వేద జలోజ్వలంబైన యాయమ్మ ఫాలభాగము తుడిచి, 'అలసితివి వింటి నిమ్మను'మ, చాటులోదనను సాభిలాషగ చూచును...ఎద్దానిని రుక్మిణి సేవించి కైవస మొనర్పుకొనలేకపోయినదో, ఎయ్యది వేదాంత వేద్యుల హృదయములకు అందీ యందక జారిపోయినదో, దేనికై పదారువేల గోపికామణులు విరహవిభ్రాంతలై ఆర్తి పడిరో ఎద్దానిని తానీవరకు రతికళా సమయములలో వాంఛించి పొందలేక భ్రమసిపోయినదో, ఆ మహత్తర తేజోమయ అనురాగకిరణము తృణమాత్ర మామెపై సోకినదట. ఈ కడపటి భావ వ్యక్తీకరణ మొక్కటి చాలును శంభుదాసుని భావౌన్నత్యము నెరిగికొనుటకు. ఇప్పటివ వాదన పోతన కీ యౌదార్యము అబ్బియుండలేదు. సరికదా, ఆ మహత్తర తరుణము నాతడు ఆభరణములతోనే సరిపెట్టుకొనినాడు. ఈ సందర్భమున పోతనయు, ఆభరణ ప్రస్తావము కావింపక పోలేదు. కాని "మెచ్చితి నిచ్చెద గురువిజయము" అను విజయాన్వితిలో "కోరిన యాభరణము" అను మాట వాచ్యసిద్ధాంగమగుట, ప్రాధాన్యము గురువిజయమునకే దక్కినది. అది కొంతలో కొంత నయము.

సత్యభామకు సంబంధించినంతవరకు, తక్కిన కథాకథనములలో సోమనార్యుడు ఎఱ్ఱన కంటె వాసి యైనాడు. ఎఱ్ఱనకృతిలో కృష్ణుడు మూర్ఛదేరి "సమంచితోత్సాహ సాహసిక విభాసిని యగుభామినిని" జూచి "నీవలసితి వాహనభార మించుక (నీవు) వహింపు" మనినాడు. నాచన మూర్ఛదేరిన కృష్ణునిచే, "చంద్రవదన! శార్ఙ్గమిందు! నీవు సమరంబుకోరుదు వవసరము వచ్చె" ననును. ఈ నుడిలో అతఃపూర్వము సత్యభామ బవరము సేయవచ్చెద ననుటయు, కృష్ణుడు ఎప్పటికప్పుడే ఉపేక్షించుచువచ్చి, నేడు సమయము వచ్చినది గావున భారము వహింపుమనుటయు, జరిగినట్లు తోచును.

ఎఱ్ఱన నాచనవలె సత్యభామపాత్రను పోషించుట మాత్రమేగాక, పోతన స్వతంత్రుడై చిత్రించి

నాడు. కాని, ఒక గ్రంథముయొక్క భావము ఎంత కాదనుకొన్నను, తరువాతి దానిపై కొంతకొంత సోకక పోదు. అట్టివి ఒకటిరెండు నాచన పోతనలమధ్య కానవచ్చును.

నాచన:— "అరిజాతముల్ హరిఁజూచుఁ జూచుకము
లందందంద మందార"— (కే)

పోతన:— "పరుజాతముల్, వరుఁజూచు
నొంపవలరింపల్
లోపరాగోదయా"

పైదానిలో అరివారలు, రెండవదానిలో పరుడుగను, వరుడుగను, మారిరి.

నాచన:—

తంత్రీవినోదంబు తడవు పైఁబని చేత
నొవయుంబు తెగలపై నొరగొనుట
యుద్ధంబు పిడిముట్టవలయు పాణితలంబు
లస్తకరి యించులా పుకలిమి
చెలికత్తె నొత్తిలి చీరలేని యొలుంగు
సింహనాదంబుచేఁ జెదరకునికి
ప్రథమ నర్తనకేళిఁ బరిఢవింప పదం
బైదు బాణంబుల వలలఁబెనిమి
పోయగపు జిత్రరూపంబు జూచుచోట
చేపరు విలోచనంబులు వికృతదైత్య
లక్ష్యమీక్షించుటయు, మొక్కలంపు గెలుపు
గైకొనిరొ సత్యభామ సంగ్రామసీమ.

ఈ పద్యభావమునే పోతన తనివితీర చక్కని రెండు సీసములలో గుప్తము గావించుకొనినాడు.

బొమ్మ పెండ్లిండ్లకుఁ బోవనొల్లని బాల
రణరంగమున కెట్లు రాదలంచె
మగవారిఁగనిన కొమ్మకుసుఁ జేరెడి వింతి
పగవారి గెల్వనే పగిది జూచెఁ
బసిడి యొరెర్యాలలెక్క భయమందు భీరువు
ఖగపతి స్కంధ మేకడిఁది చెక్క
సఖులకోలాహలస్వనము లోర్వని కన్య
పటహభాంకృతుల కెబ్బంగి నోర్చె!
నీలకంఠములకు నృత్యంబు గరపుచు
నలసి తొలిగి పోవు నలరుఁబోడి
యే విధమున నుండె చెలమి నాలీఢాది
మానములను రిపుల మానమడప.

పీడెఁజిక్కగ బట్ట నెఱవెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్లు బట్టనేర్చె!
ప్రాఁకుఁ దీగఁ గూర్పంగ నేరని లేమ గుణ
ముల నెక్కియునమః కోటి గూర్చె
సరవి ముత్యము గ్రువ్వజాలని యబల యే
నిపుణతి సంధించె విశిఖశరముఁ
జిలుకకుఁ బద్యము చెప్ప నేరని తన్వి యు
గ్రాస్త్ర మంత్రము లెన్నడభ్యసించె?
పలుకుమనిన బెక్కు పలుకని ముగుద యే
గతినోర్చె సింహగర్జనమ్ము
నవగ మెఱసె త్రిజగదభిరామ, గుణధామ
చారు సత్యభామ, సత్యభామ.

పైదానిలో (నాచన గ్రంథములో) సత్యభామ కోరముల కెట్లోర్చెనో యను భావమును రెండవ దానిలో నెట్లు నేర్చెనో యను భావమును, ద్యోతితములు. ఇక మిగిలిన భాగమున ఎవరితీరు వారిదే. ఒకరి వాట వింకొకరికి రాలేదు. వాటికి పాత్ర పోషణచిత్రణాదుల పట్ల కవులకు, గల భిన్న దృక్పథములే కారణములు. ఆ దృక్పథముల కాధారము వారి యాత్మీయత.

ఎఱ్ఱనార్యుని కవిత్వము సత్యనిష్ఠము. అది సంయమన మెఱిగిన సహృదయ హృదయాహ్లాదకారి యగును కాని, బాహిరమగు నింద్రియోద్రేకమును కలుగ జేయదు. నాచనలో రసోద్గుణస్పర్శ అధికము. పాండిత్య ప్రకర్షతోపాటు కౌతుకమును కడదాక ప్రదర్శించినాడు. సత్యభామ నరకాసురునితో పోరు యుద్ధమును వర్ణించుచు ఎఱ్ఱన "విల్లుం గేలఁ బుచ్చుంచి... ఆతఁడు నేవీరత్వ ముగ్రోన్నతిన్" అని సామాన్యముగ వర్ణింప, నాచన "అరిజాతముల్ హరిఁజూచు... దరహాసామృత పూరముల్ గురియుచున్ దివ్యంగి కేళిగతిన్" అని చమత్కారావహము గావించినాడు.

ఎఱ్ఱన సంయమనముగల కవిసత్తముడు. నాచన లాక్యమెఱిగిన నాగరికుడు. కావుననే మొదటి దానిలో దేవదేవుడు తన దేవితో సైక్యమునంద నాచన నాగరకుడై కొక్కసమాత్రమే నీడుగల్గినాడు.

రాచముశాల్యదులు, ద్యూతక్రీడలు, నర్మగోష్ఠులు, యుద్ధవర్ణనలు, నాచన రచనలో చెక్కిన చెణుకులు. జానపదీయుల యొదంతమునిన ఎఱ్ఱనకు చెల్లె. గోకుల బృందావన వర్ణనములలో ఎఱ్ఱనకు

గల పల్లీయజన జీవితవైచిత్ర్యము తేటపడును. ఎఱ్ఱన హృదయము నాదనవలె షోడశసహస్ర మహిషీ పరివృతుడగు వన్నెలకృష్ణుని వైపుగాక నవనీత చోరుడగు నందగోపాలునిపై ప్రేమొగ్గినదిట.

పోతన కాలనిర్ణయముపట్ల ఓగాము లెన్ని యున్నను ఎఱ్ఱన నాచనల తరువాతివాడగుట తథ్యము. అమ్మహాత్ముడు కృష్ణలీలలో తేలియాడి తనజీవితమే కృష్ణార్పితము గావించుకొనినవాడు. సాధారణముగ హాలమును బట్టినచేయి కలము బట్టుటరుదు. పోతనచేయి హాలమునకు విశ్రాంతినిచ్చుచు కలమును బట్టినది... ఇంకొకమాట—రాజసభాంగణములలో, వారకామినీ సంగతములైన కవివరేణ్యుల కంటములలో, శిష్టకవుల కనుపాపలలో, నాట్యమాడు వాణి రాజనగరు పొలిమేరకావల, తరిగోని పంటకేదారముల నడుమ, ఇచ్చుకొనుటయే గాని, తెచ్చుకొనుట యెరుగని పోతనార్యుని మ్రోల కన్నీరిడినది. అది పోతికులకే కాదు; యావద్భారతీయులకును గర్వకారణమే.

పోతన సగుణ బ్రహ్మోపాసకుడు. కృష్ణ పరమాత్ముని సువిశేషమ్ముగ ధ్యానించి జనకాదులకు లేని భగవత్సాక్షాత్కారమును పొందినవాడు. బాలగోపాలునితో గంతులువైచి తనియక మురళీధరుని వేణురవామృత ధారలం గ్రోలుటకై గోపై, గోపిక కాకుండ పోలేదు. అట్లని భాగవత కృష్ణుకు నాగరకుడు కాకపోలేదు. అతడు పౌరబహి యంతఃపురమే లేదు. ఉట్లు కొట్టుట, మొదలుకొని యుద్ధరంగములన్నియు శోధించినాడు. చలిదిముద్దలిడు గోపకుమారుని మొదలు, విశ్వామిత్ర వశిష్ఠ నారదులకును తత్త్వోపదేశము గావించినాడు. పట్టాంగన మొదలుకొని రుక్మిణీవరకు గల 'జనానా' నంతయు యథాపంథముగ సత్కరించిన రసికుడు. గొల్లపడుచుకల వస్త్రాపహరణమునందెంత ప్రీతియో పాంచాలీ మానసంరక్షణమున్న అంతమక్కువ. అట్టి కృష్ణలీలలను చిత్రించిన పోతన యోగభోగాద్వైతి. అయినను, అతడు రసానేకపరుడైన ధర్మవర్తి యనక తప్పదు. —తనత్రోవ తనదే కానీ, తర్కకర్కశత్వముతో పనిలేనివాడు— "తన్నోడి నన్నోడెనా, నన్నోడి తన్నోడెనా" అన్న ధర్మశాస్త్రార్థ విమర్శదక్షయగు, ద్రౌపదిపాత్రను సృష్టించుటలో మాతృత్వమును మాత్రమే సమగ్రముగ ప్రదర్శింప గల్గినాడు. తత్తుల్యములగు శకుంతల పాత్రయు, నీతని చేతిలో నంతకుమించి యుండలేదు. కాని, సత్యభామ పాత్రకడ నేలకో పోతన విలక్షణమార్గము నవలంబించినాడు. అది సత్యభామ అదృష్టమే గాబోలు.

మొత్తముపై పోతనార్యుని తత్త్వమునకు, చేపట్టిన గ్రంథమునకు, నేకవాక్యత కుదిరి ఆంధ్ర ప్రజానీకమునకు అవిచ్ఛిన్నమగు కృష్ణ కథామృతధార కురిసినది.

# సత్యవ్రతుడు

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

* గత సంచిక తరువాయి *

పిలుతు రుతఘ్నుఁ డంచతనిఁ బేరు ప్రతిష్ఠలు దేశ మెల్లెడన్
వెలయఁగఁ జేయఁ బూనియు వివేకధనుండగు తండ్రి వానికిన్
వలసిన వైదికక్రియ లవారిగ నివ్వటిలంగఁ జేసి యా
వల విధి చోదితంబయిన పద్ధతి వేదము నేర్పఁ జొచ్చినన్

హరిహరి! యొక్కయక్కరమునైనను ముద్దనకైనవాఁడు బి
గ్గఱగ వచింపనేరఁ; డిది కర్మము మాకని తండ్రియన్నఁ ద
త్తఱపడి యేడ్చు; నాతని విధానము సర్వము మూఁడునాళ్ళ సం
బరమయి తల్లిదండ్రులకు బాధ యొనర్చెఁ గ్రమక్రమంబుగా

సోమరిపోతుగాఁ దిరుగఁజొచ్చిన బాలుఁడు వట్టి శుంఠయై
'ఓ'మను నక్షరంబయిన నొక్కటి చక్కఁగ నుచ్చరింపలేఁ
డే మెయి సంధ్యవార్చు? నిఁక నెవ్వని దూఱిన లాభమేమి? గా
రా మది గడ్డలాయె నవురా యిది శాపము కాదె వానికిన్?

కడుపునఁగన్న బిడ్డ పలుగాకిగ మాఱియు వంశగౌరవం
బడఁచినఁ దల్లిదండ్రులకు నక్కట! శోకముదక్క సౌఖ్య మె
క్కడఁ గనిపించు? సంతతిని గానక నోములు నోఁచి కన్న యీ
కొడు కిటులైన దుఃఖమునకున్ మితియున్నదె చెప్పనేటికిన్?

ఇది యిటులయ్యెనే యనుచు నెంతయుఁ జింతిలి తల్లిదండ్రు ల
య్యదనున ఱిచ్చవోయి యెవరైనను నవ్వెదరేమొ! పుత్త్రుఁడై
పొదలెను వట్టి శుంఠ; యిది పూర్వము చేసిన పాపమంచు నా
పద యెటు తీఱునో యని యుపాయముకోసము చూతు రెప్పుడున్

వారికె నచ్చనట్టి యిటువంటి యభాగ్యుఁడు లాఁతివారికిన్
గౌరవమెట్లుగూర్చుఁ ? బయిగాఁ బదిమందికి 'లొల్లి'యై తిర
స్కారము లెన్నఁగాఁ బడసి చయ్యన వాఁడొకనాఁడు నెవ్వగం
గూరిన గుండెతోఁ జనియె ఘోరవనాంతరసీమలోనికిన్

అది గమనించియుం దుదికి నచ్చట ముచ్చటఁ దీర్చఁజాలు న
భ్యుదయములేని పుత్త్రుఁడిఁక నుండియు లాభములేదు—పైగ మా
మది కొక శూలమై తగిలి మానము సర్వము మంటఁ గల్పి యా
పదఁ గడుఁగూర్చునో యని 'ముభావము' సూపిరి తల్లిదండ్రియున్

అడవులఁ బట్టిపోయి తుది కాతఁడు స్రుక్కియు సోలి చిక్కి యొ
క్కెడఁ గుదురైన యాశ్రమము సేర్పఱిచెన్ ; ఫలమూల భక్షణం
బుడుగక శాంతమూర్తి యయియుండును—గంగకుఁబోయి స్నానమున్
విడువక చేయు; నిట్టులు వివేకము కొంత జనించె వానికిన్

ఒకరి 'ప్రమేయ' మెత్తఁడతఁ డొప్పులు తప్పులటంచు లాఁతి వా
రికి వినిపింపఁ డెన్నఁడు—భరించును గష్టము లెన్నియైనఁ గా
తుకమున దైవతార్చనలతో నిలువెల్ల మునింగి మోక్ష సూ
చకమగు వృత్తిలో మెలఁగు; సత్యతపుండని పిల్తురాతనిన్

మునులును వాని వైఖరి సమూలముగా గుఱుతించి గౌరవం
బెనయఁగఁ జూతు రందులకు నేమియు నాతఁడు పొంగఁడేది తోఁ
చిన నది సేయు - సత్యమె విశిష్ట తపంబుగ నెంచి జీవితం
బును నడపించుచుండు; నిటు పూర్తిగ మాఱె స్వభావ మావలన్

అందము చందముం గలుగు నంగన సంతతిలేక దుఃఖముం
బొందిన భంగి వందురి యపూర్వవిధంబున నాతఁ డట్టి ఖ్యా
తిం దనరారియున్ మహిత దివ్యకులంబునఁ బుట్టి వేదముల్
పొందిక నభ్యసించి శుభముం గననైతి నటంచుఁ జింతిలున్.

పరిపరితీరులన్ దన స్వభావముఁ గూరిచి తాన రోసి ని
ష్ఠుర పడుచుండు బెగ్గడిలి స్రుక్కియు నెవ్వగఁగూరి దీనికిన్
మరణమె శిక్షయంచు ననుమానములేక తలంచు నివ్వెఱం
బొరయుచునుండు; స్వాస్థ్యమది బొత్తిగఁ జిక్కదు నాఁడు నాఁటికిన్

చూపుల గుఱ్ఱమై వెలయుచున్ బాడుఁ గేమియులేక చుక్కయుం
జేఁపకయున్న యావువలెసేగి యొనర్చుచు నింత కాల ముం
బాపము మూటగట్టుకొని పాడయి పోయి ప్రసిద్ధ వంశమున్
రూపఱఁ జేసియుంటి; నిఁక రోసియు లాభములేదు లేశమున్

ధనధాన్యంబులు లెస్సగాఁ గలిగియున్ దాతృత్వమేలేని జీ
వనమున్ బ్రోది యొనర్చుచేనివలె నిర్భాగ్యుండనై యింత దాఁ
కను వ్యర్థంబుగఁ గాలముం గడపి కింకర్తవ్యతా మూఢ బు
ద్ధిని సంచార మొనర్చితిన్ దుదికి నార్తింగూర్చె నా జన్మమే

ఉత్తమవంశమం దుదయ మొందియు వేదము మాట బొత్తిగా
నెత్తక శాస్త్రవాసనకు నింతయు నోఁచక సంధ్య వార్చుటే
క్రొత్తగ నేర్చు విద్యయయి కూళ విధానఁ జరించి యిట్టి యా
పత్తును దెచ్చుకొంటి; నలుపాలఁ దొలంగునె పూర్వపాపముల్ ?

వెనుకటి జన్మమందు నవివేకిగనై యొక గ్రంథమేని బ్రా
హ్మణునకు దాన మీయను జుమీ ! యది యింతగఁ జేసెనేమొ ! ర
మ్మనినను వచ్చునే యెవనికైనను విద్యయుఁ గన్యయున్ ధనం
బును దొలి జన్మమందిడని మూఢునకున్ వసుధాతలంబులో

నా చెలికాండ్రు శైశవమునన్ నిఖిలాగమ మంత్రతంత్ర వి
ద్యాచణులై యనారతము తత్త్వమెఱింగి మెలంగ-నే నవి
ద్యా చతురుండనై యదవదల్ వడి యిట్లయి పోయితింగదా !
నోఁచని వాని కెట్టులు మనోరథముల్ ఫలియించు నుర్విలో ?

ఎవనికి విన్నవింతు నిపుడెవ్వఁడు తీర్చును బాధ ? యింతగా
నవమతినై చరించి యిటులక్కట ! చిక్కులఁబడ్డదానికే
మవును ఫలంబు ? దైవగతి యన్యవిధంబున దిద్ది తీర్చగా
నెవనికిఁగాని సాధ్యమె విధీ ! యిఁకఁ దప్పదు ముప్పు నా కిలన్

అని యా మానిసి నెవ్వగం బొగిలి సౌఖ్యంబన్నదే లేక య
వ్వన మందున్ దన జీవయాత్ర యెటులో భారంబుగాఁ గాల యా
పనమున్ జేయఁగ-వాని నుత్తమునిగా భావించి ప్రాంతీయ మా
ని నికాయం బనుకూల మార్గమును గాన్పింపం బ్రయత్నించెడిన్.

సరి-యెట్లో చిరకాల మిట్లు గడపన్ సత్యవ్రతుండంచు నె
ల్లరుఁ గొండాడుచు వానిఁ గూర్చి కడు నుల్లాసంబుగాఁ బల్కు-చుం
దురు; వాఁడింకొక త్రోవ మార్చుకొనఁ డేదో పెద్దగా గుండెలో
బరువున్నట్టులు బాధవొందుఁ బిదపన్ బ్రారబ్ధ మెట్లున్నదో!

ఒకనాఁ డెవ్వఁడొ వేఁటకాఁ డడవిలో నుగ్రాత్ముఁడై తీవ్ర సా
యకమున్ వేయఁగ వ్రేటునం బెదరి యాయాసంబునం గుంది వా
నికిఁ గన్పట్టకపోయెఁ బందియొకఁ; డా నిర్భాగ్యుఁ డద్దానిఁ ద
ప్పక పట్టంగను గోరి ప్రాంతమున నా పాఱుండు కాన్పింపఁగా

అడిగెం బందిని నీవు చూచితివె యయ్యా! యంచు-నా విప్రుఁ డ
ప్పుడు సందేహము పొంది మానమును సంపూర్ణంబుగాఁ బూన నా
తఁడు పల్కన్ గరుణించి యీ యదనులోఁ దథ్యంబు రూపించి నా
యుడుకుం దీర్పవె మ్రొక్కి- వేఁడెద నిదేమో యంచు నూహింతువో!

కులముననున్న వృత్తి కనుకూలముగాఁ బవలెల్ల మేము మా
బలమునఁబట్టి వన్యమృగవర్గముఁ బట్టుట సంప్రదాయమై
వెలయునుగాదె! విప్రులు వివేకులె యెవ్వరికేది వృత్తియో
కలమున వ్రాసిపెట్టి రవుగాము లెఱింగినవారు గావుటన్

అది మదిలో నెఱింగియె మహాత్మ, వరాహముఁ బట్టి కొట్టి స
మ్మదమునఁ జూడ మాయమయిపోయె నిదే మొకొ! నీవు చూచి యుం
డెదవని నాకుఁ దోఁచియె వడిం జనుదెంచితి నాదు విన్నపం
బిది యవధారు దేవ! యని యెంతయు వేఁడియుఁ బల్కె- వెండియున్

ఆఁకట సోలియుందురు గృహంబునఁ బిల్లలు చెల్ల; లందుఁ బెం
జీఁకటి గ్రమ్మఁగా దొడఁగెఁ జెచ్చెరఁ బోవలె దాని పోకడన్
నాకిఁకఁ జెప్పవే యిది వినా గతిలేదుగదా! యెఱింగి య
ట్టాఁకలఁ బెట్ట న్యాయ్యమగునా? క్షణమేనియు నిల్వరాదిటన్

అని యా వ్యాధుఁడు పల్కఁగాఁ దన మనం బారాటముం బొంది యి
ట్లని యా విప్రుఁడు తెల్పఁ డయ్యెను నిజం బా బోయకుం జెప్ప కు
న్నను సత్యవ్రత భంగమే యగును దానన్ బెద్ద చిక్కయ్యె; న
ట్లని సత్యంబును చెప్పెనేనిఁ గలుగున్ వ్యాఘాత మా జీవికిన్

ముందొక నుయ్యి-యా వెనుక మ్రొగ్గిన గొయ్యి; యిదెట్లు తీర్పఁగాఁ
బొందిక కల్గునోయని యపూర్వ 'సమస్య' నాతఁ డెంచి యా
పందికి రక్ష సేయుటయె భావ్యపథంబని విశ్వసించి బో
యం దన త్రోవ చూచుకొనవయ్య యటంచును బంపె నింటికిన్

అది మొదలాతఁ డేదియొ మహాద్భుతశక్తి గడించి ప్రజ్ఞ పెం
పొదవఁగఁ బాండితీ ప్రతిభయున్ గవితా మహిమంబు చక్కఁగాఁ
గుదిరి యపూర్వధోరణి యకుంఠితమై వెలుఁగొంద సంతతా
భ్యుదయము జీవితంబునకు నున్నతిఁ గూర్ప మెలంగె నావలన్

పదువురు చేరి యాతని యపారకవిత్వ మహత్త్వ మబ్బురం
బొదవఁగఁ జూఱఁగొందు; రతఁ డోరిమి ప్రానియు లేశమేనియున్
చెదరక యాత్మనిగ్రహ విశిష్టత చూపుచు నాఁడు నాఁటికిన్
ముదమును బ్రోదిసేసి యశమున్ గడుఁ గూర్చెను జాతి కంతకున్

అతఁడు వచించుదాని నెవఁడైనను గాదనఁ; డేది వాని స
మ్మత మొ యదే ప్రపంచమును మన్నన సేయును; శాస్త్రవేత్తయై
హితమును గూర్చు వ్యక్తిగ మహిం గుఱుతించియు నెల్లవారు స
న్నుతి యొనరింపఁ జొచ్చిరి వినూత్న మునీశ్వరు నా కవీశ్వరున్

తల్లియుఁ దండ్రియున్ బరమ ధన్యులమంచుఁ దలంచి పెల్లుగా
నుల్లము పల్లవింపఁ దనయుం గని-గో బిలుఁ డన్నమాటలోఁ
బొల్లొకయింత లేక నిజముం గన నయ్యెనుగాన మా తపం
బెల్ల ఫలించెనంచు నుతియింతురు దైవముఁ గూర్చి నిచ్చలున్

ఇక్కడ ధర్మసూక్ష్మ మొకయింత వచింపఁగఁ బోలు—బోయ కా
యక్కఱ తీర్చునంశము రవంతయు శ్లాఘ్యము కాదు, దానిలోఁ
జిక్కులు పెక్కులున్నవి; విశేషముగా నిటఁ బ్రాణి రక్షకుం
దక్కిన ధర్మమే దయిన ధర్మము గాదనవచ్చు రూఢిగా



# గాథాసప్తశతి - ఆంధ్రానువాదాలు

శ్రీ టి. పి. యస్. రామచంద్రాచార్య

బౌద్ధమత ప్రభావం వల్ల కొన్నాళ్లు సుమారు రెండు వేలేండ్ల కిందటి వఱకూ అనగా శాతకర్ణి రాజుల కాలం వఱకు ప్రాకృతం కొంచెం పెత్తనం చెలాయించింది. పాలకులు ప్రాకృతా న్నాదరించారు. పాలితులలో కూడా దానిమీదే అభిమానం, గౌరవం బయల్దేరాయి. శాలివాహన శక కారకు డెవరని చారిత్రకు లింకా కొట్టుమిట్టాడుతున్నా చాలావఱకు సాహిత్య వేత్తల్లో హాల శ్రీశాతవాహనుడే శక కారకుడని ఒక విశ్వాసం. అతడు ప్రాకృతాభిమాని. ఆ కాలంలో ప్రాకృతం చాలా మృదువైనది. శృంగారభావాల్ని వెలువరించటాని కింకో భాష పనికిరాదు. ప్రాకృతం రానివాడు, ఆ కవిత చవి చూడని వాడు అరసికుడు. చక్రవర్తి హాల శ్రీ శాతవాహనుడు కూడా ప్రాకృతంలో కవిత చెప్పటం చేతైనవాడు. రసికుడు. సహృదయుడు, సుందరుడు. సింహళ రాజకుమారి లీలావతీదేవి ఇతడి కోసం 'అభిసారిక' గా మన దేశానికి వచ్చిందట! ఇతడు తర్వాత తర్వాత గీర్వాణం కూడా కొంత నేర్చుకొన్నాడు పట్టుపట్టి. మలయవతీదేవి దగ్గఱ. మలయవతి చక్కని సరసురాలు. గీర్వాణిలో మంచి విదుషి. ఆమె సాన్నిహిత్యంవల్ల, ఆస్థానకవి పండితుల సాహచర్యంవల్ల, క్రమంగా హాలశ్రీ శాతవాహనుడు గీర్వాణిని కూడా బాగానే అభ్యసించి ఉంటాడు. ప్రకృత "గాథాసప్తశతి"కి సంగ్రహకుడు చక్రవర్తి. అక్కడక్కడ కొన్ని చక్రవర్తిగాథలు కూడా ఇందులో ఉన్నాయి. 'చక్రవర్తి కీమాత్రం పాండిత్యం ఉందా? సంపాదకుడుగా కూడా అతణ్ణి పేర్కొనటానికి వీల్లేదంటున్నారు కొందరు. ఈ సందర్భంలో ఇతరులచే వ్రాయించి తమ పేర్లు పెట్టుకొన్న కొందఱు రాజుల్ని పేర్కొంటున్నారువారు. కాని ఇక్కడ అల్లా కాదు. హాలుని సారస్వతవ్యాసంగానికి సంబంధించిన గాథలు మనకు కొన్ని తెలుస్తూనే ఉన్నాయిగదా! దానికితోడు అతడు 'ఏకటాకీని' మొదటినుండి చివరివఱకూ వ్రాసిన కావ్యం కాదుగదా ఇది. అతడు కవిపోషకుడు. ఆస్థానానికి వచ్చిన కవులందఱూ ఒక్కొక్క 'గాథ' చెపుతూండేవారు. చక్రవర్తి వాటిని వెంటనే జాగ్రత్తచేయిస్తూ ఉండేవాడు. 'సప్తశతి'లో సుమారు మూడువందలమంది వివిధకవుల గాథ లున్నాయి. సప్తశతిలోనివే కాక మఱికొన్ని గాథలు అక్కడక్కడ అలంకార శాస్త్రగ్రంథాల్లోను, పెదకోమటి వేమభూపాలుడు కూర్చిన 'సప్తశతీసారం' లోను ఉన్నాయి. ఇందఱు కవు లొక్కసారిగ అతని ఆస్థానంలో ఉన్నారా? అతని ఆస్థానంలోకివచ్చిన ప్రతికవి అతని కొక గాథా సుమం సమర్పించి పోతూండేవాడు. అవి కొన్ని వేలుంటాయి. అందులో కవయిత్రులు కూడా ఉన్నారు. వాటిలో రసవద్గాథల్ని ఏర్చి కూర్చారు 'సప్తశతి' గా. నిస్సంశయంగా హాలశ్రీ శాతవాహనుడు దీనికి సంపాదకుడు. 'పాలితుడు' వ్రాయటానికీ దానికీ తోడ్పడి ఉంటాడేమో. 'సప్తశతి' లో అతని గాథలే హెచ్చు. ఈ పాలితుణ్ణి మనం 'సప్తశతికి' సహాయ సంగ్రహకుడుగా పేర్కొనవచ్చును.

'గాథ' అనేది ఒక రకమైన ప్రాకృతచ్ఛందో విశేషం. చాలా చక్కనిది. ప్రాకృతానికి జాతీయమైనది. "గాథల్ని, గేయాల్ని, ప్రౌఢ మహిళల్ని, తంత్రీ వాద్యాల్ని అనుభవించి, ఆనందించలేకపోతే అదే వారికి శిక్ష"ట. గాథలంటే వారికెంత ఆప్యాయమో చూడండి! దానికితోడు సంస్కృత ప్రాకృతాల్లో మొదటిదానికంటె రెండోదానికే మార్దవం, లాలిత్యం ఉన్నాయనీ, అదే కవిత కనువైనదనీ వారి భావన. ఆ దృష్టిలోనే ఆనాడు అన్ని వేల గాథలు వెలసినవి. అదిగాక అప్పుడే బౌద్ధమతం నశించి పోయినా, అది లేవదీసిన సంస్కృత వ్యతిరేకత ఇంకా నిలిచిపోయిందేమో! మహాకవులు కొందరు, బౌద్ధచ్ఛాయల్లో వారు కూడా ప్రాకృతాన్ని వదిలి సంస్కృతం చేపట్టినా జానపదుల్లోమాత్రం ప్రాకృతం

బాగాపాడుకుపోయింది. కనకనే అసలు గాథాసప్తశతిని నేటికి రమారమి రెండువేలేండ్లనాటి "ఆంధ్రజానపద సాహిత్యం" అనడం సముచితం. ఆనాటి జానపదుల రసికతను, 'నాగరికతను' సంస్కృతి సంప్రదాయాలను చక్కగా చిత్రిస్తుంది సప్తశతి. అది ఆనాటి తెలుగు మాగాణంలో విరబూసిన 'తెలుగుకావ్యం'. 'సప్తశతి'లోని తెలుగుపదాలు, వర్ణనలు ఆయా ఆచారాలు మొదలగు వాటినిబట్టి అది తెలుగువాటి కావ్యమే అనటానికి సందేహం లేదు. మతవైషమ్యాలు, రాజకీయ పరిస్థితులు, కారణాలుగా నన్నయతరువాతి మతేతరూ (తిక్కన వరకు) భారతాంధ్రీకరణానికి పూనుకొన్నట్లు 'అధికారభాష' ప్రాబల్యంవల్ల వారు 'దేశ్య భాష'లో వ్రాయలేక ప్రాకృతంలో వ్రాసుకొని ఉంటారు. తెలుగువారు ప్రాకృతంలో వ్రాసుకొన్న మొదటి "తెలుగుకావ్యం" "గాథాసప్తశతి" 'సప్తశతి'లో వర్ణింపబడిన ప్రాంతం ఆనాడు శాతకర్ణి రాజులు పాలించిన విశాలాంధ్ర సామ్రాజ్యం. 'సప్తశతి'లో లేని "గాథానాం, గేయానాం, ప్రౌఢ మహిలానాం, తంత్రీవాద్యానాం" అన్న గాథలోని ఆ 'గేయాలు' ఆనాటి తెలుగు జానపద గేయాలేమో! మొత్తానికి సప్తశతికీ మన తెలుగుకు, చాలాదగ్గరి అనుబంధం ఉంది. అందులో తరచు కనిపిస్తున్న 'గోదావరి' తెలుగు లది. ఆ శబరులూ, వ్యాధులూ మన తెలుగుగడ్డ 'శిబారు'ల లోని మన్నెదొరలు, కోయలు, సవరలే. నేటి నాగరిక ప్రపంచం ఇంకా కళ్ళు తెరవని కాలంలోనే 'సప్తశతి' చక్కని స్వాభావిక కవిత లోకాని కందించింది. ఇందులోని ప్రకృతి, ప్రాకృతిక వర్ణనలు నేటి 'ప్రకృతికవులు' తపస్సుచేసి సాధించదగ్గవి. 'సప్తశతి' ఖ్యాతివిదేశాలకుకూడా పోయింది.

సప్తశతి జానపదకుటుంబ జీవితాన్ని చక్కగా వర్ణించింది. వారి 'సమష్టి' జీవితం చాలా ముచ్చటగా ఉంటుంది మనకు. కల్లకపటము ఎరుగని ప్రణయతత్వ మెరిగిన అహింసామూర్తులు వాళ్ళు. నాటిజానపద సాంఘిక చరిత్ర చాలావరకు 'సప్తశతి' లో కానవస్తూ ఉంటుంది. వారి ప్రేమ చాలా 'అకలంకం'గా గోచరిస్తుంది. తన మగనికి పరవనితో సాంగత్యం కలిగించమని భగవంతుణ్ణి కోరుకుంటుంది సప్తశతిలోని 'పల్లెపడతి'. ఆమె 'ఔదార్యం, రాసిక్యం మెచ్చుకో దగ్గవి. అల్లా అని 'సప్తశతి' కాలపు 'చెడియ' లందఱు 'చెడిపె'లే అనుకోకండి. రమ్యమైన రూపున్నా, రమణుడు దూరలేక పోయినా, పేదరికంలో పెద్దవిధి నిల్లుండీ, మంచి వయసుకత్తె అయినా పొరుగామె చెడిపె అయినా చెడిపోని చెలువలుఉన్నారా కాలంలో. సంస్కృత కావ్యవాఙ్మయంలోకి వచ్చిన "అలౌకిక శృంగారం" లాంటిది కాకుండా స్వాభావిక జానపద శృంగారాన్ని చక్కజానపదరీతుల్లో వివరిస్తుంది సప్తశతి. మన విమర్శకులీనాడు పేర్కొంటున్న 'దేశీరీతి' భావాల్లో, భాషలోకూడా సప్తశతిలో కనిపిస్తుంది. గాథా లక్ష్యపీఠికపైనే గీర్వాణాలంకార శాస్త్రాలు వెలిశాయి. అలంకార శాస్త్రంలో 'సొగసుల్ని' కూర్చినది గాథలే అనటం అతిశయోక్తి కాదు.

సప్తశతి తరవాత దానికి అనుకరణాలు, అనువాదాలు చాలా వచ్చాయి. సంస్కృత భాషలోని "అమరుకం" ఒకటి సప్తశతికి వెంట మొదటి అనుకరణ. తర్వాత బయలుదేరింది ఆచార్య గోవర్ధనుని "ఆర్యా సప్తశతి". పేర్ల దగరనుండీ దీన్లో అనుకరణ కనిపిస్తూనే ఉంది. అవి గాథలు-ఇవి ఆర్యలు, అది సప్తశతి—ఇదీ సప్తశతే, అది ప్రాకృతం—ఇది సంస్కృతం, అవి పలువురి గాథలు—ఇవి ఒక్కని ఆర్యలు, అందునీ తొలివ్రిమ్ముక సొగసుపూలు—ఇందు కొన్ని గడ్డి గడ్డి పూలు. అక్కడ పలువురి 'రాసిక్యం' కేంద్రీకృతం. ఇక్కడ ఒక్కని రాసిక్యం వికేంద్రీకృతం. కాని లబ్ధప్రతిష్ఠగైర్వాణి తన వ్రాశయించిన ఆర్యలకు కూడా అమరుకంతో పాటు ప్రతిష్ఠనొసగింది. సప్తశతి, అమరుకశతి, ఆర్యా సప్తశతులాధారంగా వ్రజభాషలో విహారీలాల్ "విహారీ సప్తసఈ" అనే ముక్తక కావ్యం వ్రాశాడు. ఇక తెలుగులో సప్తశతి అనువాదాలు చూదాం:—

"నూనూగు మీసాల నూత్నయౌవనమున శాలివాహన సప్తశతి"ని తెనిగించానంటున్నాడు శ్రీనాథుడు. కాని దురదృష్టమో ఏమో అదెక్కడా మనకు లభ్యం కావటంలేదు. "వారణసేయు దావ గోనవా" మొదలైన కొన్ని పద్యాలు (శృంగపంచకం) శ్రీనాథుని సప్తశత్యనువాదాలుగా అనుమానితంగా వినవస్తున్నాయి. ఇంతకుతప్ప దీన్నిగూర్చిన వివరాలు మనకేం లభ్యం కాలేదు.

పెదకోమటి వేమభూపాలుడు ఒక వందగాథల్ని ఏర్చికూర్చి దానికి "భావదీపిక" అని ఒక చక్కని వ్యాఖ్య వ్రాశాడు. అతడిచ్చిన గాథలు కొన్ని నేటి సప్తశతి ప్రతుల్లో లేవు. ఇదొక సప్తశతీసారం. వేమభూపాలుడు (గాథా) సప్తశతీసారానికి వ్యాఖ్య వ్రాయటం ఆనాటినుండీ సప్తశతిపై తెనుగువారికున్న "మమకారా"నికి నిదర్శనం.

ఇక ఆధునికులలో, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు తమకు నచ్చిన గాథల్ని ఎన్నుకొని మొత్తం గాథలు ఆంధ్రీకరించారు. "సప్తశతీసారం" అని అది పేరుకెక్కింది.

కోమటి వేముని భావదీపికతో ఆ 'సప్తశతీసారాన్ని' శ్రీ దిగుమర్తి సీతారామస్వామి గారు తెలిగించారు. విశ్వవిద్యాలయం ప్రచురించిన పుస్తకం. దానికి వారొక విపులపీఠిక కూడా సంతరించారు. ఈ పుస్తకం ప్రచురించిన పద్ధతి బాగుంది. ముందొక విపులపీఠిక, తర్వాత గాథలు కోమటి వేముని వ్యాఖ్య—దానికింద వ్యాఖ్యకు తెనుగు. గాథలన్నీ [illegible] తెనుగు సేత.

స్వామి శివశంకరులు శతకానికి 14 చొప్పున 98 గాథల్ని స్వీకరించి ఆద్యంత శివస్తుతులతో మొత్తం వందగాథలకు తెనుగు చేశారట.

శ్రీమదాచార్య రఘునాథ చక్రవర్తిగారు అక్కడక్కడి కొన్ని గాథలు తెనిగించి 'గోల్కొండ' పత్రికలో ప్రచురించారు.

శ్రీ కే. వెం. రాఘవయ్యంగారు తమ 'అలంకార మంజరి'లో కొన్ని గాథలు తెనిగించుకొన్నారు.

శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యులు గారు, మా ఆచార్యులు శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిలు గారు తమ 'నవ్యాలోకం'లో కొన్ని గాథలు తెనిగించుకొన్నారు.

అన్నిటి తరవాత ప్రచారంలోకి వచ్చింది శ్రీ గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రిగారి అనువాదం. వీరు సప్తశతిని సంపూర్ణంగా అనువదించారు. ముందొక ఉపోద్ఘాతం కూడా వ్రాశారు. ఇప్పటికి వీరిదొక్కరిదే సంపూర్ణానువాదం.

శ్రీ అనంతకృష్ణ శర్మగారి పద్యాలు వాడుకలోకి వచ్చాక ఒకమోజులో సప్తశతి బాగా తెలుగులో సామాన్యులకుకూడా పరిచయమైనది. వాటిని చదువుకొంటూ కొందరు "ఏకలవ్యశిష్యులు" శర్మగారు వదలిన కొన్ని గాథలు తెనిగించుకొంటున్నారు.

శ్రీ తిరుమల రామచంద్రగారొకరు "సప్తశతిలోని తెలుగు పదాల"ను కూర్చి ఒక వ్యాసంలో సమీక్షించారు చాలాకాలం కిందట నే.

ఇక కొన్ని అనువాదాలూ, వాటిలోని ఔచిత్యానౌచిత్యాలూ చూచేముందు భాషాంతరీకరణను గూర్చి ఒకమాట. ఆంధ్ర మహాభారతం మొదలు నేటివరకూ తెలుగులో అనువాదాలు కోకొల్లలు. స్వేచ్ఛానువాదాలూ, అనుసరణానువాదాలూ, భావానువాదాలూ, ఛాయానువాదాలూ ఒకటేమిటి చాలా రకాలుగా ఉన్నాయి. భారతాదులు భాషాంతరీకరణాలే అయినా ఆంధ్రీకృతి కర్తల సంపూర్ణ స్వాతంత్ర్య ప్రతిపత్తి వాటిలో కన్పిస్తూనే ఉంటుంది.

గాథాసప్తశతి అనువాదకులలో చాలామంది అనువాద విషయంలో ఒకపొరపాటు చేశారనిపిస్తుంది. మొత్తం సంస్కృతాన్నీ తత్సంప్రదాయాలనీ, బహిష్కరించాలనటం లేదుగాని కొంతవరకైనా తెలుగుతనం నిలుపుకోవటం అవసరం. వృత్తాలు మనకి విజాతీయాలు. మన తెలుగుపద్యాలు—తేటగీతి—ఆటవెలదులు. ముఖ్యంగా మూలంలో వున్న ఛందోభేదాన్ని బట్టి దానికి తగిన తెలుగుఛందస్సు తీసుకోవాలి. స్వతంత్ర రచన చేసేటప్పుడు వృత్తాలెలా వాడుకున్నా అనువదించేటప్పుడు మాత్రం కొంచెం 'కట్టుబాట్లు' పెట్టుకోవాలి. ముఖ్యంగా "గాథలు" అనువదించేటప్పుడు వృత్తాలు వాడటం మంచిదికాదు. గాథల తెనిగింపులో గీతి వెలదులే చాలా అతికి ఉంటాయి. గాథభావాన్ని చెప్పేందుకు గీతివెలదులో కందమో సరిపోతూంటే పెద్దవృత్తాన్ని పట్టుకొచ్చి పడరాని పాట్లుపడటం ఎందుకో అర్థంకాదు. సంపూర్ణంగా గాథాసప్తశతి ననువదించిన శ్రీ గట్టివారుకూడా ఆ వృత్తాలపాంతికే పోయారు. శ్రీ దిగుమర్తివారు కూడా శ్రీనాథుని అడుగుజాడల్లో పోతున్నామని అక్కడక్కడ వృత్తాలనే (అవి శ్రీనాథుని ఆదర్శవిలసితాలు కాబోలు) కూర్చారు.

కొన్ని అనువాదాలు చూడండి:—

స్వాధీనేఽపి ప్రియతమే ప్రాప్తేపిసీతే
నమండిత ఆత్మా

దుర్గత ప్రోషితపతికాం ప్రతివేశినీం
సంస్థాపయస్వ

దీనికి శ్రీ అనంత కృష్ణశర్మగారి అనువాదం.

'పతిప్రవాసంబు తో నెనబాటునోర్వ-
కడలు పొరుగింటి చెలియ నూరార్చుచుండి
ప్రియుడు వచ్చెడియయ్యెఁ బండుగ వేళయయ్యె
దాను గై సేసికోని యాతురుణిఁగంటె!...'

దీనికి శ్రీ గట్టివారి తెనిగింపు:—

మగడు తనవాడె యయ్యెను "మంచియదను"
దొరకినను నేవఁదొడగకు తోడవులాసె
అతిదరిద్రుని ప్రోషిత పతిక యయిన
ఇంటిదాసియో యనఁ బ్రవర్తించుచుండు.

"ప్రాప్తేపి తనే" పండుగ వేళయయ్యె, అని శర్మగారి అనువాదం స్ఫుటంగా కనబడుతోంది. "అతి దరిద్రుని ప్రోషితపతికయయిన ఇంటిదాసి" ఇది ఏమిటో? రెండిటిలో శర్మగారి అనువాదమే సులభంగా కనిపిస్తోంది. ఇంకోటి—

అహం లజ్జావతీ తస్య చోన్మత్త కాని ప్రేమాణి
సఖీజనోపి నిపుణః హే సఖ్యః కిం పాద రాగేణ.

దీనికి శర్మగారి అనువాదం

చెలికత్తెలు కడుజాణలు
తలపులు తెలమున్కలగును వానికి, నేని
గులదాన, నింక నాపద
ముల లత్తుక పెన్నేల పూసెదుపోవే!

దీనికి గట్టివారు

మా చెలికాని ప్రేమములు మచ్చరమన్న
నెసెమ్మెలయ్యెనుం
దోచును హృద్యమచ్చరముతో పసమానలు
జాణలన్నిటికా
మా చెలికత్తెలెల్ల, రభిమానము సిగ్గును మెండు
నాకు నే-
లా చరణారుణాబ్జయుగళమ్మున కేలు లక్క
పూయగాన్.

దీన్నే దిగుమర్తివారు:

వాగ నుడించి పట్టుటకు పాటముగానిది వాని
చేష్ట లే
నో గడు ముద్దరాలః సఖులో నెఱజాణలు
—పక్క దుప్పటిన్
దాగులు గొన్న కాలి నెఱిలత్తుక పూతల నెట్టిపట్టుపెన్
దాగలుగావునన్ చరణ రాగ పరిష్క్రియ తేల నెచ్చెలుల్!

ఇప్పుడు మూలంతో మూడింటినీ పరిశీలించి చూడండి "ఇంక నాపదముల లత్తుక పెన్నేల పూసెదు పోవే" అన్నప్పుడు "అపగచ్ఛ కిం పాదరాగేణ" అన్న పాఠాంతరం గ్రహించి ఉంటారు. మూడిట్లో శ్రీ అనంతకృష్ణ శర్మగారి అనువాదం మూలానుసారిగా ముచ్చటగా ఉంది. ఇక్కడ గట్టివారు వృత్తాన్ని స్వీకరించినా బాగానే వ్రాసుకొచ్చారు. కాని వారి పద్యంలో "మా చెలికాని" "మా చెలికత్తెలు" అన్నప్పుడు "మా" కొంచెం విరసంగా కన్పిస్తోంది. ఇక దిగుమర్తివారి అనువాదం చూడండి:— "సఖీజనోపి నిపుణః" దీనికి వారి తెనిగింపు (భావ్యం) "సఖులలో నెఱజాణలు పక్కదుప్పటిన్ దాగులుగొన్న కాలి నెఱిలత్తుక పూతల నెత్తిపట్టు పెన్ దాగలు" ఇక్కడి సఖీజనుల 'నైపుణ్యా'న్ని ఇంతగా వాచ్యం చెయ్యటం 'రసికత' కాదేమో!

ఇంకోటి చూడండి!

తస్యద సౌభాగ్యగుణ మమహిలాసదృశం చ
సాహసం మమ
జానాతి గోదాపూరో వర్షాకాలార్ధరాత్రిశ్చ

దీనికి గట్టివారు:—

వాని సౌభాగ్య విధివముల్ మానవతుల
యూహాకందని నా మహోసాహసములు
వతుల గోదావరీ ప్రవాహమునకు జడి
వానతో వర్షరాత్రికి వాసి నెఱుక

దీన్నే శ్రీ శే. వెం. రాఘవయ్యంగారు తమ అలంకారమంజరిలో

వలపు చెలికాని తళుకంపు కలిమి సొంపు
ముగువలకు గానరాని యా తెగువ పెంపు
వాన కారువ నడిరేలలోన పొంగి
పారలు గోదావరీ నదీ పూర మెఱుగు!

ఇక్కడ శ్రీ దిగుమర్తివారు:—

తిమిరంపుం బహుమందపంపుఁదమి నద్దీపించు
నచ్చెల్వ చె
ల్వము తత్సంగమ భోగభాగమహిలా ప్రాప్యమ్ము
మత్ సాహసి
క్యము వర్షాభియదార్ధరాత్రి రొమరుగన్ గర్జద్ధి
వాటోప ఘుం

ఘుమ ఘుమంఘుమాయితాల మృదుజ రేణుంబున్
గొలిమి గంగయున్.

"తిష్యదసౌభాగ్యగుణం" ఎంత మనసులో పెట్టుకొని అందో ఆయిల్లాలు "అసౌభాగ్యం" ఇట్లాంటిది అని వాద్యం చెయ్యటం ప్రశంసనీయమా? "అమహిలా సదృశం ద సాహసం తుమ" ఆమె ఎంత గంభీరంగా బరువుగా అన్నదో చూడండి! దీనికోసం "తత్సంగతు భోగభాగ మహిలా ప్రాప్యమ్ము మత్ - సాహసిక్యము" అని ఇంత గాభిరా పెటటం! పరిసరి 'నిందుగొలిమి'ని ముతకు మాపటానికి ఎంత ఆరాటం జరిగిందో కనిపిస్తోందికదా! ఇక్కడ "అతని సౌభాగ్యగరిమకు" "అంగనలకు తగని అబిడతెగువకు—ఇద్దరు సాక్షులు. నిందుగొలిమి, వర్షార్త రాత్రి. అయ్యంగారు ఈ రెండు జంటల్ని కలిపేశారు. అది భావగాంభీర్యాన్ని చెడగొట్టటమే కాకుండా పరిమితంకూడా చేసేసింది. ఇక్కడ మాడింటో గట్టి వారిఅనువాదమే ప్రశస్తంగా ఉంది.

ఇదొకటి చూడండి:—

ఈర్ష్యావాన్ పతిరస్యాః రాత్రౌ
మధు కాని వదదాత్యప చేతుం
ఉపచినో త్యాత్మ నైవ మాతః
అతిబుజాస్వభావః

దీనికి గట్టివారు:

ఆ లతా తివ్వ చెలువుడీర్ష్యాలుడయ్యె
విచ్చిన మధూకసుమము లా వెలది నెపుడు
కోసి కొననీడు తనకు దా గోసి తెచ్చి
ఇచ్చు సరసస్వభావమ్ము హెచ్చిపోవ

దీన్ని దిగుమర్తి వారొకవృత్తంలో:—

తెక్కలికతెయుందు ముకుతిన్నగ
బోయెకుంటిమద్భరీ
డిక్కమలాక్షీభర్త—నికి లిప్పల
కోతకు నేని బోవనీ
కొక్కతె నింటనుంచి దమనొక్కడ—
పాపము నిల్వవచ్చునే
చక్కని తోడులేక భయశాలినికీ
చిగురాకు బోడికెన్.

ఆమె ఓంటరితనాన్ని గూర్చి స్వామిగారు అంత ఆవేదన వెలిబుచ్చటం ఏమంత బాగుంటుందంటారు? ఇక్కడకూడా శ్రీ గట్టివారి అనువాదమే మూలానికి సన్నిహితంగా ఉంది. "అతిబుజాస్వభావః" అన్నప్పుడు "సరసస్వభావం" అంటే అంతబాగుండేదు. దిగుమర్తి వారన్నట్లు "ముకుతిన్నగబోయెడు" బాగుండి. అట్లాంటివాడే యీ పక్క దెబ్బలు తినేది. 'అబుజా శబ్దమే' ఇసుంది—దిగుమర్తి వారు వ్యక్తీకరించిన భావాన్ని 'బుజా' శబ్దాన్ని అట్లా తెనిగించుకొని అనందించటంలోనే ఉంది సొగసు.

ఈ గాథ చూడండి:—

దంద్రదసదృశం ముఖం తస్యాః
సదృశో ఒమృతస్య ముఖరస స్తస్యాః
సకచగ్రహారభిసోజ్వల చుంబన
కం కస్య సదృశం తస్యాః.

దీనికి అనంతకృష్ణ శర్మగారు:—

దంగురుంకు మోవిసాటియూ నందలి
'మోవితీయు' మమృతమునకు సాటే
కురులు పట్టి తమిని కొసరి గైకొనిరేను
సకియ ముద్దుకేమి సాటిచెపుమ.

గట్టివారు:—

పోలతి నెమ్మోము చందురుఁబోలుఁ జెలువ
'ముఖరస' మమృతరసముతోఁ బోల్కగొనును
సరస సకచగ్రహారభిసోజ్వల కపోల
చుంబనము దేనితో సమానంబో చెపుమ

శ్రీ. వెం. రాఘవయ్యంగారు:—

దాన నెమ్మోము పున్నమ చంద్రుబోలు
కొమ్మ 'కెమ్మోవిరస' మమృతమ్ముబోలు
బాలసకచగ్రహారభిసోద్వేల చుంబ—
నంబునకు సాటిలేదు జగంబులోన

మొదటి పదం తెనిగించటంలో మువ్వురూ ఓ మోస్తరు సరిగ్గానే వచ్చారు. 'ముఖరస' శబ్దాన్ని ట్లాగే తెచ్చుకొ నేకంటే శర్మగారన్నట్లుఁ 'మోవి తీయ' మంటేనే బాగుంది. చివరి పదాన్ని తెనిగించింది అనంతకృష్ణ శర్మగారొక్కరే!.

ప్రోయతే పమాగమిష్యతి తవ ప్రియో ద్యప్రహార
మాత్రేణ
ఏవ మేవ కిమితి తిష్ఠసి తస్మాత్ సఖి సజ్జ కరణీయం
అత్తగారి రొదుటమున్న కోడలితో ఒక చెలికత్తె
అంటోంది ఈమాట.

అని దీనికి "భావదీపిక" లో అవతారిక. దీనికి దిగుమర్తి వారు:—

చేరగవచ్చుయూ మమున చెల్వరొనీవిభుడన్నయంతనే
నీరస ముద్రదాల్చి కరణీయము నొప్పరికింపఁజెల్లునే
స్వైరవిహార భోగమొక జామునపేల — పరైధి
తార్కసం
హారమునన్ తీణంబయినఁ జాలుశ్రమించి సుఖించు
సుందరీ!

దీనికి శ్రీ. వెం. రాఘవయ్యంగారి అనువాదం:—

ఇప్పు డొక జాములోన నోయంతి నీకు
ప్రియుడు దను దెంచుననుమాట వింటివో కొ
విల కేలవె యీరీతి గూరకొందు
కర్తరకరణీయములను వాయి తిపఅదు

అత్తిగారి ముందున్న కోడలు గదా. అదిస్త్రబద్ధమైన బందెలపాలు గావాలని దిగమర్తి వారి కోరికా! ఇక్కడ అయ్యంగారి అనువాదమే బాగుంది.

సంస్కృతంలో "జనః" అన్నమాట తరుచుగా ఉంటుంది. దీన్ని తెలుగులోకి తీసుకు రావటంలో మన అనువాదకులు అవలంబించిన పద్ధతి చూడండి:—

ఈర్ష్యామత్సర రహితాభ్యాం
నిర్వికారాభ్యాం మాతులాన్యక్షిభ్యాం
ఇదానీం 'జనో జనమితి' నిరీక్ష తే కథం
నక్షీయామహే.

దీనికి అనంతకృష్ణ శర్మగారు:

బొమలముడులు మత్సరము నీసు లేకయే
రొండినట్టులుండు రెంకుకనుల
'అదిడు నన్ను జూచు నందటివలె'నింక
చిక్కపోక రేమిచేతు మత్తి!

గట్టివారు:

సెలపకీసు మత్సరమేని నిర్వికార
మైన కన్నులతో మాతులాని "కూర్చు
జనము నన్ను సాధారణజనమునట్లు"
చూచుచున్నది చిక్కకే సారిదినుందు.

శ్రీ ఆచార్య రఘునాథ దీక్షవర్తిగారు:

ఈసు మత్సరమును కొంచెమేని లేని
ఏ వికారముగనరాని యీ ఈణముల
జనమునటులు గనుచుండు జనుడునన్ను
చిక్కపోకెట్టులుందుమో చెప్పవత్తి!

వ్యవహారంలో "ప్రజాసమూహం" అన్న అర్థంలో ఉంది 'జన' శబ్దం. అంతేకాని ఇక్కడి జన శబ్దాన్ని ఇతర తత్సమ శబ్దాల్లాగ విధిగా ప్రత్యయాలు చేర్చుకొని తెలుగు చేసుకోవడానికి వీలు లేదు. 'డుమువులు' చేర్చగానే ప్రతిదీ తెలుగవదు. "అతను నన్ను జూచు వందటివలె" ఇది సరైన తెలుగు. ఇట్లాంటి పొరపాట్లు గట్టివారు చాలాచోట్ల చేశారు. "జముని బెట్టినోములు నోచి జనముకపయు" "మకుక ప్రత్యేకజనుని పై మనసు దనిలి" "అప్రియజనుండు కపియుపంగి చేదుదా పీనజనుడయ్యెనే"—ఇంకోరకం తెలిగింపు చూడండి "గ్రామమెల్లదేవి కృతిసీమమయ్యె" (గట్టివారు). దీనికి శర్మగారి తెనిగింపు చూడండి:—"అ పల్లెవారు వేలుపులైపోయిరి దాని తెప్పలార్పక కను చుక్క" "దేవీకృతసీమ"లాంటి తెనిగింపులు తెనుగు కింపుగా ఉండవు. కనీసం యీ కాలంలోనైనా ఇట్లాంటి తెనిగింపులు మానుకోవాలి.

ఇటు గట్టివారుకాని అటు దిగుమర్తివారుకాని వృత్తాన్ని గ్రహించినప్పటికీ మాత్రం గాథల్లోని భావ గాంభీర్యం చాలావరకూ చెడింది. దిగుమర్తివారి వృత్తాలు మరీ 'అలంకారికత'ని చెడగొట్టకొన్నాయి. ఇంకొక్క గాథ చూడండి:—

అకృతజ్ఞ ఘనవర్ణం ఘనపర్ణాంతరిత తరణికరనికరం
యాది రే రే వానరం రేవానరమపి నస్మరసి.

దీనికి శ్రీమదాచార్య రఘునాథ దీక్షవర్తిగారు:

అనవహితక! ఘనవర్ణము
ఘనపర్ణాంతరిత తరణికర నికరమ్మున్
కన బరెరే వానర
మ్మును రేవానర మేని బోలు నెమకుమున్.

గట్టివారు:—

ఓ కృతఘ్నుడా! దట్టపుటాకు జొంప
ముల రవికిరమ్ము లొగిడాగ మెయిలువోలె
నలని వానర కుంజము దలపకున్న
నేమి నర్మదా జలముల నెపెద గొనవో.

ఈ అనువాదాలు చూడండి:— ఇక్కడ గాథలో 'యమకం' ప్రధానం. గట్టివారికది పట్టుబడలేదు. శ్రీ ఆచార్యులవారి అనువాదంలో 'యమకం' సిద్ధించింది. కాని అనువాదం మళ్ళీ 'తెనుగు సేత' కావాలంటోంది. ఇట్లాంటిచోట్ల అన్నీ రావనుకోండి మరి.

ఇట్లా వ్రాసుకపోతూంటే ఎన్నైనా ఉదాహరణలు దొరుకుతాయి. గాథ లనువదించిన అందరిలో శ్రీ శర్మగా రవలంబించిన అనువాద పద్ధతి బాగుంది. వారు గీతి - వెలది - కందం ఈ మూడు జాతుల్నే వాడారు. మూలాన్ని దగ్గిరపెట్టి చూస్తే సన్నిహితంగా ఉండేది కూడా శర్మగారి అనువాదమే. వారుకూడా అక్కడక్కడ దాటుకుపోక పోలేదు. గాథని యథామాత్రికంగా అనువదించటానికి నిండా ఒక ఆటవెలది కూడా అక్కర్లేదు. ఇట్లాంటిచోట్ల ఆ కాలిల్ని కొన్ని చక్కటి - తెలుగు పలుకుబడులతో నింపుకొన్నారు వీరు. ఆ సొంపు చూడండి! "చెప్పగదవమ్మ" "ఓయమ్మ" "రాత్రితల్లి" 'వినవమ్మ' ఇట్లా ఎంతో నిండుగా మనహారావిల్చినట్లు వినిపిస్తాయివి. ఇది ఇంకెవరికీ పట్టుబడలేదు. "మాతులీ - మాతులానీ" శబ్దాల్ని అట్లాగే తెచ్చుకోవటం ఏమంత బాగుంటుంది? శర్మగారి అనువాదాల్లో యీ సంస్కృతి సంబోధనలే విన్పించదు.

చివరికొకమాట: గాథా సప్తశతిని తెలుగు జాతుల్లో అనువదించి ఒకవుటలో ప్రాకృతమూలం దానిఛాయ, రెండవపుటలో దానికెదురుగా 'తెనిగింపు' ఇస్తే బాగుంటుంది. 'సాహిత్య అకాదమీ' వంటిసంస్థ ఇందుకు పూనుకోవటం అవసరం.

# పసుల కాపరి

"శంఢిల"

౧

"సూరీ! కమత మంటావురా?"

"చిత్తం."

"జాగ్రత్తగా దిరగాలి."

"చిత్తం"

"ఏం పతెయ్యా! కొడుకుని పిల్లడానికి నీ కిష్ట మేనా?"

చిత్తం. బాబయ్య-ఖామందులు తిప్పకుంటా మంటే కాదంటానాండి"

"అఁ-అలా గే-మనకైనా పవంత హెచ్చుంపను లే. దుక్కిటెద్దులతో రాముణ్ణి, భీముణ్ణి మేపనం. పాడి గొడ్లు గేదెనీ, అవునీ మళ్లించుకురావడం. పొలేకప మ్రొచ్చి నీళ్ళు చల్లి పేడ చెయ్యడంలాంటి చిల్లరమల్లర పన్లు."

"చిత్తం"

"మరి జీతం మాట?"

"తమరే సెలవియ్యండి బాబూ-మా పాదాలకాడ పనుంచేసుకోవ్వం-మీమాటంటే మాటే"

"నాలుగుగొడ్లు-అంటే బసవులు, జొన్నలు, తెల్లవడ్లు కూడా కొలుస్తాం. అర్ధ రేపే లేదనుకో"

"కొటాలా-ఏమిమలాండి?"

"మూతికట్టులరా - ఈ రోజుల్లో కొటా లెవరిస్తున్నారు!"

"చిత్తం కట్ట, కర్మ"

"కట్ట ఇస్తాను. పొలే కర్మంలో ఆగాడ దీసుకోవచ్చు, పరిగకూడా మీరే ఏరుకుంటారు"

"చిత్తం-చాలండి మారాజా"

"ఇవాళ పండుగగదా- రేపటినుంచి మళ్లిందు"

"చిత్తం."

"వింటున్నావా సూరీ-పాలికాపుదనం అంటే పగడ్బందీగా వుండాలి."

"చిత్తం" తండ్రీకొడుకులు వీధిలోకి ఖామందు కామరాజు వసారలోకి వెళ్ళడం స్పష్టంగా చూసి మసిమసిగా తప్పుకొంది ఆ తొలిసంజ సంధ్య.

"ఒసే..దూకావా-"

"అఁ- వింటూన్నా అతండ్రీ కొడుకుల సరసాలాగా నేవుంది "చిత్తం — పొంగలీ" అంటూ విలతుణంగా వ్యాఖ్యానించింది మాటకుముందు పావెత రానికి నోటిచ్చిన శ్రీమతి కాంతమ్మ.

"అంటే- నీ చెప్పేదూ అంటే- ఆలోచించావో లేదో రేపటినుంచి నీ బెడద వదులుతుంది. కుర్రాడు చింతపిక్కలాగ గిడసగా వున్నాడు. పైపనంతా పరుగున చేసుకుపోతాడు. వాకిలి వూడుస్తాడు; కళ్లాపు చల్లుతాడు; పేడచేస్తాడు; అంట్లూ చెంబులూ తోముతాడు; పాలు దియ్యగలడు; కావిడితో మంచినీళ్ళు దెస్తాడు; ఇంకా పైపను లంటావా నీవు చెప్పి మప్పితంగా చేయించుకోవడంలో వుంది" ఇంకా యేకరువు పెడుతూనే వున్నాడు కామరాజు-

"మరి వేవీ లేకుండా ప్రొద్దుటినుంచి జలూ బోసి వుట కొక్కులా చాకిరీ చేస్తున్న మనుష్యన్నారా- సరదాగా" వెటకారమాడింది ఇల్లాలు.

నాటిరాత్రి పడుకు నేముందు ఏదో ముఖ్యమైనపని మరచిపోయినట్లు కామరాజు మంచంమీద నుంచి లేచి, ఆరిపోబోతున్న పెద్ద హరికేన్‌లాంతరు వత్తి ఎగద్రిప్పి, వీధిగదిలోకి తీసుకెళ్ళి, మెల్లగా దానును పెలవేసిన బెండిగుత్తిలోని తాళపుచెవితో దినుసు పెట్టె తెలుపుదీసి, డైరీ నోటుబుక్కులో ఇలాగ స్పష్టంగా వ్రాశాడు-

"హేమలంబ నామ సం|| రం చైత్ర శు ౧ ని నాడు పైలకాడ వుంచడానికి వెలమలకుర్రాడు వెంకటపతెయ్య కొడుకు సూరయ్యను యేనిమిదిబస్తాలు, మూడుధాన్యాలు కలిపి కొలవడానికి- కట్టకమ్మ- కల్లం పరిగ వాడికే- కుదుర్చుకోవడ మైనది."

లోవున్న పసులకాపరిపై ఉరిమి విరుచుకపడ్డాడు. "సూరీ—నువ్వేనా రాముణ్ణలా చితకగొడతా. ఇదిగో—ఇప్పుడు నిన్ను మెడబట్టి చింతబరికతో బాదితేనో" అంటూంటే పుంతలోంచి అటువెళుతున్న సత్తెయ్య అందుకున్నాడు "కాపాడాలి—ఖామందులమాటకడ్డొచ్చాను—అదితప్పేమీ లేదండి. పెద్దకాపుగారు సాక్షి. మలుపుతున్నాడండి బండెద్దుని. ముక్కుదాడుకులొంగింది గాదు. ఆవైపులో కొంచెం తగిలించాలండి. ఎద్దును పాకీ చెయ్యడం మాటలా బాబూ. వాలుకు కాళ్ళూయెత్తి సవారీచేయించాలి. ఆఁ అంటే ఆగిపోయేట్టు చెయ్యాలి."

పైపొలంలో జనుములుదూకి జల్లి మళ్ళల్లోంచి నీళ్ళు లెగొడుతున్న పెద్దకాపు వెంకన్న పత్తిగాడికి, సూరిగాడికి మదుపు చేశాడు. లేకపోతే సూరిగాడిపని యేమైఉండిపోయేదో—

"అక్కర్లేదు బాబయ్యా. ఇయాళనుంచి రాముడు గాని, భీముడు గాని బండికోలలో గాని ముక్కులో గాని పేచీపెడితే నన్నడగండి." తమాయించుకుని సద్దుకున్నాడు సూరిగాడు.

మగడు మగిడివచ్చే వైఖరిలో జె పసికట్టింది కొంతమ్మ వొత్తినే తిరిగొచ్చాసెని. ఆమె మరేమీ అనలేదు. సూరీకూడా ఆ వేళటకి ఖామందులతో అట్టే నోరు కలుపుకోలేదు. ఏ ఏ వేళల్లో యాజమానులతో యెలా మసులుకోవాలో ఈ పరికి వాడికి మచ్చికయ్యింది. తన పనితనంలో నిసువారికి కనబడే పెంకితనం కోసం ఎదురు తెన్నులు చూస్తున్నాడు.

కోతలు, నుప్పనూర్పుకులు అయిపోయాయి. చెరువు కింద పంపుల్లో జనపచేలు పూతెక్కి కాతలు పెరుగుతున్న రోజులు. కొంతమ్మ పష్టివాగు రాత్రి పేటతిరణాలకి ప్రయాణం కట్టించాడు కామరాజు. పెందరాళే పెరుగూ అన్నందినేసి సవారీ బండీలో బాగా జనుము, పరకలు పరుపులా సర్దించి సూరిగాణ్ణి త్వర పెట్టాడు. వాడు పని ముగించుకుని ఇంటికెళ్ళోయి కూడు దినొచ్చేపరికి తొమ్మిదయ్యింది. అప్పటికే అమ్మగారు అయ్యగారు విసుక్కుంటూ కారాలుమిరియాలు నూరుతున్నారు సూరిగాడిపై. "పర్వాలేదు బాబయ్యా పేటెంతసేపండీ" అంటాడు వాడు—

"లేదంటే అయిదు మైళ్లుందా. రేవటిదారి పుంత గోతులు-పాడుబడా బళ్ళీదడ్డీ" ఇంకా యేమేమో పణుకుతాడు కామరాజు.

"ఉండనియ్యండీ-బండికట్టిన గంటలో తీర్థం కాడ వాలమూ" ధీమాతో వస్తుంది వాడి సమాధానం. సవారీబండిలో ఇద్దరే-ఇస్తోకు- కామరాజు, కొంతమ్మ కూర్చున్నారు. "పోనియ్యాలి" హుషారిచ్చాడు సూరిగాడికి.

ఊరికి పడమరగా చెరువుగట్టు దాటి గొలుసు విడల్ని దండుపుంతలో బడింది కామరాజు గారి బండి. దారికడ్డంగా అన్నీ బళ్ళే. పెరాటబళ్లు. గూడుబళ్లు. వాటుబళ్లు. సవారీబళ్లు. ఒకదానికొకటి పోటీపడి లగెత్తుతున్నాయి. ఈ పెడా ఆ పెడా రోవన జట్లుజట్లుగా కబుర్లు చెప్పుకుంటూ కర్రవేసుకు తండాలుగా సాగిపోతున్నారు జనం. సూరిగాడు అదనుకై పొంచి అది లిస్తున్నాడు రాముణ్ణీ, భీముణ్ణీ. అవి బాగా లొంగి వాడిచేతి పాకీపయ్యాయి.

ఇంతలో ఏ దూలనుంచి వచ్చిందో పెద్దకాపు గారి మువ్వలు తాపిన కొమ్ములున్న వర్లె సవారీబండి లగత్తిన గిత్తలతో దాటేసింది వాళ్ళబండిని. సూరిగాడికి రిమ్మెత్తింది. 'అమ్మగారూ! కొంచెం జాగరండో' అని రాముకు తోకమెలేసి, 'హా' అని భీముడిపై ఒకటి చరిచాడు. మరి వాటికేమి జ్ఞాపకమో. అంటులో రాముడికి గుర్తొచ్చివుండాలి సూరిగాని తర్ఫీదు. వొళ్ళంతా అరచేతి మందాన తిట్లు తినవాడు దిగిలిన కొరడా చివరి ముడుకులు ఛెళ్ళున దాని వెన్నున మెదిలాయి. అంతే— మతిపోయింది వాటికి.

సరిగా కోటేటివద్ద పుంతమలుపు కొచ్చేసరికి— అంటే పేటకింక పసందూరం—కామరాజుగారిబండికి అన్నీ లోకైపోయాయి.

"దూళ్ళావా ముడ్డికి పేడయ్యిందల్లా బండెద్దేనా అన్నారిందుకే. లేదంటే నూరు బళ్లని తప్పుకొచ్చాం" అని ధర్తి అంటుంటే—

"ఎంత లేదన్నా మదుపు చెయ్యడంలో గూడా వుంటుంది" అని నవిగిన కొంతమ్మ గొంతు విని హృదయాన్ని హాయిగా స్థాయిపర్చుకున్నాడు సూరీడు.

"జాగ్రత్తరోయ్. ముందు తీగలగొయ్యి" అని హెచ్చరించాడు కామరాజు. వెనక వాలుగు కాళ్ళ సవారీతో మీదబడుతున్న పెదకాపుగారి వరెల్లబండి ఉరకడంపై ధ్యాస నిల్పిన సూరిగాడికిది వినపడింది. కాదు. రోషంతో వర్రల్ని బాదేస్తున్నాడు పెద్దకాపు గారి పాలేరు. సూరిగాడు భీముణ్ణి సైక చేశాడు. మరి

వాడికేం పాళం ఎలాగ వూడాడో—ఆదాపటిది సంది వ్వలేదు వరెద్దుకు. ఇక అటు లాభం లేదని రాముడి వైపు పట్టించాడు ఆ బండివాడు తప్పిద్దామని. దాని పౌరుషం అసలే వల్లత్రాచు లాంటిది—యేడమియ్య లేదు.

బండిమీద బండిపోవ్వన దండయాత్రి బయలు దేరింది కామరాజు గారి బండిమీదికి. రాముడు, భీముడు నాలుగాళ్ళ సవారీమీద వున్నాయి. ఉంకొండి బండి దొంగుతుంటే లోపలి దంపతులు ఉత్సాహం ఆప లేక ఒళ్ళుమరచి నవ్వుకుంటున్నారు.

ప్రమాదం అనేది సంభవించే క్షణంవరకు కేవలం ఒకమాట. మరు నిమిషంలో కామరాజు గారి బండి గోతిలో వుంది. లేదు ఆ గొయ్యేదారికి మధ్యలో వుంది. ధడీక్ మని కామరాజుగారు తొట్టిమీదినుంచి ఉండ్రం ముక్కలాగు క్రిందబడ్డాడు. ఎడ్లు కాళ్లి త్రొక్కడి. రాముడు రెండుకాళ్ళు ముందుంచాడు లెకెత్తుతూ. మారిగాడు త్రుటిలో ఆపదను త్రించాడు. బండిలోంచి "మారీ" అన్న కాంతమ్మ గావుకేక విన్నాడు. అంతే. ఆః అని తల్లత్రాళ్ళు బిగలాగేడు. పైప్రాణాలు పైకెగసిపోగా పడివున్నాడు కామరాజు రాముడి నాలుగు కాళ్ళమధ్య. అంతే గమనం ఏమయిపోయిందో-బండెద్దు జ్ఞానమున్న మనిషికన్నా భద్రంగా ఏమీ కదలకుండా నిలబడిపోయింది. "ఫర్వాలే దమ్మగారూ—కామందులు నెమ్మదిగా లెగండి" అన్నాడు పోలుగ్ర మొగను నిలబడ్డ పసుల కాపరి పోల్లి తులుపుకుని లేచి మళ్లీ యథాప్రకారం బండిలో ఎక్కి కూర్చుని "నీ యిల్లు వెయ్యిళ్లు కుందలై-బతికించావురా మారీ" అన్నాడు కామరాజు. అవు చెయడం, అందులోనూ ఆ బాటన బండిని అడ్డంగా వుంచడంలోను చేర్పు ఆ పైలవానికే చెందుక. తన యజమాని కిసుమంతైనా ఆపదగలుగలేదు. ఒక బండీ కూడా తనను దాటలేకపోయింది. కారుగట్టే బళ్లన్నీ నిలబడిపోయాయి-తీర్థానికి అందరికంటె ముందు చేరుకున్నారు ఆలస్యంగా బయలుదేరిన రామరాజు దంపతులు సురక్షితంగా. ఇంటికికూడా అలాగే వచ్చారు. మర్నాడు నాలుగు గుంచాల కొత్తవడ్లు బరాతు యిచ్చారు మారిగాడికి. "మా బాగా తేయారు చేశావురా గిత్తల్ని. మరి రెండో బండికి పోటీవ్వవు గదా" అని విసుపోతుంటాడు పెద్దకాపు. తీర్థానికెళ్లి వచ్చిన మరునాడినుండి కాంతమ్మకు, కామరాజుకు మారీకుపై తొల్లిటి అభిప్రాయాలు మారిపోయాయి- ఏమి వండుకున్నా వాడికింత పెట్టకుండా తినేవారు కారు. వాడూ దాన్ని మహా ప్రసాదంగా అందు కునేవాడు.

*

"ఒరే మారీ! "శివరాత్రికి తీసిపిండి"లంటారు. మరి మనగరువులో మావుళ్లేవీ కొయలేదురా?" చిక్కుడాకుల్లో పరమాన్నం ప్రసాదం పాలేరుకు పెడుతూ అడిగింది కాంతమ్మ.

"అమ్మగారూ! మావుళ్లి మాబాగా పూశాయి గానండి తేమమంచుబట్టి చాలాకొడికి రాలిపోయిం దండి. ఇవాళ సాయంత్రం వచ్చేటప్పుడేఁ వన్నా వుంటే మంగాం గట్టుకొస్తాలెండి" అన్నాడు మారీకు.

"పట్రా —'అమ్మగారికిస్తే ధర్మంలోకిస్తావి' వుంతంట బోయేవాళ్లంతా పుణుక్కుపోతూనే వుంటారులే- మనకి పచ్చడిబద్ద లేకుండాముంటే బంగారం కన్నా అపురూపమైపోతాయి" సాగదీసింది కాంతమ్మ.

మారిగాడు రాముణ్ణీ, భీముణ్ణి విప్పుకుని తోట గనువు వైపు సాగిపోయాడు. కామరాజు వీధి అరుగు మీద వెంకన్న కాపుతోను, మరొకరిద్దరితోను శివ రాత్రికి భీమవరం, ద్రాక్షారం, కోటిపల్లి తీర్థాల ముచ్చట్లు పిచ్చాపాటీ చెబుతున్నాడు. కాంతమ్మ యింట్లో పనిచూసుకుంటోంది.

పదకొండు గంటలయ్యింది. వీధి అరుగు చివర కూర్చున్న వెంకన్న ఉన్నట్టుండి దక్షిణంవైపు చూసి "అదేటి - కామరాజుగారూ చూడండి మీ రాముడదేంటి లగెత్తుకొచ్చేస్తున్నట్టుంది" అంటూనే వున్నాడు రాముడు ఒక్కబిగిని ఉరకలెత్తుకుంటూ ఊడిపడింది. దాని తల్లత్రాడు తెగివుంది. అరుగు మీద అందరూ దాని ఆగావుకి ఆశ్చర్యపడ్డారు. కామరాజునుచూసి ఆ చేటిరిచిన రాముణ్ణి పరకాయించి వెంకన్నన్నాడూ "ఏఁవండో - ఏదో విశేషముంది. లెగండి-ఏకారణం లేనిదే ఎద్దిలాగ త్రెంపుకురాదు"- కామరాజు వెంకన్న చేతికర్ర లుచ్చుకు బయలు దేరాలో లేదో తోటవైపు రాముడు మళ్ళీ రెండే రెండు అంగలువేసి పరుగుతీసింది "వేగరండి" అంటూ వెంకన్న కామరాజును త్వర పెట్టాడు.

రాముడు దారితీస్తుంటే వెనకవాళ్లిద్దరు నడుస్తున్నారు. తిన్నగా రేవటి వంపుకువెళ్లింది గిత్త. ముమ్మాళ్ల డొంకలోవున్న విరగబూసిన పొదుగచెట్టువార రెల్లుదుబ్బుల మధ్యనున్న పెద్దపుట్టదగర ఆగిపోయింది. పుటకల్లంత దూరాన పడివున్నాడు సూరీడు. వాడి చేతికి బొగాడు రొండంలో కర్ర, కర్ర కొసన సన్నని నెత్తురు జీరయెఱ్ఱగా అనింది. "అన్నా—సుబ్రోణ్ణి పురుగు ముట్టుకుందండి—నురగలు గక్కుతున్నాడు" అని వెంకన్న "మీరిక్కడుండండి కామరాజుగారూ" అని చెప్పి రాముణ్ణి వెంటబెట్టుకుని మరి అయిదు నిమిషాలకు సవారీ బండితో సిద్ధమయ్యారు. ఈ లోపున పరిసరాన్ని పరకాయించి పుట్టమీద విసుకబడ్డ కుబుసం పరీక్షించి కట్టింది త్రాచే అని స్థిరీకరించుకున్నాడు కామరాజు—సూరీడుకు స్పృహలేదు—గిలగిల తన్నుకోడంకూడా లేదు. నోరికి నోటంట నురగలుమాత్రం వస్తున్నాయి.

వెంకన్న కాపు ధైర్యమైన వాడు. నొత్తుగా పరకలు పరిచిన బండిలో గడ్డి జాగ్రత్తగాసర్ది రెండు చేతులతోను సూరిగాణ్ణి లేవనెత్తి పడుకోబెట్టారు. 'సరిగా కూర్చోండి' కామరాజును హెచ్చరించి గిత్తలని అదిలించాడు. మరి వాటి అగుర్దా అలాంటిదో లేక వాటికిక్కబడ్డ తిర్బీగు అటువంటిదో—అఘూలమేఘూల మీద సవారీబండిని ఇంద్రరథంలాగ యెత్తుకుని అరగంటైనా గాకుండా రావులపల్లి చేర్చాయి—వెంకన్న విస్తుపోయాడు వాటి ఉడాయింపు చూసి.

సూర్యుడు సరిగా నడునెత్తిన ఉన్నాడు. రావులపల్లె పాము మంత్రగాడిని కురించి వాకబుచేస్తే పొలం వెళ్లాడు చీకటితోటే అని తేలింది. "నేవేస్తా బాబూ" అని వాడిపెళ్ళాం చెప్పింది. పాము మంత్రానికి ఆ నడుమ వాళ్లకి పెట్టింది పేరు. శ్రద్ధగా మంత్రం పఠించింది. ఒంటిగంటవ్వరికి కదిలాడు సూరిగాడు. చుట్టు చూస్తున్న జనంతో బాటు వెంకన్న కాపుకీ, కామరాజుకీ కళ్లు మెదిలాయి ఆనందంతో.

"ఇంక దీసుకెళ్లండి బాబూ—భర్వాలేదు. రాత్రికిమటుకు కునుకు రాకుండా చూడండి. త్రాచు బామే" అంది మంత్రగాడిపెళ్లాం. సూరిగాణ్ణి బండిపై పడుకోబెట్టుకుని యింటికి చేరుకునేసరికి రెండుగంటలయ్యింది. మరి వాటికి గుర్తేమిటో రాముడు, భీముడు మళ్లీ యింటికి వస్తుంటే "వెంకన్నన్నాడు" చూశారా' గిత్తలెంత సంబరం పడుతున్నాయో—వాటికెంత జ్ఞానమో"—.

మరునాడు సూరిగాడు చెప్పాడు జరిగినదంతా "రేవటి వంపులో మొన్నవగా కోసిన జనుం పనమీ గుండిగాదుండీ—కట్టుగకడుతున్నాను—పొదుగుల వార చెలకలో పరకలు గీరుతున్నాయి బండెడ్లు.

మరి రాముడుగాని ఆదమరిచి దాన్ని ముట్టిందో యేమో—బారవిసుస్తు విసుస్తు వుంది నల్లత్రాచు. బుసకొట్టి పడగెత్తి వెంటబడింది. రాముడు నావైపు లగెత్తుకొచ్చింది. నేను చూశాను—కర్ర కిందలేదు పాము. ఒక్కటే విసురు విసిరాను—అదే నే చేసిన పొరబాటు—కర్రేగనక చేతివుంటే తలపచ్చడిచేసేసేవాణ్ణి. గిరవాటేసిన కర్ర గురి తప్పలేదు సుమండి. సరిగా బరిమీదున్న త్రాచు పడగమీద తగిలింది. తల చిట్లివుంటుంది. కాని నే అనుకున్నంత పని జరగలేదు. చూసుకోండి దాని రోషం. చెయ్యెత్తున లేచింది. రెండు క్షణాలలో నామీదికొచ్చేసింది. ఇంక లాభం లేదనుకున్నా. అప్పుడే అయిపోయింది నాపాటు—అయినా మొండి ధైర్యంతో ఇటు తిరిగిచ్చి తిరిగి తోకబట్టుకుని పైకెత్తాను పామును. కాని నా రోజులు బాగులేవు—జ్రుగున జారిపోయింది నిలువెత్తు పాము పొరతో. అంతే—నురుక్షణంలో కాటేసింది పాదం మీద. తర్వాత మరి నే నీ లోకంలో లేను. "బాబా! ఇంకా ఈ లోకంలో మాకలుంసబట్టి బతికాను." పాముల మంత్రగాడికి పారితోషికంగా చీర, జాంవారు బెట్టాడు కామరాజు పదికుంచాల వడ్లు గొలిచి.

ఇది జరిగిన వారం రోజులకు పట్టుబట్టి పొలం నుంచి పాములాణ్ణి తీసుకొచ్చి పట్టించాడు నల్లత్రాచును పొదుగులపుట్టలో వుండేదాన్ని. కొందరు చంపెయ్యాలి దాన్ని విమప్పరుగన్నారు. పుట్టలో ఎంతో త్రవ్వితే గాని బయట పడనే లేదు అది. ముందు రెండు మండ్రగబ్బ లొచ్చాయి. తర్వాత జెర్రిగొడ్డు బయటపడింది. పాములాడు దానిచర్మం వొలిచి అమ్మకొనికని పట్టుకుపోయాడు—బాగాలోతుకు త్రవ్వగా బుసలు కొడుతూ బరిమీదికి పడగెత్తుకు వచ్చేసింది నల్లత్రాచు. [ఇంకా సూరిగాడి చేతికర్ర గాయంవల్లన పడ్డ వుండు మాన్నే లేదు—నాగస్వరం పాడి బుట్టలోకి

మళ్ళీందుకున్నాడు పాములాడు—"గరళం పిండేసి ఆడించుకుంటా బాబయ్యా—బాగా మురిపాం" అన్నాడు వాడు—అడ్డెడు బియ్యము, పాతపంచె, కుడితినీ వాడికిచ్చి సాగనంపి "ఎలాగైతే పగదీర్చుకున్నావురా పాముకు కోరలూడదీయించి" అన్నారు కామరాజు, వెంకన్న కాపూ సూరీడుతో.

౬

"ఆయుర్దాయ మిచ్చినవాడు ఆదమరవాలం"టారందుకే చూడండి! సూరిగాణ్ణి. లేదంటే ఒక్కొక్కొమ్మను కాటాబస్తా వుంటాదూ—ఈ పాటికి ఎల్లకిల్లా పండిస్తూ వుండవలసింది యమునింట పాతకొంపై" అని అరుగుమీద పరధ్యానంలో వున్న తన పెనిమిటి కామరాజుకు వాలుకు బాటలవుంత తూర్పైపు కావడితో మోసుకెడుతున్న పసులకాపరి సూరిగాణ్ణి చూపించింది కాంతమ్మ.

"ఉండరా" అని లేచి "ఒరే—సూరీ ఇలారా." అని పిలిచాడు కామరాజు.

"బుజాన బరువుంది బాబూ" అన్నాడు వాడు ఆగకుండానే.

"అక్కడ తూముకాడ దింపుకురారా పనుంది" ఇంకరాక తప్పిందిగాదు కుర్రాడికి.

సూరీడు ముసిగా నవ్వుకుంటూ వచ్చి కామరాజు ముంగిలిముందు తలవంచుకునే నిలబడ్డాడు. చెవుల తమ్మెట్లు, క్రొత్త కబ్బా, పట్టకోను మెలతాడు, మిసమిసలాడే పిక్కలు బూరెల్లాగున్న బుగ్గలు ఆదే యావగా చూస్తోంది కాంతమ్మ. ఎప్పుడు తమ యింట్లో చాకిరిచేసే కుర్రాడే అయినా వాడిలో ఆమెకు ఆ నూతనవత్సర వసంత ప్రాదుర్భావ సుప్రభాతంలో క్రొంగ్రొత్తకాంతులు మెరుస్తున్నట్లు తోచింది.

"వల్లేసా ఒరే అది?"

"చిత్తం."

"ఎక్కడిక్కి?"

"రావులపల్లి బాబూ!"

"పాము మంత్రగాడికేనా?"

"చిత్తం."

"లేదంటే రెండు కాటాలుంటాయా?"

"చిత్తం."

"ఒరే—అయిదు మైళ్ళు ఆ పట్టాన్నే మోసుకుపోగలవట్రా."

"అదుం పెట్టిన జీతంగాదు బాబూ. అంతదూరమేంటిబాబూ—ఇంకో అంతైనా మంచినీళ్ళు గాకుండా తిరిగేస్తాను."

"రెండు కాటాలు మీ వేరా?"

"అవ్వే! ఒకటి బాబు ఇచ్చిరమ్మన్నాడండి. మరొకటి మనూరులో దండిన బాపతు. ఏటా కాటారివాజు గాదుటండీ?"

"ఇదిగో. ఇలాగరండి" అని లోపలికి పిలిచి ఏమో నసిగింది పెనిమిటితో కాంతమ్మ

"సూరీ—కావిడిబట్టకొచ్చి నసవలో బెట్టు—ఇవ్వాళే పంపంగాదురా. ఇక్కడే భోంచేసి చల్లబడ్డాక సవారీబండి గట్టు కొండ్రకోట తీర్థానికి. అమ్మగారొస్తారు. దారిలో ధాన్యం రావులపల్లిలో దింపేసి వద్దువుగాని. వస్తే నేనూవస్తా" అజ్ఞాపించాడు కామరాజు.

సూరిగాడు కావడి భామందుల ఇంటిలో పెట్టేశాడు. భోంచేసేటప్పుడు మళ్ళీ యేటి ప్రసక్తి వచ్చింది. "మా బాబు అరగరిపెను తప్పైతే యీ యేటికి కమతం పెట్టన్నాదుండి" సూరిగాడు నవ్వుతూ అన్నాడు.

"జీతంమాట కేంలే-మీ బాబుతో మాట్లాడతాను గాని మువ్వమటుకు మా కమతం వొదలగూడదు" అన్నారు కాంతమ్మ, కామరాజూ.

సాయంత్రం మూడింటికి సవారీబండి కట్టారు. సూరిగాడు తోలడం అంటే ఎంత సరదా! గంటగాకుండా రావులపల్లిలో ధాన్యం చేరవేసి కొండ్రకోట నూకాలమ్మ గుడిముందు ఆపుచేశాడు బండి. కామరాజూ, కాంతమ్మా అమ్మవారికి పళ్ళిచ్చుకున్నారు. పతిగాడికి తెలియకుండా మాకప్పకు ఆవాడే మొక్కాను అనిచెప్పి చాటుగా ఇచ్చిపంపిన కోడిపిల్లను అమ్మవారి కప్పగించాడు సూరయ్య. తీర్థం నుంచి తిరిగొస్తూ దంపతులు ఎంతిగానో తమలో శ్లాఘించుకున్నారు సూరిగాడి ప్రజ్ఞ, చురుకు, వినమ్రత, విశ్వాసం, కృతజ్ఞత మళ్ళీ మళ్ళీ తలుచుకుని!

ఈ గడపలో అడుగుపెట్టాను! ఏదీ ఆ ఆదరం? ఎవరున్నారీ యింట్లో?

(క్షణకాలం నిశ్శబ్దం. రాజశేఖరం మేడమీది నుండి దిగివస్తాడు. వయస్సు తక్కువైనా ముడుతలుపడి పాలిపోయిన మొహం. జుట్టు తెల్లబడింది. కనురెప్పలు ఉబికి వున్నాయి. సన్నని పెదిమలు. ఆ పెదిమలమీద బలిసిన మీసాలు. సిల్కు దోవతీ, లాల్చీతొడుక్కున్నాడు. కంటికి అద్దాలు. నాలుగు వేళ్ళకూ నాలుగు రవ్వల ఉంగరాలు. చేతిలో వంకీకఱ్ఱ.)

రాజ: ఎవరది?—ఎవరు? (దగ్గరకు వస్తాడు. జగన్నాథాన్ని చూస్తాడు. అయినా అతనిలో పెద్ద మార్పేమీ వుండదు. ఒక్క క్షణం నిశ్శబ్దం.) ఓహ్! (మెల్లిగా) వచ్చా వన్నమాట! (పెద్దగా) నువ్వా జగన్నాథం! రా. రా. కూర్చో.

జగ : ఆc! నే... నే ప్రొద్దున, ఎందుకో, పిలిపించావు?

రాజ: అవునవును. మాట్లాడవలసిన పనివుంది. అయినా వచ్చి రాకముందే వ్యవహారాలు మాట్లాడాలా? కాసేపు విశ్రాంతితీసుకో. ఆ తర్వాత, తీరిగ్గా–

జగ : కాదు. నే వెళ్ళాలి. పనుంది.

రాజ: ఎవరికుండవు పనులు. నాకు లేవూ? పంచాయితీబోర్డు ప్రెసిడెంటు నే,—ఊళ్ళో బావులు తవ్విస్తానని గవర్నమెంటు వాళ్ళదగ్గర వెయ్యి రూపాయలు ఎడ్వాన్సుగా పుచ్చుకున్నా నే, ఓటర్లతో రోడ్లు వేయిస్తానని ప్రామిస్ చేసికదా పోటీచేసింది, మరి నా కుండవూ పను? సర్దుకు పోవాలి.

జగ : కాదు. నే వెళ్ళాలి. అర్జంటు. అబ్బాయొస్తున్నాడు.

రాజ: ఎవరూ—మన రఘు! రఘు వస్తున్నాడా? ఎప్పుడు, ఎక్కడినుంచి?

జగ : అవును. నా బాబు వస్తున్నాడు. పరీక్ష రాసి ఫస్టున పాసై, దొరబాబులా వస్తున్నాడు. రెండేళ్ళయింది వాణ్ణి చూచి. ఎల్లావున్నాడో! కళ్ళు కాయలుకాచి పోయాయి.

రాజ: పెద్ద చదువుకు పంపించావా?

జగ : అవును. ఇంటరు అందరికన్నా ఫస్టున పాసైనాడు. "ఇంకా చదువుకుంటావా బాబూ?" అనడిగాను. "డబ్బేది నాన్నా?" అన్నాడు తల వంచుకుని. పాపం, ఎంత బాధపడి అన్నాడో వాడామాట! సామాన్యంగా బయటికి పొంగనే పొంగదు. నివురుగప్పిన నిప్పు. "నా బాధలు నే పడతాలే బాబూ! దిగులు పడకు" అని, తిరిగిన గడప తిరక్కుండా అడిగిన బంధువును అడక్కుండా ప్రయత్నించాను. ఎల్లా ఆ మొదటి సంవత్సరం గడిచిందో ఆ భగవంతుడికే తెలియాలి. ఇదంతా వాడూ చూస్తూనే వున్నాడు. అజ్ఞానుడు కాదుగా! "నాన్నా! ఈ పాడు చదువు నాకొద్దు నాన్నా! నాకోసం, నువ్వింత హీనంగా నిన్ను నీవు అమ్ముకోవడం—ఏమంత అవసరం వచ్చింది నాన్నా? ఈ వార్ధక్యంలో రామా, కృష్ణా అంటూ ఓమూల కూర్చోవలసిన నువ్వు ఈ విధంగా, నాన్నా నాన్నా!" అంటూ నా బాబు వోహాటే ఇదైపోయాడు. పిచ్చి తండ్రి!!! వాణ్ణైనా భగవంతుడు చల్లగా చూడాలి. ఇంతలో, రెండో సంవత్సరంలో స్కాలర్‌షిప్ కూడా వచ్చింది. నా బాబుకు, నా దొర బాబుకు.

రాజ: ఓc! అయితే తెలివిగలవాడన్నమాట!

జగ : తెలివి! నా బాబు, పదికాలాలపాటు చల్లగా ఉండాలే కాని, వాడి జీవితం, తప్పక పుష్పించి తీరుతుంది. త...ప్ప...క వాడు, దెబ్బతిన్న నా బ్రతుక్కి, ఇంతకన్నా ఏం కావాలి శేఖరంబావా?

రాజ: నిజమే. ఏం కావాలి? (రాజశేఖరం, జగన్నాథం చేతిలోవున్న పంచీని ఇంతవరకూ చూడలేదు. అప్పుడే చూస్తూ) సరేగాని, అదేమిటి? బజారునుంచి వస్తున్నావా? పంచీ గించీ పట్టుకు బయల్దేరావు? పంచీలో ఏమున్నాయేమిటి? పళ్ళా? కొడుక్కి స్వీట్సా!

(జగన్నాథం ఈ మాట వినడంతో బాగా వాడిపోయాడు. కొద్దిగా కోపంకూడావచ్చింది. దెబ్బతిన్న అభిమానంతో)

జగ : స్వీట్లు!!! పళ్ళా, ఫలహారాలా పెట్టేటంతటి తాహతే నాకు వున్నట్లయితే, ఇన్ని బాధలూ,

అవమానాలూ అనుభవించవలసిన దురతి నాకు పట్టేదే కాదు రాజశేఖరం! నీకూ తెలుసు. అర్ధాకలితో అలమటించని రోజు మాకు లేదని. అయినా ఇదంతా తమాషా నీకు. ఒక ఆట. చూచి నవ్వుకోవడానికి వొకవిధమైన వినోదం. ఊ కానీ, పర్వాలేదు. ఇంతిలో నాకు పోయే అభిమానం ఏమీ లేదు. ఉండవలసిన గౌరవాభిమానాలు ఏనాడో మంటగలిపినదే! ఇంకా మిగిలిందేమిటి? అన్నట్టు, దీంట్లో ఏముందో చూడనే లేదుకదూ. చూడు బాగా. ఇదిగో బియ్యం. వండుకోడానికి బియ్యం తీసుకు పోతున్నానింటికి. మా చెల్లెలు చచ్చిపోయినా ఆలోటు కనుపించదు నీకు. వంటమనిషి ఆ స్థానాన్ని భర్తీ చేస్తుంది. కాని...కాని...నా ఆడది పోయింతర్వాత, నా ఇంట్లోంచి లక్ష్మీదేవే వెళ్ళిపోయినట్లయింది.

రాజ: అంతే జగన్నాధం. అంతే ఓడలు బండ్లవుతాయి. పైనున్న చేయి క్రిందకు వస్తుంది. అంతే.
(గడియారం ఎనిమిదిగంటలు కొడుతుంది.)

జగ: అయ్యో! అయ్యో! ఎనిమిదైపోయిందే! ఇంకొక్క గంటలోవాడు వస్తున్నాడు. వెళ్ళాలి. వెళ్తాను శేఖరం. రాక, రాక, పదేళ్లకు నీయింటికి వచ్చినా, ఎక్కువసేపు కూచుని నీతో మాట్లాడలేకపోయాను. అదే విచారంగా వుంది.

రాజ: నాకూ అదే విచారంగా వుంది జగన్నాధం. ఒక వూరివాళ్ళమే అయినా, ఈ నాటికి గాని తీరుబడి కాలేదు మా యింటికి రావడానికి నీకు. రాక రాక వచ్చినవాడివి, కాసేపు విశ్రాంతి తీసుకుని, కాస్త భోజనంచేసి, ఆ తర్వాత మనసూ, మనసూ విప్పి మాట్లాడుకుని, పాత వైషమ్యాన్నీ, గతకాలపు బాధలనూ, ఇక్కడ వదిలిపెట్టి నువు వెళ్ళడంలేక అని నాకూ బాధగా వుంది.

జగ: నిజమే?

రాజ: నాకు తెలుసు. వచ్చినప్పటినుంచి, వొకే వొక ప్రశ్న అడగాలని నువు తాపత్రయ పడుతున్నావు. ఈ డబ్బు, ఈ వైభవం, ఈ భోగభాగ్యాలు, ఇవన్నీ చూసేసరికి "వీడేనా ఆ రాజశేఖరం!—కట్టుకోను గుడ్డలేక, పెళ్ళానికి తిండిపెట్టలేక, దాన్ని చంపుకున్నవాడు?" అని ఆశ్చర్యపడుతున్నావు.

జగ: రాజశేఖరం!!

రాజ: నాకు తెలుసు జగన్నాథం. నీలో ప్రతిఅణువూ సందేహావృత మవుతోంది "వీడు, రాజశేఖరం ప్రతి పైసనీ—కాని, అర్ధణా అనుకొని జీవితాన్ని గడిపినవాడు, ఇంత సిరిని మూటగట్టుకున్నప్పుడు, ఎందుకు తను గడిపిన ఆ పాత జీవితాన్ని మర్చిపోయి, కనీసం ఆప్త బంధువుల మొహమైనా చూడకుండ స్వార్థపరుడైనాడూ" అని కదూ?

జగ: గడపలోకి వచ్చినవాళ్ళను వెళ్ళగొట్టావు?

రాజ: తెప్పలుగ చెలువునిండిన కప్పలు పదివేలు చేరు. కాదంటావా? మనసు మంచిదనుకుంటూ మడిగట్టుకు కూచుంటే లాభం లేదీలోకంలో. నీ ప్రయోజనా లేమిటో నువ్వు తెలుసుకుని, దాని కనుగుణంగా వ్యవహరించాలి. అది ఒకళ్ళకు మంచిదా, చెడ్డదా అన్న ప్రశ్న నీకనవసరం. నీకు మంచిదయితే మాత్రం దాన్ని వదలకు. అనుభవం జగన్నాథం, అనుభవం!! అనుభవం నేర్పిన పాఠం నాకిది. నువ్వు చెప్పినట్టే, నేనూ అర్ధాకలితో అలమటించిన రోజులు లెక్కకు చాలా వున్నాయి. ఆ తర్వాత తెలుసుకున్నాను. ఇది కాదు మార్గమూ అని. బికారీ శేఖరం, రౌడీ శేఖరమయ్యాను. రౌడీ శేఖరం రాజకీయ నాయకుడయ్యాడు. ఆ రాజకీయ నాయకుడు మిద్దెలూ, మేడలూ కొనుక్కున్నాడు. భూమీ, పుట్రా సంపాయించాడు. నలుగురిచేతా, "ఓహో అంటే ఓహో" అనిపించుకున్నాడు. అన్యాయం చేస్తే యేం?—అయినా ఎవరు అన్యాయం చెయ్యడం లేదు కనుక?

జగ: అయినా ఐశ్వర్యం వచ్చిందికదా అని—

రాజ: నిన్ను దగ్గరకు తియ్యాలంటావు? నిన్ను దగ్గరకు తియ్యగానే, మేనత్త కొడుకులూ, మేనమామ అల్లుళ్ళూ, వేలువిడిచిన పినతండ్రులూ, అందరూ నా చుట్టూతా, నా అనుగ్రహం కోసం...

జగ : నీ అనుగ్రహాన్నాశించి నే నిప్పు డిక్కడికి రాలేను.

రాజ : అలా, అందరిలాగా లేలిక పడిపోకుండా నా అనుగ్రహం కోసం. పడికాపులు కాయకుండా ఈ పదిసంవత్సరాలూ సుఖంగా కాలక్షేపం చేశావు కనుక నే ఈ నాడు తిరిగి ఇక్కడికి రాగల అర్హత నువ్వు సంపాయించుకున్నావు. రఘుపతిని ఈ యింటి అల్లుణ్ణి చేయుగల గౌరవాన్ని పొందుతున్నావు.

జగ : ఏమిటీ!!!

రాజ : ఆశ్చర్య పడబోకు. ఇందులో ఆశ్చర్య పడవలసింది ఏమీ లేదు. నీ ప్రవర్తన నా మనసుకు నచ్చింది. రఘుపతి అభివృద్ధి నన్నెంతో ఆకర్షించింది. బుద్ధిమంతుడు, గుణవంతుడు, రూపవంతుడు అయిన అల్లుడికన్నా కోరతగిన వస్తువు ఏముంది లోకంలో? ఇక డబ్బంటావా? వెధవ డబ్బు! నీటి కెరటం లాంటిది. ఒక సంగతి చెప్తాను విను జగన్నాథం. మా వాళ్ళు భాగ్యవంతులు కారు. నేనూ, నా జీవిత ప్రథమంలో బీదవాణ్ణే, కాని గాలివాలు మారింది. ఈ నాడు నేను లక్షాధికారిని.

ఈ డబ్బు శాశ్వతమని నేనెపుడూ భ్రమించడం లేదు అయితే ఒకానొక కోరిక మాత్రం నాలో వుంది. ఈ డబ్బును ఎలా శాశ్వతం చేసుకుందామా అని. నాకు కొడుకులు లేరు. ఉంటే ఈ డబ్బు ఎట్లాగూ నాకు దక్కేది కాదనుకో. కారణం నీకు తెలుసుగా! వాళ్ళప్పుడు భాగ్యవంతుని కొడుకులు. బీదవాళ్ళలాగా అణా పైసలు లెక్క పెట్టుకుంటూ ప్రతి వాన చినుక్కూ ఎదురు చూడవలసిన అవసరం వాళ్ళకేమిటి చెప్పు? సరే. అది వేరే సంగతి. అదృష్టవశాత్తూ భగవంతుడు నాకు ఆడపిల్లను మాత్రమే ప్రసాదించాడు. మల్లిక అయినా రాలుగాయి పిల్ల కాదుగదా; గీసిన గీటు దాటదు. అందుకే నేను మన రఘుపతిని దానికిచ్చి చేసి—

జగ : (ఆవేశపడుతూ) అక్కర్లేదు. నాకే సంబంధం అక్కర్లేదు. నీ డబ్బూ నువ్వూ ఎవ్వరూ నాకక్కర్లేదు. (గద్గదికంగా) నాబాబును నీయింట్లో ప్రవేశపెట్టి వాడి జీవితం కూడా నాశనం చెయ్యనా? ఇల్లరికపుటల్లుడి బాధలు-భగవాన్!

రాజ : అలా ఎందుకు అనుకుంటావు జగన్నాథం? నీదశ మారిందనుకో. నువ్వూ నీ రఘూ హాయిగా కాలుమీదకాలు వేసుకొని జీవితాన్ని అనుభవించవచ్చు. నువ్వూ ఇక్కడే వుండు. నిన్ను కాదనేవాళ్ళెవరు? రఘు నీవాడే కదా! మల్లిక నీ కోడలే కదా! అయినా దాని సుగుణాలు నీకు తెలియనివి కనుకనా? ఇహపోతే నేనొక్కణ్ణి మిగిలాను. వాళ్ళిద్దర్నీ చూచి సంతోష పడటం కన్నా నాకు మాత్రం ఏం కావాలి?

జగ : ఊహూ. ఒప్పుకోను! నా బిడ్డ జీవితం నాశనం చెయ్యలేను. చదువుకున్నవాడు! నాలుగురాళ్ళు సంపాయించుకో గల్గినవాడు! వాణ్ణి నీ యింట్లో పెట్టి వాడిజీవితాన్ని, స్వాతంత్ర్యాన్నీ అపహరించి—క్షమించు శేఖరం, నన్ను క్షమించు.

రాజ : ఉద్యోగం! ఏం ఉద్యోగమయ్యా మీ వాడు చేసేది? ఊళ్ళేలుతాడా? పల్లకీలో వూరేగుతాడా? నెలనెలకూ తెచ్చుకునేది పొట్టకేచాలక, నలుగురు పిల్లలు కంటికి కనబడేసరికి "భగవంతుడా! ఈ జీవితం మాకెందుకు ప్రసాదించావు?" అంటూ వాడిమీదపడి ఏడుస్తారు. ఇటు తినను తాను సంతృప్తి పడుదుకోలేడు. అటు తనుకట్టుకున్న ఆడదానికోరికలకు సమాధానం చెప్పలేడు. ఇదేనా ఉద్యోగం? ఇదేనా అతగాడు చేసే నిర్వాకం?

జగ : (ఓమూలగా నిల్చుంటాడు. ఏం చెప్పాలో తోచదు. మాటిమాటికీ భగవంతుడా, భగవంతుడా అని అనుకొంటుంటాడు)

రాజ : ఆలోచించుకో జగన్నాథం. నువ్వూ, నేనూ బీదరికాన్ని అనుభవించాం. అది ఎంతటి ఘోర రాక్షసో ప్రత్యక్షంగా చూసి తెలుసుకున్నాం. అయినా నువు దాన్నుంచి ఏమీ పాఠం నేర్చుకోలేదు. ఒక్క సంగతి నేను జ్ఞాపకం చేస్తాను. జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించు. ఆరోజు సంవత్సరాది. నువ్వూ నేనూ మనస్సుల్లో ఏడుస్తూనే, పైకి నవ్వుకుంటూ భోజనానికి కూర్చున్నాం. లక్ష్మి ఎంత సేపటికీ

కాదు. వద్దంటారు. కోపం వచ్చింది. వంటింట్లోకి వెళ్ళాను. ఏం కనుపించిందక్కడ? పొయ్యి దగ్గరగా తిరుగుతూ, క్రిందికి చూస్తూ నిల్చున్న లక్ష్మి, అప్యాయంగా తనకు లభించిన ఆ బద్ది గంజి నే కుసుకుసుమని కరుచుకున్న కుక్కపిల్ల! ఇదే జీవితం. పైకి కనుపించని బాధ మానవుని వుంచుగా పరవశాలను కోసి వేసే జీవితం.

జగ : శేఖరం, శేఖరం, వద్దు వద్దు. ఆ జీవితాన్ని నాకు జ్ఞాపకం చేయకు. రఘు అన్న భావనలో ఇదంతా మర్చిపోవడానికి యత్నిస్తున్నాను.

రాజ: కానీ సత్యం, సత్యంగానే వుంటుంది. యథార్థాన్ని కప్పిపుచ్చటం ఎంత కష్టం. నువ్వు దాని కేం చెయ్యగలవ్?—వాడి జీవితం నాశనం చేయడం తప్ప.

జగ : నాశనం చేయడమా! వాణ్ణా! నేను?

రాజ: అవును. నీకు తెలీకుండానే వాణ్ణి నువ్వు నాశనం చేస్తున్నావు. ఈ చినిగిన గావంచాతో బయటకు వెళ్ళేస్తున్న ఎముకలతో ప్రతివాళ్ళ దగ్గరికీ వెళ్ళి "మా అబ్బాయికి ఉద్యోగం యివ్వండి...మా అబ్బాయికి" అంటూ ప్రాధేయ పడతావా? ఒక వేళ ప్రాధేయపడ్డా విసిరించే వారు తప్ప, ఆదరించే వారు ఒక్కరు ఉండరు. అదే కాస్త సిల్కు ధోవతి కట్టుకుని మంచి లాల్చీ వొకటి తొడుక్కొని కొంచెం ఠీవిగా వెళ్ళు. వాళ్ళే నీకు కూర్చొను కుర్చీ చూపిస్తారు. దీనికి ఎవర్నీ అనే ప్రయోజనం లేదు. నేటి మన సంస్కారమే అంత. దానికి అనుగుణంగానే మనం కూడా నడవాలి. ప్రవాహాని కెదురీది ప్రయోజనం లేదు.

(గడియారం 8½ గంటలు కొడుతుంది. జగన్నాథం పిచ్చిగా గడియారం వేపు చూస్తాడు. మనసులో కోటి ఆలోచనలు మొహం మీద ఆవేదన. తనలో తను గొణుక్కుంటున్నట్టుగా.)

జగ : రఘూ!...ఏం చేయను? నువు సంపాయిస్తావని సంపాయిస్తూ నవ్వు మొహంతో నా దగ్గరికి వచ్చి "నాన్నా! ఇదిగో నాన్నా! డబ్బు! డబ్బు నాన్నా". అంటావని కలలుకన్నాను.

కాని ... కాని ... శేఖరం చెప్పింది కూడా అబద్ధం కాదే! ఏం చేయను? ఏం చేయన్నను? అయినా సరే. వదులుకోను. నా రఘును నా సుఖాన్ని వదులుకోను, వదులుకోలేను. రఘూ! రఘూ! వస్తున్నా రఘూ! నిన్ను చూచి మన సారా సంతోషించాలని వస్తున్నా, వస్తున్నా.

(త్వరత్వరగా బయటికి వెళ్ళిపోతాడు, రాజశేఖరం పిలుస్తున్నా వినిపించుకోకుండా. తిరిగి సర్వత్రా నిశ్శబ్దం వ్యాపిస్తుంది. రాజశేఖరం మొహంలో వికృతమైన వోహారకమైన నవ్వు.)

రాజ: యిదే జరుగుతుందని వూహించాను. ముందు జాగ్రత్తపడటం మంచిదే అయింది.

(మళ్ళీ పైకి వెళ్ళిపోతాడు. స్టేజి ఖాళీ. కారు ఆగిన శబ్దం. మల్లికా, రఘూ ఇద్దరూ ప్రవేశిస్తారు. వెనుకనుండి డ్రైవరు పెట్టె, బెడ్డింగు లోపల పెట్టి వెళ్ళిపోతాడు. మల్లికకు ఇంకా సరిగా రెండు దశాబ్దాలైనా నిండలేదు. పెళ్ళి కాని పిల్లలోని అందమూ, సౌకుమార్యమూ ఆమెలో కన్పిస్తున్నాయి. ఇక రఘుపతి మామూలుగానే అందమైన వాడనిపిస్తుంది. ఎఱ్ఱని కోల మొహం. మొహంమీదకు పడుతున్న వంకుల జుట్టు.)

మల్లిక : (నవ్వుతూ) ఇది మా యిల్లు. ఏదో బీదవాళ్లం. మాట కాదనకుండా సేషనునుంచి సరాసరి ఇక్కడికి వచ్చావు. మెనీ మెనీ థ్యాంక్స్.

రఘు : ఇదేమిటి? నువు చూపిస్తున్న ఈ ఆదరానికీ, నేను నేను పొందుతున్న ఈ సత్కారానికీ నేను కృతజ్ఞత చెప్పవలసిందిపోయి, నువ్వే నాకు కృతజ్ఞతలు తెలుపుకున్నావు.

మల్లిక : అంతేలే బావా. ఇది మోడరన్ సివిలైజేషన్. సరేగానీ ఇల్లంతా ఎలావుంది? ఈ పెయింటింగ్స్ చూశావా? నిజంగా అనకూడదుగాని బావా బెంగాలీవాళ్ళను ఏ ఫీల్డులోనూ, ఎవరూ బీట్ అవుట్ చెయ్యలేరనుకో.

రఘు : అంత త్వరపడి నిర్ణయాలకు రాకు మల్లికా. నీకూ నాకూ తెలిసింది చాలా స్వల్పం. ఆ స్వల్పజ్ఞానంతోనే, జనరలైజేషన్ చెయ్యడం చాలా ప్రమాదకరం.

మల్లిక: ఇంత సీరియస్ మనిషివి అనుకోలేదు బావా నువ్వు—

రఘు: నీకు తెలీదు మల్లికా, నా జీవితంలో సీరియస్‌నెస్ తప్ప మరేమీ లేదు. కొంతకాలం అన్నం కోసం, కొంతకాలం చదువుకోసం, ఇహనుంచీ ఇప్పుడు ఉద్యోగంకోసం. ఏదీ నాకు తీరిక లభించందే నవ్వటానికి.

మల్లిక: నవ్వటానికికూడా తీరిక కావాలా ?

రఘు: బావుంది. ఇంత అమాయకురాలివా నువ్వు? ఏడవటానికీ, నవ్వటానికీకూడా సమయాసమయాలున్నాయి. ఎప్పుడు ఏపనిచేయాలో అప్పుడు ఆ పనిచేయాలి. నాలాంటివాడికి నిరంతరం ఏదో వొక సమస్య వుండనే వుంటుంది. ఆఁ! ఇహ నేను వెళ్తాను మల్లికా, అక్కడ మా నాన్నగారు నాకోసం ఎదురుచూస్తుంటారు. పాపం! రెండేళ్ళయింది — ఆయన్ని చూసి. ఏలావున్నారో! సెలవుల్లోకూడా ఇంటికి వెళ్ళలేదు.

మల్లిక: ఇక్కడకూడా నీకోసం ఎదురుచూస్తున్న వాళ్ళున్నారన్న సంగతి మర్చిపోకు బావా? (అప్పుడే రాజశేఖరం పైనుంచి క్రిందికి దిగి వస్తారు. మల్లిక మాటలు వింటూ)

రాజ: అవును రఘూ! నీ బాగోగులను కోరేవారు, మీ నాన్నగారితోపాటు మరికొందరుకూడా వున్నారు. అది మర్చిపోకు. మల్లిక, వారం రోజులనుంచీ నువ్వొస్తావని అనుక్షణం ఎదురుచూస్తోంది. పిచ్చిపిల్ల! నువ్వంటే ఎంత అభిమానం దానికి!! ఆఁ! సరేకాని మల్లికా, లోపలకు వెళ్ళి, రఘుకు భోజనానికి ఏర్పాట్లు చెయ్యమ్మా! పాపం, ఎప్పుడు భోంచేశాడో పొద్దున. (మల్లిక లోపలకు వెళ్తుంది.)

రఘు: క్షమించండి. అక్కడ మా నాన్నగారు నాకోసం ఎదురుచూస్తుంటారు.

రాజ: బావుంది. ఇక్కడ మల్లిక, నీతో కలిసి భోంచేయాలని ప్రొద్దున్నుంచి మెతుకు ముట్టలేదు, ఇంకా వస్తాడు, ఇంకా వస్తాడు అని ఎదురు తెన్నులు చూస్తూ.

రఘు: మరీ—

రాజ: మరీ లేదు గిరీ లేదు. ఇప్పుడు నువు వెళ్ళిపోతే దాని మనసు ఎంత ఖేదపడుతుంది! అభం శుభం తెలియని పిల్ల.

రఘు: మా నాన్నగారు పాపం, చాలా బాధపడతారండి.

రాజ: అదేమిటోయ్ అలా అంటావు చిన్నపిల్లవాడిలాగ. మీ నాన్న ఆ మాత్రం గ్రహించుకోలేడా? పైగా మేమేమైనా పరాయివాళ్ళమా? లక్ష్మి ఏలాగూ వెళ్ళిపోయింది. మేం కూడా పోయామనుకున్నారటయ్యా! ఈ పదేళ్ళలోనూ మా యింటిగడప త్రొక్కలేదు మీవారు. ఏమంత పాపం చేశామయ్యా మేము? ఎంత చెడ్డా మేనత్త కూతురుకదా మల్లిక? నా కోసం కాకపోతే మానె, కనీసం దాన్ని చూడ్డానికైనా రావద్దూ? ఏం మనుషులయ్యా మీవారు? మీవి హృదయాలా, రాళ్ళా?

రఘు: మేమా? మీ యింటిగడప త్రొక్కంది?

రాజ: కాకపోతే మేమా? ఈ రెండేళ్ళలోనూ, నిన్ను గూర్చి మీ నాన్నను అడగని క్షణం లేదు. సరే. ఆ సంగతులన్నీ ఇప్పుడెందుకు తర్వాత మాట్లాడుకొందాంగాని లే. లే. స్నానం చేసి భోజనం చెయ్. బాగా అలసిపోయావులావుంది.

మల్లిక: (లోపల్నుంచి వస్తూ) నీళ్ళు తోడాను బావా!

రాజ: ఇంకా ఆలస్యమెందుకోయ్. లే లే. ఇప్పటికే ప్రొద్దుపోయింది.

మల్లిక: పద బావా. మరీ బెట్టుసరి చెయ్యకు. మొదటికే మోసమొచ్చేను.

(రఘు అయిష్టంగానే లోపలకు వెళతాడు. మల్లిక, రాజశేఖరం వొకరివేపు వొకరు చూసుకొంటుంటారు. వారి పెదవులపై చిన్నని నవ్వు. మల్లిక తిరిగి వెనక్కు వస్తుంది. రాజశేఖరం కూడా వెనక్కు వస్తూ)

రాజ: ఇంత బాగా నటించగలవనుకోలేదు మల్లికా నువ్వు!

మల్లిక: నాకుమాత్రం తెలుసా నాన్నా! (నవ్వుతుంది. నవ్వుతూనే) నాన్నా ఆ ముసలాయన్ని చూస్తుంటేమాత్రం జాలికల్గుతున్నది.

రాజ: నన్ను చూసికూడా కొంత జాలిపడు. నేనూ పెద్దవాణ్నై పోతున్నాను.

(నవ్వుతుంది. లోపలకు వెళ్తుంది. రాజశేఖరం ఆలోచనలో వుండగా) (తెర)

## రంగము: 2

* * మర్నాటి ఉదయం ఎనిమిది దాటింది. అదే రంగం. పెద్దమార్పేమీ లేదు. అయితే హాల్లో మాత్రం రెండు మూడు కుర్చీలు, టేబిలు చుట్టూరా వేయబడి వున్నాయి. కుర్చీలకు ఒకప్రక్కగా టీపాయ్. రాజశేఖరం, మల్లిక, రఘుపతి ముగ్గురూ కూర్చుని కాఫీ తాగుతుంటారు, విపరీతంగా మధ్యలో నవ్వుకుంటూ, మాట్లాడుకుంటూ—

రఘుపతి: అదండీ, అంత 'జాలీ'గా గడిపేశాను ఈ మూడేళ్ళూ అబ్బ! తల్చుకుంటే గగుర్పాటు కలుగుతూంటుంది. ఓ పీడకలగా వుంటుంది ఇదివరలో నే గడిపిన జీవితం. ఏమైతేనేం లెండి అంతా ఈ రోజుకు తేరుకున్నాం. ఇహనుంచైనా అందరం కలిసి మెలిసి ఆనందంగా వుంటే—

రాజ: అదేకదు రఘూ నేనుకూడా కోరుకునేది. జరిగిపోయిందేదో జరిగిపోయింది. మానవుడన్నతర్వాత తప్పులుచేయకా వుండడు. చేసిన వాటిని దిద్దుకోక తప్పనూ తప్పదు. అందుకనే గడిచిపోయిన సంగతుల నన్నింటినీ ప్రక్కన పెట్టి, ఇహనుంచైనా ఒకరకమైన క్రొత్త జీవితాన్ని, ఆనందకరమైన, సుఖప్రదమైన ఓ క్రొత్తజీవితాన్ని గడుపుదాం.

రఘు: అంతకన్న నాకుమాత్రం కావలసిందేముందండి. విడిపోయిన మన రెండు కుటుంబాలు ఒక్కటైతే...

రాజ: ఎంత అమాయకుడివి రఘుపతీ నువ్వు! వల్లని వన్నీ నీకెళ్ళనా? నీ అంతటి విశాలహృదయం అందరికీ ఉంటుందా? ఉదాహరణకు మీ నాన్నగారే—

రఘు: మా నాన్నగారా?!

రాజ: నే చెప్పేది బాగా అర్థంచేసుకో రఘూ! ఎవరిమీదా నాకు కోపం వుండవలసిన అవసరం లేదు. ఒకరినిగురించి వొకవిధంగా చెప్పవలసివస్తే వారిని నేను ద్వేషిస్తున్నానని అర్థంకాదు; వారు నాకు విరోధులూ అని కాదు. మనిషి అయినవాడు ఒక్కొక్క సమయంలో ఒక వింతపద్ధతిలో ప్రవర్తించవచ్చు. అదేమంత వింత సంగతికాదు. కాని ఒకసారి చేసిన తప్పిదాన్నే, పునశ్చరణ చేసుకుంటూ, పునరావృతం చేసుకుంటుంటే మాత్రం అది క్షమార్హం కాదు.

రఘు: అసలేం జరిగిందండి? మా నాన్నగారు... ఏమన్నా...

రాజ: అయినా ఆయన ముసలివారై పోయారు. జీవితంలో ఎక్కువ భాగం పాపం, కష్టాలతోనే గడుపుతున్నారు. చివరికి ఆ కష్టాలు అతన్ని ఎంతవరకు తీసుకు వెళ్ళిందీ అంటే— ప్రతి మనిషినీ అనుమానించేంతవరకూ. అది ఆయన తప్పిదంకాదు పరిస్థితుల ప్రాబల్యం.

రఘు: అసలేమన్నారండి?

రాజ: ఏమైనా అని వుండవచ్చు. అదంతా తిరిగి మనం చెప్పుకోవడం కూడా అంత బావుండదు. దానివలన ప్రయోజనమూ వుండదు. అయితే విషయం ఏమిటి అంటే—నువ్వు మల్లికను చేసుకోవడం ఆయనకు సుతరాం ఇష్టం లేదు.

రఘు: నేనా? మల్లికను—!

(మల్లిక దూరంగా వెళ్ళి పుస్తకం చదువుతున్నట్లుగా కూర్చుంటుంది. మధ్య మధ్యలో అతని వేపు చూస్తూంటుంది ఎఱ్ఱబడిన మొహంతో)

రాజ: ఏం మల్లిక అంటే నీకూ ఇష్టం లేదా? చెప్పవయ్యా. ఇందులో మొహమాటం పడవలసిన అవసరం ఎవరికీ ఏమీ లేదు. ఎదురుగా అద్దం వుంది. ఎవరికెవరు కావాలో నిర్ణయించుకోవచ్చు. మీ నాన్నగారినీ ఇదే సంగతి అడిగాను. కాదు ప్రాధేయపడ్డాను.

మొహం చిట్లించుకుని వెళ్ళిపోయాడాయన. ఇంతలోవున్నవి మన ప్రేమలూ, బంధుత్వాలూ. సరే. ఇప్పుడే అటు వెళ్తాను. ఆలోచించుకో. ఆలోచించుకుని ఏ సంగతీ నాకు చెప్పు. దానికైనా ఏనాడో వివాహం చేసి వుండవలసింది. నీ మీద ఆశలు పెట్టుకుని అందరూ వున్నారు. సరే. వస్తాను.

(వెళ్ళిపోయాడు. మిగిలిన వారిద్దరిలో నిశ్శబ్దం ముందు ఎవరు భంగపరచాలో సందిగ్ధంగా వుంది. మనస్సుల్లో ఏదో ఉబలాటం చివరకు రఘుపతి, మగవాడు కనుక ధైర్యంచేసి,)

రఘు : మల్లికా!

మల్లిక: (తల యెత్తకుండానే) ఆఁ!

రఘు : రామయ్య చెప్పింది నిజమేనా?

మల్లిక: నమ్మకం కలగడం లేదా?

రఘు : అహ. అదికాదు. చిన్నప్పటినుంచీ డబ్బుతో సయ్యాటలాడుతున్న నువ్వు తిండి కూడా సరిగా పెట్టలేని నాబోటివాణ్ణి చూచి ఎందుకు మోసపోయావూ అని.

మల్లిక : మోసపోలేదు. కర్తవ్యాన్ని తెలుసుకున్నాను. (మెల్లిగా లేచి, అతనికి దగ్గరకు వస్తుంది) ఒక్కటి అడుగుతాను రఘూ! కాదనవుకదా!

రఘు : ఇంతవరకూ కాదనలేదు.

మల్లిక : మా నాన్నగారికి వివాహం ఇష్టంలేదు. నీ సంగతి—

రఘు : నీకు బాగా తెలుసు.

మల్లిక : నిజమేనా!

రఘు : అబద్ధం చెప్పటం నాచేతకాదు.

బయటినుంచి : అమ్మగారూ!

రఘు : ఎవరు మల్లికా? ఎక్కడికి, బయల్దేరుతోంది?

మల్లిక : ఓహ్! పొరపాటైపోయింది. నీతో చెప్పనే లేదు. బ్రహ్మాండమైన షో. సీట్లుకూడా రిజర్వు చేయించాను. పద రఘూ!

రఘు : సారీ సినిమాకు చేరాలేను.

మల్లిక : అదేమిటి! నువు రాకపోతే ఇహ ఈ ప్రోగ్రాం ఎరేంజ్ చేయించింది నాకోసమా? బావుంది.

రఘు : ఈసారికి నన్ను క్షమించు.

మల్లిక : అసలేమిటి కారణం? సినిమాలు చూడ్డం నీకు, అలవాటులేదా?

రఘు : (మెల్లిగా) మా నాన్నగారిని ఇంతవరకూ చూడనేలేదు. ఇప్పుడయినా చూడకపోతే బావుండదు.

మల్లిక : (పెద్దగా నవ్వుతూ) రఘూ!... రఘూ! ఈ కాస్త దానికి, సినిమాకు రావంటావా? ఏముంది. వెళ్ళేటప్పుడు, మా యింటిమీదుగానే వెళదాం. అటు నువు మా నాన్నగార్ని చూచినట్లూ అవుతుంది. ఇటు మనం సినిమాకు వెళ్ళినట్లూ అవుతుంది. ఏమంటావు... ఒప్పుకున్నట్లేనా?

రఘు : అసాధ్యురాలివి!

(మల్లిక పెద్దగా నవ్వుతుంది. మల్లికను చూచి రఘుకూడా. హోలునిండా వారిద్దరి నవ్వులే. ఇంతలో రాజశేఖరం ప్రవేశిస్తాడు. అతన్ని చూడగానే రఘు సిగ్గుపడిపోతాడు. మల్లిక మళ్ళీ ఓ మూలకు వెళ్ళి దాక్కుంటుంది. రాజశేఖరం పరిస్థితిని అర్థంచేసుకుంటూ, నిండుగా, సంతృప్తితో.

రాజ : ఓఁ! రఘూ!...ఇప్పుడే మాట్లాడొస్తున్నాను. అతను లేడూ శివకామయ్యగారబ్బాయి, ఇక్కడ ఇంటరు చదివి, బి. ఏ. రెండు మూడు సార్లు తప్పి, నీ క్లాస్ మేట్ కదుటయ్యా, అప్పుడే మర్చిపోయినావా? సుబ్బారావు ... అతని కిప్పుడు కొమ్ములు మొలిచి ఫారిన్ వెళ్తున్నాడు. అప్పుడు నాకనిపించింది నువ్వు మాత్రం ఎందుకు వెళ్లకూడదూ అని.

రఘు : నేనా? ఫారిన్ కా?

రాజ : డబ్బుకోసమే బాధపడుతోంది. నేనున్నాను. ఏ ఆక్స్‌ఫర్డుకో, కేంబ్రిడ్జికో వెళ్ళు. రిసెర్చి చెయ్. తిరిగిరా. అప్పుడు చూసుకో. ఇప్పుడు నువ్వు బాధపడుతున్న 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్' అప్పుడు 'సుపీరియారిటీ కాంప్లెక్స్' అయి కూర్చుంటుంది. నీముందుకువచ్చి ధీమాగా మాట్లాడగలిగేవాడుండడు.

రఘు: ఎల్లా మీకు నా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలీకుండా వుంది.

రాజ: నేనేమీ స్వార్థ రహితుణ్ని కాదు రఘుపతీ! నాలోనూ కొన్ని బలహీనతలు ఉన్నాయి. మల్లిక సుఖమే నాకు కావలసింది.

మల్లిక: నాన్నా—అలా వెళ్లొద్దామనీ...

రాజ: ఓహో! మీ ప్రోగ్రాంకు భంగం కలిగిస్తున్నానులా వుంది! వెళ్ళిరా రఘూ! తర్వాత మాట్లాడుకుందాం.

[మల్లిక, రఘు ఇద్దరూ వెళ్లిపోతారు. సిగార్ తీసి వెలిగించుకుని, రాజశేఖరం ఆ గాజుతొట్టి దగ్గరకు వచ్చి నిలబడ్డాడు. మొహం కొంచెం భీకరంగా తయారైంది.

రాజ: బీదవాడి జీవితం ఒడ్డున పడ్డ చేపవంటిది. నాలుగు డబ్బులు కంటికి కనబడగానే అదే చేపపిల్ల—

జగ: (విసురుగా ప్రవేశిస్తాడు. మనిషి నిలువునా కోపములో వణికిపోతున్నాడు. కళ్ళు ఎఱ్ఱగా జ్యోతుల్లాగా వున్నాయి.) రాజశేఖరం! ఇదేమైనా ధర్మంగా వుంది నీకు? ఒకరికి నీతి చెప్పవలసిన వాడివే నువ్వు, నువ్వు చేస్తావా ఈ పని. ఇంత మోసమా? ఇంత కపటమా? పెద్దమనిషివి!

రాజ: (అతి శాంతంగా) నువ్వు కాదా పెద్దమనిషివి!

జగ: మరి యేమిటి? అర్థరాత్రికి అర్థరాత్రి నాకన్నా ముందే సినిమాకు కారు పంపించి, అబ్బాయిని నీ యింటికి తెప్పించుకుంటావూ? యింత స్వార్థమా?

రాజ: తెప్పించుకున్నానా? మాటలు తూచి వాడు జగన్నాథం. మాటలచేత మహీపతుల మన్నన లందగవచ్చు. మరి మాటలు నేర్వకున్న మానవుడు హీనము.

జగ: నీచేత మర్యాదను గూర్చి చెప్పించుకోవలసిన హీనస్థితి నాకింకా రాలేదు.

రాజ: ఎవరికి తెలుసు?

జగ: ఏమిటి? మళ్ళీ అను ఆ మాట? నేను మర్యాదహీనుణ్నవుతానా?...అవును నాకొడుక్కోసం నీ యింటికి వచ్చినప్పుడే నేను మర్యాదహీనుణ్నయ్యాను. ఇందుకు ఒకరి వనవలసిన పనేముంది?

రాజ: నేనూ, నిన్నా మాట అనవచ్చుకదు, జగన్నాథం! కానీ నేను మర్యాదను కోల్పోదలుచుకోలేదు. నాకన్నా పెద్దవాడివి. కూచో. కూచుని ఆవేశం తగ్గిం తరువాత కొంచెం ఆలోచనకు అవకాశమిచ్చి నేను చేసిన దాంట్లో తప్పొప్పులను నిర్ణయించు.

జగ: కూచోను. నీ యింట్లో ఒక్క క్షణంకూడా కూర్చోను. నీయింటికి రావడంలోనే ఒక పెద్ద తప్పుపని చేశాను. (గిరుక్కున తిరిగి వీధి ద్వారం వరకూ వెళ్తాడు. మళ్ళీ తిరిగివచ్చి) అన్నట్టు అబ్బాయేడీ?

రాజ: నల్లపూసకాదుగా కనబడకుండా వుండడానికి. వెతుక్కోండి.

జగ: మేడమీద వున్నాడా? (పెద్దగా) అబ్బాయ్! అబ్బాయ్ రఘూ! హాలేయ్!

రాజ: (నవ్వుతూ) లేడు జగన్నాథం. సినిమాకు పోయాడు.

జగ: సినిమాకు పోయాడా? వెధవ! నేను వాడికోసం పొద్దంతా కళ్ళుగా ఎదురుచూస్తుంటే, వాడు, నన్ను చూడాలని చీమకుట్టైనా లేకుండా సినిమాకు పోయినాడా? సినిమాకు!

రాజ: ఈ కాలపు కుఱ్ఱవాళ్లే అంత. బాధపడకు జగన్నాథం.

జగ: బాధ! రాత్రిల్లా వాడికోసం స్టేషన్లో నే వున్నాను. నేను వచ్చేసరికే బండివెళ్ళి అరగంట దాటింది. వాడెక్కడా లేడు. మళ్ళీ బండికివస్తాడని—నీకు తెలీదు రాజశేఖరం. వాడికోసం నా హృదయం ఎంతగా అంగలారుస్తున్నదో నీకు తెలీదు. ఆతర్వాత ఎవరో చెప్పారు. ఎవరో సన్నగా, ఎఱ్ఱగావున్న అమ్మాయి వచ్చి వాణ్ని కార్లో తీసుకు వెళ్ళిందని. పోనీ, ప్రొద్దునయినా వస్తాడు కదా అని ఎదురుచూశాను. రాలేదు. నేనే వచ్చాను. వాడు సినిమాకు వెళ్లాడు. చూస్తాను. ఇంకొక్క నాలుగంటలు. అప్పటికీ రాడా? ఎందుకు రాడూ నాబాబు!! (విసురుగా విని పించుకోకుండా వెళ్లిపోతాడు)

రాజ: (జగన్నాథం పోయిన వేపే చూస్తూ) విన్నా, నీ బాధను చూస్తుంటే నేను చేస్తున్నది అన్యా

యమీ సేవా కనిపిస్తున్నది జగన్నాథం! కొంత ఇలా చేయకపోతే నేను ఇన్నాళ్లూ పడ్డ శ్రమ వృథా అవుతుంది! నేను సర్వనాశన మౌతాను. వాడబ్బ అన్యాక్రాంత మౌతుంది. మల్లిక బాధ పడుతుంది. అందుకనే— (తెర)

## రంగము: 3

* * అదే రంగం. పెద్దమార్పేమీ లేదు. గడియారం సాయంత్రం ఆరుగంటలు సూచిస్తోంది. ఇంకా లైట్లు వెలగ లేదు. రంగస్థల మంతా మసక చీకటిలో వుంది. రఘు ఓమూలనున్న కుర్చీలో కూర్చుని శూన్యంలోకి చూస్తున్నాడు; పరధ్యానంగా తనలో తను మాట్లాడుకొంటూ

రఘు: ఏం చేయను? ఇటుమల్లిక అనుక్షణమూ నన్ను వదలకుండా, కాదు, నన్ను వదలలేకుండా వుంది. రాజశేఖరంగారు సరేసరి. మా యిద్దరినీ చూసి మురిసిపోతున్నారు. ఒక్క అరనిముషం నన్ను వదలడం లేదు. అక్కడ నాన్న ఏమను కుంటున్నాడో! నాన్నా, ప్రొద్దున నీకోసం వచ్చాను నాన్నా! కాని నువ్వక్కడలేవు. నీకీసంగతి ఎలా తెలియడం?!!

రాజ: (బయటినుంచి ప్రవేశిస్తూ) ఎవరక్కడ చీకట్లో కూచుంది - రఘూ? (లైటు వేస్తాడు) ఇదేమిటి రఘూ! ఎందుకిక్కడ, ఒంటరిగా కూచున్నావు? ఏమిటాలోచిస్తున్నావు? మల్లిక ఏదీ?

రఘు: టాయిలెట్ అవుతోంది.

రాజ: ఇటు చూడు. ఈ క్లాత్ ఎలా వుంది? ఇంగ్లీషు గాబర్డీన్.

రఘు: ఎందుకండీ ఇవన్నీ ఇప్పుడు?

రాజ: అదేమిటి రఘూ అలా అంటావు? మా సంతోషం మాది. రాక రాక మా యింటికి వచ్చావు. ఎన్నాళ్లో కిన్నాళ్ళకు ఈ యింటికి మళ్ళీ కళ నిండింది. మాకు మాత్రం ఎవరున్నారు చెప్పు? నువ్వూ, మల్లికా సంతోషంగా తిరుగుతుంటుంటే చూసేకదా నేనైనా ఏదైనా చేయగలిగేది!

మల్లిక: (లోపలినుంచి ప్రవేశిస్తూ) పద రఘూ! ఇప్పటికే చాలా ఆలస్యమైంది. ఓ! నాన్నగారా?... పద బావా!

రాజ: మంచిదమ్మా వెళ్లి రండి.

రఘు: నాకేమీ మనసు బాగా లేదు. మానేద్దాం మల్లికా.

మల్లిక: ఎందుకని?

రాజ: ఏమిటి రఘూ—ఏమైంది? (రఘు చెప్పబోయి సందేహిస్తాడు. అది గ్రహిస్తూ) మీ నాన్న గారిని ఇంతవరకూ చూడనే లేదా?

రఘు: లేదండి.

రాజ: ఎంత తప్పుపని చేశావు రఘూ! లోకులేమను కొంటారు? మేమేదో మీ తండ్రీ కొడుకుల మధ్య భేదాలు పెడుతున్నా మనుకోరూ?

రఘు: వారేం చేశారండి? ఇందులో మీకేమైనా సంబంధం వుంటేనా?

రాజ: అలా అని చెప్పి మనం ఇతరులను మెప్పించ గలమా? నోటికి తెలివి లేదు. తెలివికి నోరు లేదు.

జగన్నాథం: (బయటినుంచి) రఘూ! ఒరేయ్ రఘూ!

రఘు: (ఒక్కసారిగా లేస్తూ) నాన్నా!

రాజ: చూడు రఘూ! వీధిలో నిలబడి అలా కేకలేస్తే ఏం బావుంటుంది చెప్పు. లోపలకు రమ్మను. ఇక్కడ కూర్చొని మాట్లాడుకోండి. బావుం టుంది.

రఘు: అలాగే. నాన్నా! ఇక్కడే వున్నా నాన్నా! లోపలికి రా నాన్నా!

జగ: (ఇంకా బయటే నిలబడి) ఒరేయ్! ఒక్కసారి రారా. రఘూ! ఒరేయ్ రఘూ!

రాజ: లోపలకు రా జగన్నాథం. ఇదేమైనా పరాయి యిల్లా?

రఘు: లోపలకు రా నాన్నా!

జగ: (కొంచెం కోపంగా) నువ్వు రారాదూ బయటికి? నే లోపలికి రావాలీ? బుద్ధి లేదట్రా నీకు? మనకు ఇల్లు లేదూ? వీళ్లదగ్గరటరా మన కుటుంబ విషయాలు మాట్లాడుకోవలసింది?

రఘు: వీళ్ళుమాత్రం ఎవరు నాన్నా! పరాయి వాళ్లా?

జగ : (లోపలికి విసురుగా వస్తూ) ఓరి! ఓరి! అంత దాకా వచ్చిందిరా? వీళ్ళ సంగతి నాకన్నా బాగా తెలుసురా నీకు? ఎవ్రరా నీకు సహాయం చేసింది ఈ పది సంవత్సరాల్నించీ.

రఘు : ఇదివరకటి సంగతులు ఇప్పుడు ఎందుకు నాన్నా? జరిగిందేదో జరిగిపోయింది. ఇహ నుంచీ ఓ క్రొత్త జీవితం ప్రారంభిద్దాం.

జగ : క్రొత్త జీవితం! దిగుల్బాటీ వెధవా అని. ఏదిరా క్రొత్త జీవితం? ఊళ్ళోకి వచ్చి రెండు రోజులైనా తండ్రిని, కన్న తండ్రిని చూడకుండా వుండడమటరా క్రొత్త జీవితం? ఎవరో కన్పించారట! ఏదో ఆశ పెట్టారట! క్రొత్త జీవితం ప్రారంభిస్తాడుట! అప్రాచ్యుడా అని.

రఘు : నాన్నా!

జగ : వొరేయ్! పరాయివాళ్ళ ముందరటరా నాపరువు తీసేది నువ్వు? ఇంతకన్నా వేరే సమయమూ, స్థలమూ నీకు దొరకలేదటరా? మనింట్లో నువు లక్ష అను పడతాను. ఇది కాదురా స్థలం. వీళ్ళు మనుషులు కాదురా. నిన్ను పీల్చి పిప్పిచేసే జలగలు.

రాజ : మంచిది జగన్నాథం. మేము జలగలమే అయితే ఒక సంగతి నువు మర్చిపోతున్నావు. ఇతను నీకు కొడుకు మాత్రమే కాదు. మాకు అల్లుడు కూడా! అల్లుడి యోగక్షేమాలను కోరని మామగారెక్కడైనా వుంటాడా?

జగ : అంత వరకూ వచ్చిందా వ్యవహారం? ఏరా? ఏరా రఘూ?

రఘు : (మెల్లిగా) అ...వు...ను నాన్నా!

జగ : అవునా? ఇంతగా చేయిజారిపోయిందా పరిస్థితి? (మనిషి బాగా దెబ్బతిన్నాడు. కోలుకోలేని దెబ్బ. మొహంలో కత్తివాటుకు నెత్తురు చుక్క లేదు. ఒక్క క్షణం అంతటా శ్మశాన ప్రశాంతత) శేఖరం...నువ్వు గెల్చావు. చివరకు విధిని ఇక్కడకూడా నువ్వే ఓడించావు. అయితే ఒక్క సంగతి. రఘును నా ప్రాణంలో ప్రాణంగా పెంచాను. నా మీద నీకు అభిమానం వున్నా లేకపోయినా వాణ్ని మాత్రం అన్యాయం చెయ్యబోకు. వె-స్తా-ను.

రఘు : నాన్నా! ఇదేమిటి నాన్నా? నువ్వు వెళ్ళిపోవడం దేనికి నాన్నా? నువ్వూ ఇక్కడేవుండొచ్చు నాన్నా!

జగ : ఎంత వెఱ్ఱివాడవురా నాయనా నీవు! నీతండ్రిని ఇంతేనా నువు అర్థంచేసుకున్నది. పరుల పంచలో వాళ్ళ దయాధర్మాల నాశిస్తూ, నీ తండ్రి బ్రతకగలడా? డబ్బు లేకపోవచ్చు. అన్నం లేక చచ్చిపోవచ్చు. కానీ గౌరవం లేకుండా మాత్రం, మానం లేకుండా మాత్రం నీ తండ్రి బ్రతకలేడు.

రఘు : నాన్నా! నేనూ, నీతో నే వస్తాను నాన్నా! నువ్వులేని నేను, నాన్నా!

రాజ : ఎక్కడికి వెళ్తావు రఘుపతీ?—మల్లికను ఏం చేసి?— మా గౌరవం సంగతికూడా కొంత ఆలోచించు. నిన్ను నమ్ముకుని అభిమానాన్ని వీధిలో పెట్టాం! అక్కడ నీకున్నది ఒక్క తండ్రి మాత్రమే. ఇక్కడ నీమీద ఆధారపడి వున్నది జ్ఞప్తి వుంచుకో.

మల్లిక : మామయ్యా! ఎందుకు నీకింత పంతం? నేను నిన్ను అవమానం చేస్తానా? ఈడబ్బు నీ పేర నే వుంచుకో మేమందరం నువ్వు చెప్పినట్లు నడుస్తాం.

జగ : పిచ్చితల్లీ! నేను బీదవాడుగా పుట్టాను. బీదవాడుగా పెరిగాను. బీదవాడిగా అభిమానవంతుడిగా చనిపోవడమే నేను కోరుకునేది కూడా!

రఘు : నాన్నా! నన్నన్యాయం చెయ్యకు నాన్నా!

జగ : నిన్ను అన్యాయం చెయ్యడమా? బాబూ! రఘూ! నువ్వు సుఖంగా వుండడంకన్నా నాకు కావలసిందేమిటిరా? నాదా చరమాంకంలోపడ్డ జీవితం. ఈ ఆరిపోయే దీపంకోసమని నిన్ను బాధిస్తున్నానని అనుకుంటున్నావా? వెర్రి తండ్రీ! నువ్వు పదికాలాలపాటు సుఖంగా వుండు—కనీసం నువ్వైనా శేఖరం! శేఖరం బావా! ఇవి చేతులు కావు. అభం శుభం తెలియని వాడు కాదు: జాగ్రత్త, వాణ్ణన్యాయం చెయ్యకు. పైన భగవంతుడున్నాడు. బాబూ! రఘూ! (వెళ్ళిపోతాడు.)

రఘు : నా...న్నా!

రాజ : నేనున్నాను రఘూ! నేనున్నాను. నేను, ఇంకా, చనిపోలేదు.

రఘు : నా...న్నా!

(తనలో తను కుమిలిపోతూ, ద్వారం దాకా వెళ్ళి, వీధివేపే, సజల నేత్రాలతో చూస్తుండగా)

(తెర)

# శ్రీనాథుని రచనలో భక్తిశృంగారభావశబలత

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

కవులు తమ రచనలను రసికజన హృదయాస్వాద్యముల నొనర్చుటకు వివిధరసభావములను దమతమ ప్రతిభానుసారముగ సంతరింతురు. విశేషమయిన విద్యా సంస్కారము లేకున్నను ప్రాణి సామాన్యమున కనుభవగోచర మగునది ప్రణయము. ఇట్టి ప్రణయము పరమేశ్వరాలంబనమగుచో భక్తియనియు, మాతృపుత్రాశ్రయమైనచో వత్సలతయనియు, ప్రేయసీప్రియాలంబనమైనచో శృంగారమనియు వ్యవహరింపఁబడుచున్నది. అఖండానందానుసంధాయియగు నీ ప్రణయము ననుసంధానించుటకుఁ గవికిని, అనుభవయోగ్య మొనర్చుకొనుటకు రసికునకును సముచిత చిత్తసంస్కార మావశ్యకము. అట్టిసత్త్వము కొందఱకే సమకూడియుండును. వీరశాంతాది రసభావములు కొందఱకే సముల్లాసజనకములు. హాస్యరౌద్రాది ఇతరరస భావములు పాఠకు లందఱకు నాస్వాదయోగ్యములు గావు. వాని ననుసంధానించు నుత్సాహముకూడఁ గవులలోఁ గొందఱకే జత గూడుచుండును.

శృంగారరసభావములు, తత్సముత్తేజక స్త్రీపురుష సౌందర్యవర్ణనము తదాలంబన ప్రాకృతిక వికాససముత్కర్షమును సహజముగ కవిదృష్టిని రసికహృదయమును వెంటనే యాకర్షించును. కాని తదనుగుణ వస్తుసమున్మీలనము కవికి మిక్కిలి కఠినము. తదనుసంధానయోగ్యమగు చిత్తసంస్కారము లేని పాఠకులకు శ్రోతలకు నది యట్టిదదే. ప్రణయమనునది తెలిసియో తెలియకయో, కొలఁదిగనో గొప్పగనో మానవహృదయమందు తత్తద్వయోవస్థానురూపముగ మొలకెత్తుచుండును. కావుననే యది స్త్రీపురుష సామాన్యముగ ననుభవయోగ్యమై యొప్పలారుచుండును. అందును పరస్పర ప్రేయసీప్రియాశ్రయమైన ప్రణయభావములు, తదుత్తేజకసామగ్రియు నుత్తమకావ్యోపనిబద్ధమై యాస్వాదయోగ్యములై వెలువడినపుడు, నవి యాశ్రమవయోవిభాగ నిరపేక్షముగ నందఱకు సముల్లాసము గలిగించును. అట్టి శృంగారరసభావముల నౌచిత్యభంగ మిసుమంతయు లేకుండ రాగులకు యోగులకుఁ గూడ శ్రవణపేయముల నొనర్చినవాఁడు సంస్కృతమున మహాకవి కాళిదాసు.

కాళిదాస విరచితమైన కావ్యములలో ప్రధాన రసము శృంగారమే యయినను, తదుత్తేజక సామగ్రి, మానవసామాన్యమునకు హృదయాహ్లాదిగ గానవచ్చినను కవితారహస్యవేత్తలకది పార్వతీపరమేశ్వర భక్తిభావసముత్తేజక వస్తుసామగ్రిగనే గోచరించును. ఆతఁడు తన కుమారసంభవకావ్యమున పార్వతీపరమేశ్వరాలంబనమైన శృంగార రసభావములను సమగ్రముగ వర్ణించి, తద్భావావిష్కరణము నాత్మీయభక్తిభావావిష్కరణ పర్యవసాయిగ నొనర్చియున్నాఁడు. ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథుని రచనయు నట్టిదియే. సంస్కృత వాఙ్మయమునందలి సరససామగ్రిని దనరచనలో ననుసంధానించుచు పరమేశ్వరాలంబనముగ శృంగార రస భావముల నావిష్కరించిన యాతని రచనయు భక్తిభావ పర్యవసాయియై యొప్పలారు నొక ప్రవంతి.

శ్రీనాథుని రచనలో శృంగార రసభావము లోతప్రోతమై యుండునని యొక ప్రసిద్ధి. అతనిచాటుపద్యములని లోకమున వ్యాప్తిలోనున్న పద్యములను బట్టి యాతఁడొక శృంగారపురుషుఁడని కింవదంతి. ఇట్టి ప్రవాదము కాళిదాసునకు లేకపోలేదు. కాని శ్రీనాథుని రచనలని నిర్వివాదముగఁ దేలిన వానిలో నొక్కనైషధము దక్క మిగిలిన వానిలో పెక్కుతావులందు పరమేశ్వర భక్తిభావమే విపులముగ నిరూపితమైనది. ఈ తీరుగ భక్తిభావము నావిష్కరించు పట్టులందు సైతము శృంగారరసభావములు జతగూడునట్లు లొనర్చి, తన కవిత నాస్వాదయోగ్య మొనర్చుటకై శ్రీనాథుఁడొక ప్రత్యేక సరణి నంగీకరించెను. ఇటులనే శృంగారరస భావసామగ్రితో భక్తిభావముల నతికించుటయు నాతనికిఁ బట్టుబడిన యొక ప్రత్యేకతగా నిరూపింపనగును.

కవియైనవాఁడు తానే యితివృత్తమును దీసికొనినను దానిలోఁ దన కాలమునాఁటి జనుల యభిరుచులను

వారి మనఃప్రవృత్తులను, తాత్కాలికములగు వేష భాషాదికములను వ్యంగ్యముగనో వాచ్యముగనో ప్రతి ఫలింపఁజేయుచునే యుండును. కథావస్తువునుబట్టి గైకొనిన పాత్ర లతీతయుగములకుఁ జెందినవారయినను వారిని జిత్రించునపుడు తనకు సమకాలికులయిన వ్యక్తుల మనోభావములను మాత్రమే నిరూపింప గలుగును. మానవబుద్ధి కందని విషయములను వదలివేసి నచో, అందెడివన్నియు గవి కాలమునాఁటివియే యగును. అతీతవిషయములను గూడఁ దివ్యయోగబలముచేఁ బ్రత్యక్షము చేసికొని కవిత సాగించిన వాల్మీకి వ్యాసుల రచనలందుఁ దక్క, తక్కిన కవుల రచన లలో కవి సమకాలిక విషయములే స్ఫురించుచుండు నని యాలంకారికులు వాకొనియున్నారు. ఈ దృష్టితో మనము శ్రీనాథుని రచనలను బరికించినచో వానిని కాలమునాఁటి వ్యక్తులకుఁగల భక్తి శృంగారభావ సామగ్రితోపాటు, నాఁటి వ్యక్తుల వేషభాషాభూషణ భంగియు నానాఁటి జనుల యభిరుచులు కవి మనో భావములును దెల్లమగును.

ప్రణయమతి లలితము. దాని నాస్వాదింపవలయు నన్న లలితమధురభావ సమ్మిళితమైన చిత్తవృత్తియు నావశ్యకము. ఉద్రేకము నుద్వేగముగల చిత్తముల కది యాస్వాదయోగ్యము గానేరదు. కవి హృదయము ద్రవీభావయోగ్యమైననాఁడే ప్రణయసంబంధి భావముల నాతఁడు మృదుమధురగతిని వెలార్పఁగలఁడు. రసికుఁడును భావుకుఁడు కూడఁ దదనుసంధాన యోగ్యమగు నంతఃకరణ వృత్తిగలిగినవాఁడే యాస్వాదించి యానందింపఁగలఁడు. అందును బరమేశ్వరాలంబన ప్రణయరూపమయిన భక్తిని భావించుటకు, తదా విష్కరణమునకు, తదాస్వాద జనితానందానుభవము నకు, విశిష్టమగు చిత్తసంస్కారమెంతేని కావలయును. కావుననే కాళిదాసాదుల కవిత సామాన్య చిత్త సంస్కారముగల వ్యక్తులకుఁ దలస్పర్శిగ నాస్వాద యోగ్యము కాదనియే చెప్పవచ్చును.

ఏ వస్తువునందలి సౌందర్యము నయినను కవి తన సూక్ష్మదృష్టితోఁ బరికించి, భావించి కావ్యముఖమున వెలార్చినపుడది సామాన్య వస్తువేయయినను విశిష్టవస్తువుగ గోచరించును. కవి కంటఁబడిన నీరసవస్తువుకూడ తద్భా వనాబలమున రసబంధురమే యగును. కవియా వస్తువును లోకము నెదుటఁ బెట్టినపుడు మఱింత మనోహరముగఁ గానవచ్చును. శ్రీనాథుఁడు తన కృతులలోఁ బ్రసక్తి వచ్చినపుడెల్ల ప్రాకృతిక సౌందర్యమును స్త్రీపురుషశరీర సౌభాగ్యమును సమవయోవస్థానురూపముగఁ జిత్రించు చునే వచ్చెను. అందును స్త్రీ సౌందర్యవర్ణన ప్రసక్తి వచ్చినపుడు కొంత యభిధానమును, ముఖ్యముగ పయో ధర పరిణాహ వర్ణనమునం దొక ప్రత్యేకతను బ్రదర్శిం చుచు వచ్చినాఁడని చెప్పవచ్చును.

సౌందర్యమనునది స్త్రీపురుష సాధారణమే యయినను కవులుమాత్రము స్త్రీ సౌందర్యవర్ణనమున గొంత ప్రణిధానమును వహించినట్లు కన్పట్టును. పురుషు లెంతటి సౌందర్యవంతులయినను వారిలోఁ సహజముగ గొంత మోఁటుదనమును, స్త్రీలెంతటి యనాకారులై నను వారిలోఁ గొంత లాలిత్యమును గానవచ్చును. కావునఁ గవుల రచనలు స్త్రీపక్షమునకే మొగ్గుచూపు చూ వచ్చినవి. ప్రత్యంగ సౌష్ఠవమును జిత్రించిన ఘట్ట ములలోఁ బురుషుల సంఖ్యకంటె స్త్రీల సంఖ్యయే హెచ్చుగా గానవచ్చును. సాధారణముగఁ గవులు స్త్రీ సౌందర్యమును వర్ణించు పట్టులలో కచకుచనితంబా భోగమును విశిష్టముగ వర్ణించుట యొక పరిపాటి. ఏ ప్రకరణమునం దయినను వానిని వదలకుండ చిత్రిం చుట శ్రీనాథునకొక యలవాటు ఇట్టి వర్ణనము రసిక జన హృదయమున కానందమును వికారిజన హృదయ మున కుల్లాసము నొదవించును. శ్రీనాథుని రచనలలో నిట్టివర్ణన లెడనెడ నుండుటను గాఁబోలు నాతని నొక శృంగార కవిగా లెక్కింతురు. కాని యాతని కృతులను సావధాన మతితోఁ బరికించినచో భక్తిభావ నిరూపణమునందే యాతనికిఁ బ్రణిధాన మేర్పడి యుండినట్లు లాతని కృతులు తార్కాణిం చును ఆ విషయము నిటఁ గొంత ప్రస్తావించెదను.

శ్రీహర్షుఁడు, నైషధీయచరిత మహాకావ్యము నందలి విశిష్టతను గూర్చి ప్రస్తావించుచు పదునొకండవ సర్గమునని.—

శ్లో॥ శృంగారామృతశీతగావయముగా దేకాదశ స్తన్మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గో నిసర్గో
జ్జ్వలః.
సం. నైష. 11 సర్గ.

అని వాఁడు. దీనినిబట్టి శ్రీహర్షనైషధ కావ్యము శృంగారరసరాశిని దెల్లముకఁజేయు చంద్ర

స్వరూపమని తెలియుచు చేయుచున్నది. తన్మూలముగ నీ కావ్యమున శృంగార రసభావము లతిమాత్రములు నగాధములునని స్ఫురించుచునే యున్నది. శ్రీనాథుఁడు తా నాంధ్రీకరించిన యీ నైషధకావ్యము తుదిని — "భట్టహర్ష మహాకవీశ్వరుఁ డొనర్చిన నైషధ శృంగార కావ్యప్రబంధ విశేషంబున విశేషమనీషి హృదయంగమంబుగా శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబునఁ జెప్పఁబడిన యీ భాషానైషధకావ్యంబు" అని వాకొని యున్నాఁడు. ఈతని ప్రసంగమునుబట్టియు నైషధకావ్యము శృంగార రసవారిధియనుట స్పష్టము. ఇట్టి యీ కావ్యమున శ్రీనాథుఁ డౌచిత్యమును పాటించి శృంగార రస భావముల నెంతగాఁ బ్రపంచించిన నబ్బురపడ నక్కఱలేదు. ఇట్టి శృంగార రసమయకావ్యమందు సైతము నదను చూచుకొని తనకుగల భక్తి భావమును వ్యక్తముచేసి యున్నాఁడు. తద్భక్తి కరణ మెంత విలక్షణ విషయము. అదియు పరికింతము.

దమయంతీ స్వయంవరమునకు రాజు లందరును సమావిష్టులైనపుడు వారివారి కులగోత్రాదికమును వివరించు వారెవరని చింతించి, భీమ భూపతి, తన కులదైవతమగు శ్రీహరిని మనసార నొకమాఱు స్మరించును. వెంటనే విష్ణువు సరస్వతి నాపని నెఱవేర్పు దానిగా నియమించును. విష్ణు నానతిని సరస్వతి సభాస్థలి కవతరించును. శ్రీహర్షుఁడు తన వాక్కులతో వాగ్దేవతా స్వరూపమును వర్ణించును. ఈయదనున శ్రీనాథుడు భీమ భూపతిచే సరస్వతీదేవిని స్తుతింపజేసియున్నాఁడు. ఆ స్తుతి ఆంధ్రభాషాప్రకృతిలో కలఁకల నాదముతో నడచిన సంస్కృత భాషామయమైన యొక దండకము. దండకమునందలి విషయము శ్రీహర్ష నైషధ శ్లోక సారరూపమే యయినను మధుర నాదానుసంధానముగ విలక్షణమై యొప్పారినది. దండకము తుదినున్న యీ క్రింది పంక్తులు మాత్రమే శ్రీనాథ స్వకపోల కల్పితములు. అరదన యిట్లు సాగినది—

"నమ స్తేస్తు కైవల్యకల్యాణిసీమ్నే
నమ స్స్వర్గగీర్వాణ చూడామణి
శ్రేణి కోణ ప్రభాజాల బాలాతప
స్మేర పాదాంబుజాయై నమ స్తే
శరణ్యే, నమ స్తేవరేణ్యే, నమశ్శా
రదాయై, నమో సర్వదాయై
నమశ్శాశ్వతాయై నమోవిశ్రుతాయై,
నమ స్తే నమ స్తే నమః

నైష. 4. 1 38.

ఈ విధముగ మూలమున సరస్వతీ వర్ణనమాత్ర పరములైన శ్లోకములను దండకముగా సంతరించి, శ్రీనాథుడు శారదాంబయెడఁ దనకు గల భక్తిభావము నావిష్కరించి యున్నాఁడు. దండక రచనము సామాన్యముగ దేవతాస్తుతి కుద్దిష్టమైనది. అందు నీ దండకమున సమకూర్చిన పదజాలమంతయు భక్తి భావసముద్దీపకమై యొనరారినది. అందలి యొక వాక్యము పరికింపుము—

"జయ జయ జనయిత్రి కల్యాణ సంధాత్రి, గాంధర్వ విద్యాకళాకంకణాలాం, త్రివేదీ వలీం పార సాహిత్యసౌహిత్య నిర్వర్తిత ప్రోల్లసద్వృత్తి రంగా, మనే కాభిచార క్రియా హోమధూమావళీ మేచకా ధర్వణామ్నాయ రోమావళీం, కల్పశిక్షాక్షరా కల్ప సాక్షాద్భ్రిరిత్రాం నిరుక్తప్రసూనాక్షిం భుజ ద్వంద్వతా మప్యుపానేన సంశోభితాం, ఛందసాం జాతి వృత్తి ప్రభేద ప్రభిన్నాన విద్యామయీం త్వాం భజే".

నైష. 4 138.

ఇట్టి దండక విషయమంతయు విద్యాస్వరూపిణియైన శారదా స్తవరూపము. ఈ దండకము తరువాతఁ గూర్చిన పద్యము శ్రీనాథునకు శారదాంబిక యెడఁగల భక్తి భావమున కుపష్టంభకము.

మ. జగతీనాథుని ముందట న్నిలిచె సా
క్షాత్కారముం బొంది యా
జగదేక స్తవనీయ శారద శర
చ్చంద్రాతపాలోకము
న్నగవుం జేటయు దివ్యదేహరుచియు
న్నమ్మేళనంబొంది చె
ల్వగుమండం గరుణాపరాయణత న
య్యాస్థాన మధ్యంబునన్.

నైష. 4. 140.

ఈ విధముగనే నలుఁడు ప్రాతస్స్నానమునకై మిన్నేటి కేఁగినపుడు అవకాశము కల్పించుకొని గంగాభవాని నగ్గించియున్నాఁడు. ఈ రచనయు భక్తిభావ పరీతమైనది. దీనికి మూలము లేదు.

"వీఁగి యాట మహానట జటాటవీ వాటి వసతి సించి, నభోపేక్ష మేధ్య భూతంబగు స్వర్ధుని మండలం బొంది కొనుచు శింశుమారా కారంబు నందార కా మూర్తియై పవ్వళించిన పాంచజన్యపాణి చరణపల్లవంబుఁ బ్రక్షాళించుచు, సౌమార్కమయ మహాసౌధ సంఘంబులం బ్రదక్షిణించిపరి వహ పవన స్కంధ సంపాతంబులం దూఁగి సోలాడు కరళ్ళదప్పళ్ళ దిక్పటంబుల నాస్ఫాటింపఁ బ్రదీప్త లలాటికా తిలకంబును నరక పుర గోపుర ద్వార దంతార్గళియును, నారాయణ చరణారవింద మకరంద బిందునిష్యందంబును, బుంజ టీకధిత కమండలు తీర్థధారయు నైన యమ్మహానదిఁ గాని ...యొక్క రేవున డిగ్గి".

— నైష. 8 28.

ఈ వచనమున శ్రీనాథునకు గంగానదీమతల్లియెడఁ గల భక్తిభావము ప్రస్ఫుటమగుచున్నది. ఈ వచనము తరువాత నొక సీసపద్యమున నలుఁడు గావించిన స్నానాది నిత్యకృత్యములు వర్ణింపఁబడినవి. ఆ రచనలో నాతని నాఁటి శివభక్తుఁడైన ధార్మికుని మూర్తి మూపటును. ఇదియు మూలము నపేక్షింపక వ్రాసినదియే.

సీ. అత్యంత నిష్ఠతోఁ బంచాంగంబు పఠియించె
అఘమర్షణ స్నాన మాచరించె
దైవతఋషి పితృతర్పణం బొనరించె
సంధ్య నారాధించె సవితఁ గొలిచె
గాంగేయ వాలుకా లింగమూర్తిని నిల్పి
కాంచన పద్మములఁ బూజించె శివుని
పారిజాతక లతా పల్లవాగ్రంబులు
చిదిమి యొయ్యన మేపెఁ ద్రిదశగవికిఁ
గేలుదోయి మోడ్చి యాదటఁ గేలు గొలిపి
గగన మునిరాజులైన చుక్కలకు మ్రొక్కె
దివ్యరథ మెక్కి వేగ యేతెంచె నరుల
నధిపుఁ డిట్టు సురనది తీర్థయాత్ర సలిపి.

— నైష. 8.29.

పంచాంగము పఠించుట, అఘమర్షణ మంత్ర పఠన పూర్వకముగ స్నానమాచరించుట, స్నానాంగముగ దేవఋషిపితృతర్పణము సేయుట, సంధ్య వార్చుట, మార్తాండోపాస్తి నెఱపుట యను నివి శ్రీనాథుని నాఁడు ధార్మికుఁడైన గృహస్థు నెఱపెడి యవశ్యకర్తవ్యకృత్యములు. కావున శ్రీనాథుఁడు నలునిచే వానిని నెఱపించినాఁడు. శ్రీనాథుఁడు శివభక్తుఁడు కావున నలునిచే వాలుకా లింగమును నిలిపించి, కాంచన పద్మములచేఁ బూజగావింపఁజేసినాఁడు. పారిజాతపల్లవములు త్రుంపి కామధేనువునకు మేఁత పెట్టుట, నక్షత్రములకు నమస్కారము సేయుట, యనునివి సామయికాచారములు. ఈ వర్ణనబట్టే శ్రీనాథుని మూర్తిగాని, యానాఁటి ధార్మికుఁడైన శివభక్తుని మూర్తిగాని మనయెదుటఁ జూపట్టును.

ఇటులనే నలుఁడు శివపూజాగృహమునకుఁ బోవునప్పటి యాతని యాకృతిమూలమును మీఁది వానికి సీసపాదములలో వర్ణింపఁబడినది. ఈ రచనలో శ్రీనాథుని నాఁటి శివభక్తుని వేషము మనయెదుట గోచరించును.

సీ. సీమంత మేర్పడఁ జికురభారము సు
స్నిగ్ధబంధంబుగ శిఖ యమర్చి,
కన్నెరుఁ బూచాయఁ గనుపట్టు జిలుగైన
వలిప కౌశేయవస్త్రంబు గట్టి,
చంద్రాతపములోన చరియైన వెలిపట్టుఁ
బుట్టము తిరవాసముగ ధరించి,
ప్రశస్తిశీతములైన పదియూఱు వన్నియ
కనకంపుఁగోడునుఁ బాగాలు దొడిగి,
శైవుఁడైన బ్రాహ్మణ బ్రహ్మచారి యిచ్చు
హస్తము నలంబనంబుగ నల్లనడచి
నియతి మౌనవ్రతంబుతో నృపతిసార్వ
శాంతచిత్తుఁడై దేవపూజాగృహంబు.

— నైష, 8—103.

ఇది శ్రీనాథుని నాఁటి శివపూజాధురంధరుఁడు దాల్చెడి వేషముగా నోపును. కాని నాఁడు మూలములో లేని విషయ మింతగఁ బ్రసంగింప నేల? కావున్న శివపూజావసరములందు శ్రీనాథుని మూర్తి యేని యిట్లుండనోపును.

ఇట్లే మూలములో శ్రీహర్షుఁడు నలునిచే శివపూజ చేయించునపుడు కుత్తూరములు నాగకేసరములు మల్లికుసుమములు మాత్రమే యుపయోగింపఁగా, శ్రీనాథుఁడింతటితోఁ దృప్తిఁజెందక శివప్రీతికరములైన పత్రపుష్పముల నన్నిటిని శివున కర్పింపఁ జేసియున్నాఁడు.

సీ. ఖట్వాంగపాణిఁ జెంగల్వపుష్పంబుల
ఫాలలోచను బిల్వపల్లవముల
నాగేంద్రకేయూరు నాగకేసరముల
బాలేందుకోటీరుఁ బాటలములఁ

కుసుమకోదండారిఁ గుందవర్ధనములఁ
గాంధవాదలచాపుఁ గాంచనముల
వంచికాహృదయేశు నసితాంబుజంబుల
దక్షాధ్వర ధ్వంసి దమనకముల
బొండుమల్లియ విరిదండ ఖండేందుపరశు
నఖిల సురపార్శ్వగ్రామ దూర్వాంకురముల
బంతి శ్రీవత్సలాంఛన ప్రాణబంధు
శివుని చేమంతి బంతిఁ బూజించెనతఁడు

—నైష. 8. 107.

పూజా పుష్పముల వింతగ విపులీకరించుట శ్రీనాథునకుఁ జంద్రశేఖరునిపైఁ గల భక్తిభావమును ప్రపంచించుటకే...యని విదితమగుచున్నది. ఇటులనే పూజోపచారాదిసమర్పణ విషయమునందును విశేషములను ప్రదర్శించియున్నాఁడు

సీ. పద్మాసనస్థుఁడై భావించె మానస
కమల కర్ణికయందుఁ గాలకంఠుఁ
బంచాస్యు ప్రోల జపించెఁ బంచబ్రహ్మ
పంచాక్షరంబులఁ బరమనిష్ఠ
భక్ష్యభోజ్యాదిక బహుపదార్థంబుల
నతిథి క్షితిఁగొలిచె రాజార్ధమౌళి
రాజదేవోపచార ప్రకారంబుల
నతిథి క్షితిఁగొలిచె రాజార్ధమౌళి

నైష. 8-110.

పద్మాసనాసీనుఁడై మానస కమలకర్ణికయందుఁ గాలకంఠుని భావించుట, పంచాస్యుని ప్రోల పంచబ్రహ్మ పంచాక్షరీ మంత్రములు జపించుట బహుపదార్థములు విరూపాక్షున కుపహారమిచ్చుట, రాజశేఖరుని రాజోపచారదేవోపచారముల నతిథి క్షితిఁ గొలుచుట యను నివి శ్రీనాథుని నాఁటివి, యీనాటివి కభిమతములైనవి యగు పరిపాటులు. ఆదను గుర్తించి వాని వదికించుటలో శ్రీనాథునకుఁ గల భక్తిభావము వ్యక్తమగుచున్నది.

స్వయంవరానంతరమున సరస్వతీదేవి నలునకు చింతామణి మంత్రము నుపదేశించును. అప్పటి సరస్వతీదేవతా స్వరూపమును మూలములో లేనిదానిని సంతరించియున్నాఁడు. ఈ వర్ణనము శ్రీనాథునకు వాణియెడఁ గల భక్తిభావమును వ్యక్తము చేయుచున్నది. ఇదియొక సీసపద్యము. దీనికి మూలము శ్రీహర్షకృతిలో లేదు.

సీ. కబరికాభరము పైఁ గప్పు గేదఁగి పువ్వు
రేకుతోఁ గూడ శశిరేఖఁ బోదివి
లలిత కస్తూరికా తిలక మధ్యంబున
సొబగారు ముత్యాలచుక్క నిలిపి
కుచములు నిండిన మించు గుబ్బ చన్నులమీఁద
జిలుగు దువ్వలువఁ గంచెలయుఁ దొడిగి
యచ్చ వెన్నెలచాయ నవఘళింపఁగ జాలు
నిద్దంపు వలిపట్టు నెఱిక గట్టి
యంచ కోదములఁ బూన్చిన యరద మెక్కి
యుపనిషద్వీధి విహరించుచున్న నన్ను
మహిత చింతామణీ దివ్యమంత్ర మూర్తిఁ
దలఁప భారస్వతం బయత్నమునఁ గలుగు.

—నైష. 6. 22.

ఈ పద్యమునుబట్టి శ్రీనాథున కుపాస్యదైవ శారదామూర్తి యిట్టిదని తెలియవచ్చుచున్నది. కవితాస్ఫూర్తి నపేక్షించువారికి నిట్టి బ్రాహ్మీస్వరూపము నతఁడు ధ్యానించువాఁడనికూడ మనకెఱుఁగవచ్చును.

ఈ ప్రకరణమునందే శ్రీహర్షుఁడు చింతామణి మంత్ర ప్రభావమును దెలుపుచు నొక శ్లోకమును రచించియున్నాఁడు. శ్రీహర్షుఁడు చింతామణి మంత్రోపాసకుఁడగుటచే వానిని భావనలోఁ దివ్యమంత్రము చింతితార్థస్ఫోరకము. అది శివశక్త్యభేద భావనాత్మకము; లక్ష్మీనారాయణ స్వరూపానుసంధానాత్మకము; మంత్ర తంత్ర స్వరూపానుసంధాన స్వరూపమునై యున్నది. ఈ విషయము నంతయు నారాయణీయ వ్యాఖ్యయందు వివరింపఁబడియున్నది. ఆ శ్లోక మిది—

శ్లో. అవామా వామార్ధే సకల ముభయాకార ఘటనా
ద్ద్విధాభూతం రూపం భగవదభిధేయం భవతి యత్
తదన్తర్మన్త్రం మే స్మరహరమయం సేన్దు
మమలం
నిరాకారం శశ్వజ్జప నరపతే! సిద్ధ్యతు సతే.

—సం. నైష. 14-88.

ఈ శ్లోకమును శ్రీనాథుఁ డిట్లనువదించియున్నాఁడు.

మ. సకలంబై హిమరుక్కళాభరణమై
సవ్యాప సవ్యార్ధ యు
గ్మకరూపంబయి శైవమై గతి శకం
కంబై శివంబై యుపా

ఏక చింతామణియై ప్రసిద్ధ భగవ
త్పద్మాభి ధేయార్థమై
యొక మంత్రంబు మదీయ మొప్పునది నీ
కుర్వీశ యే నిచ్చితిన్.
—నైష. 6-18.

ఈ పద్యమున శ్రీనాథుని శివభక్తిపరత వ్యక్త మగుచున్నది. మంత్రములు అత్రిద్విజాక్షర సంపుటీకరణమున నుపాసకాభిమతముగ వివిధార్థ స్ఫోరకములై యొప్పలారుచుండును. కావున శ్రీనాథునకీ చింతామణి మంత్రము పార్వతీ పరమేశ్వర స్వరూపానుసంధానాత్మకమై భాసించినది.

ఈ విధముగ శ్రీనాథుఁడు శృంగార రసవారినిధియైన యీ యాంధ్ర ప్రబంధమునందుఁ దనకుఁ గల శివభక్తిపరతను వ్యక్తము చేసియున్నాఁడు. ఈ తెలుఁగు సేతలో శ్రీనాథుఁడు శృంగార రసభావములు వర్ణించు పట్టులందుఁ దనకుఁగల భావాభినివేశమును వ్యక్తము చేయకపోలేదు. శ్రీహర్ష నైషధమునందలి భావములను పెంచియుఁ ద్రుంచియు ననువాదము సాగించియున్నాఁడు. మూలముతో సరిపోల్చి చూచిన నీ విషయము వ్యక్తమగును.

నలుఁడు దేవేంద్రాదు లొసఁగిన శాంబరీ విద్యా ప్రభావమున దమయంతి యంతఃపురమునకుఁ బోయి నపుడు అంతఃపురాంగనలు గావించిన చమత్కారములను మూలమున వర్ణించియున్నారు. ఆంధ్రీకరణమున శ్రీనాథుఁడు వాని నెట్లు వివరించెనో కనుఁగొందము. మూలమునం దంతఃపురాంగనల చేష్టలిట్లు లారంభింపఁబడినవి.

శ్లో. అంతఃపురాంతః స విలోక్య బాలాం
కాంచి త్త్వరాలబ్ధు మసంవృతోరుమ్,
నిమీలితాక్షః పరయా భ్రమంత్యా
సంఘట్ట మాసాద్య చమచ్చకార.
సం. నైష. 6-13.

దమయంతీదేవి యంతఃపురమున నొక బాలిక వలువ వెట్టుకొనుటకై యనాచ్ఛాదితమైన యూరువులు గలిగియుండుట చూచి, నలుఁడు కన్నులు మూసి కొనెను. ఇంతలో హేలగఁ దిరిగెడి మఱియొక బాలిక వచ్చి రాపాడెను. దానికి నలుఁడు డబ్బురపోయెనని ఈ శ్లోకభావము. ఈ శ్లోకమునందలి "అసంవృతోరుమ్" అను విశేషణము వ్యంగ్యభంగిచే రాజు కనులు మూసి కొనుటకుఁ గల కారణమును దెలిపినది. ఆ భావమును శ్రీనాథుఁడు మఱింత నిగూఢము చేయుచు మఱికొంత చమత్కరింపఁ జేసినాఁడు.

చ. ప్రిదిలినచీరఁ గేల సవ
రించు తలోదరి నొర్వఁ గాంచి లోఁ
గదిరిన పాపభీతి బెసఁ
గన్నులు మోడ్చి పోక నొక్కొకర్తుకై
యెదురుగ వచ్చి వచ్చి యొక
యిద్దరు ముద్దియ లొత్తి రవ్విభున్
మదగజరాజకుంభముల
మచ్చరికించు కుచద్వయంబునన్.
నైష. 3-86.

రాజు కన్నులు మూసికొనుటకుఁ గారణము నగ్నయైన స్త్రీని జూచుట పాపమని. అట్టి నగ్నత్వ మేర్పడుటకుఁ గారణము సంస్కృత మూలమున నొక బాల యుద్వర్తనమునకై యనాచ్ఛాదితోరువై గాన వచ్చుట. ఇచట సడలిపోయిన పోకముడిని గేల సవరించుకొనుచుండఁగాఁ జూచుట రెండిటను వ్యంగ్యభంగి సమానమే. కన్నులు మూసికొనిన వెనుక నేర్పడిన స్త్రీ ఘర్షణమును మాత్రము శ్రీనాథుఁడు కొంచెము విశేషము చేసినాఁడు. అదియిద్దరు ముద్దియ లేనుఁగు కుంభములవంటి కుచములతో నొత్తుట యనునది. మఱియొక శ్లోకమునందలి భావమును జమత్కృతి విశేషమునకై యిచట పలికించియున్నాఁడు.

శ్రీనాథుఁడు శృంగారముగ స్త్రీ వర్ణనము గావింపవలసి వచ్చినపుడు కుచతటమునందేదియో యొక విశేషమును గాన్పింపఁజేయకమానఁడు.

ఈ క్రింది పద్యము పరికింతము.

ఉ. పోరణగండి మార్గమునఁ
జొచ్చిన సన్నని గాలి యొక్క యం
భోరుహపత్ర నేత్ర మనుఁ
బొంకపుఁ జన్నులమీఁది సన్నపుం
జీరచెఱంగు వాయుగిలఁ
జేసిన విశ్వధరాతలేశ్వరుం
డోరయొనర్చెఁ బాపభయ
ముంచి నిజానన చంద్రబింబమున్.
—నైష. 3-89.

ఈ పద్యమునకు మూలవిశ్లోకము—

పశ్యన్నతిస్మ వ్యస్మృతౌ పీతవాససః
సైనా పరిస్పృష్టమివాత్ర వస్త్రే
అస్తాంతి పస్తాంతమృగాంక మాస్యం
దధార తిర్యగ్వలితం విలక్షః.

—సం. నైష. 6-18.

వాయువుకూడ నా యంతఃపురాంగనల స్తనములు తాకుటకై, యదటి వస్త్రమును దొలగింపగా జూచి, నలుడు సిగ్గుపడి చంద్రబింబముఁబంటి తన ముఖము నోరజేసికొనెనని భావము. వాయువునకు గూడ ముద్దుటగొలుపునవి యా యువతి స్తనము లనుట వ్యక్తమగుచున్నది. కాముకులు రహస్యక్రీడకుఁ గడగు నపుడు చంద్రుఁడు మాటువడియుండుట యుక్తమను విషయ మిట ధ్వనించుచున్నది. ఈ భావమును శ్రీనాథుడు తన యనువాదమున మఱింత సరసము చేసినాఁడని చెప్పవచ్చును. వాయువను విటుఁడు పొరగండి మార్గమునఁజొచ్చి యంతఃపురాంగనల కుచములమీఁది సన్నని పైటచెఱఁగు వాయుగిలఁజేయఁగా భూతలేశ్వరుఁడగు నలుఁ డదిగాంచి, పాపభీతుఁడునై దనముఖము నోరఁజేసికొనెనఁట. ఇచట పొరగండిమార్గమునఁ గవ్యాంతఃపురమునఁ బ్రవేశించినది సన్ననిగాలి. అది యొక యందగత్తె పొంకపుఁజన్నులమీఁది సన్నని చీరచెఱంగుఁ బాయుగిలఁ జేసినది. ఇట్టి యావిటుని రహస్యక్రీడ కంటఁబడుటచే విశ్వపాలకుఁడగు నలుఁడు పాపభీతిచేఁ దన ముఖచంద్రు నోరఁజేసికొనెనుటలో భావ మొక కొంత మధురమైనది.

ఈవిధమైన యనువాద సరణిలో నసౌచిత్య పరిహారమునకుగా మూలములోనుండిన విషయముల నె కొన్నిటిని వదలివేసినాఁడు. ఈ క్రిందిశ్లోకము నాంధ్రీకరింప లేదు.

శ్లో. దోర్మూల మాలోక్య కదంబ కుత్నో
స్తతః పచా తా వనులేపయంత్యాః
నా భీమ నైషశ్లథ వాససోను
మిమీల దిక్షు క్రమకృష్టచక్షుః

—సం. నైష. 6-20.

జుట్టు ముడివైచుకొను నామె కక్షములను, మైపూఁత పూసికొను వనిత కుచములను, కట్టుబట్టవిడిన యామె నాభిజూచి, దిక్కులన్నిటినుండి చూపు మరలించి నలుఁడు కన్నులు మూసికొనెనని యీ శ్లోకభావము. పై మూఁడు విషయములు జుగుప్సాకరములని యెంచి కాఁబోలు శ్రీనాథుఁ డనువదించుట మానినాఁడు. ఈ ప్రకరణమునందే మఱియొకచోట నౌచితినిబాటించి మార్పు చేసినాఁడు.

చ. ఉరకటి వేఁగుచోట నొక
యుగ్మలి యొల్లె చెఱంగు మీఁది నీ
శ్వరుని భుజా విభూషణము
వజ్రములం దవులంగఁ జాఱినన్
విరిసెను నీవిబంధ మది
విస్మితమందఁగఁ దోడిభామినుల్
పరిహసనం బొనర్పఁ బతి
పాపభయంబునఁ గంప మొందఁగన్.

—నైష. 3-94

శ్లో. సంఘట్టయంత్యాః స్తరసాత్మభూషా
హీరాంకుర ప్రోత దుకూల హారీ
దిశా నితంబం పరిధాపయతన్వ్యాః
స్తత్పాప సంతాప మవాప భూపః.

—సం. నైష. 6-28.

ఒక తన్వివలుని రాపాడఁగా నాతని భూషణము నందలి వజ్రాంకురములం దాకినతె కట్టువస్త్రము దసలొ్కెను. రాజామె కటితటమును దిగంబరముగఁజేసి, తత్పాపమునకు సంతాపము నందెను. ఈ శ్లోకభావము ననువదించుటలో శ్రీనాథుఁడు కటితటమును దిగంబరముగఁ జేయుట మానివైచి, యామె నీవిబంధము సడలింపఁజేసి, యాతన్వికి యాకస్మిక సంఘటనముచే విస్మయమును, తోడిభామినులకుఁ బరిహాసము చేయుట కవకాశమును, పాపభీతిచే నలునకుఁ గంపమును, గలిగింపఁ జేసినాఁడు. సిద్ధించిన ప్రయోజనము సమానమే యయినను శ్రీనాథుఁడు గావించిన మార్పులో వ్యంగ్యభంగి సున్నితమై యొప్పలారినది. ఇచట నీవిబంధము సడలుట వజ్రములం దొల్లె చెఱఁగు దగులుట మూలమునఁ దటస్థించెను గావున రాజునకీ విషయమునఁ బ్రసక్తిలేదు. పాపభయమున నాతఁడు కంపించుటమాత్ర మధికము.

నలుఁడు రాజమార్గమునఁబడి వివాహ మండపమున కేఁగునపుడు పౌరాంగనలు వెలార్చిన శృంగార భావములను మూలమునకంటెఁ గొంత కొంత యధికము చేసి చమత్కరించియున్నాఁడు. ఆ యా పట్టులలో నాతని భావాభివిష్కృతి వ్యక్తమగుచున్నది.

మ. జిలుఁగుంబయ్యెద జీరువాఱ యొసలన్
—శృంగారి పత్త్రాంకురం

ములతో నొక్క చకోరలోచన కుచం
బుల్ పూర్ణకల్యాణ మం
గళ కుంభంబులు నూత్న పల్లవ విధిం
గ శ్రీ సమేతంబులై
వ లలిం జెన్నొ సలారె నైషధ మహీ
నాథావలోకంబునన్.

—నైష. 6.67.

దీనికి మూలశ్లోక మిది.

శ్లో. అజానతీకాపి విలోకనోత్కా
సమీర ధూతార్ధ మపి స్తనాంశుకమ్,
కుచేన తస్మై చలతే౽కరోత్పురః
పురాంగనా మంగళ కుంభ సంభృతిమ్.

—సం. నైష. 15.74.

ఒక పౌరాంగన నలునిజూచు వేడుకలో వాయువుచే దన స్తనాంశుకము సగము తొలఁగింపఁ బడినను కనుఁగొనక, కదలుఁడై వెడలు నలుని కెదురుగఁ దన కుచమును మంగళపూర్ణ కుంభముగఁ గూర్చెనని శ్లోక భావము. ఇఁక శ్రీనాథుఁడీ భావమును బొడిగించిన తీరు పరికింతము. ఒక చకోరలోచన నలమహారాజును జూడఁబోయెడి తొందరలో జిలుఁగు పైఁట జాఱిపోగా మకరికాది పత్త్రాంకిత మయిన యామె కుచములు నూత్న పల్లవములతోఁ గూడిన మంగళకలశములుగా నొసలారిన వఁట. మంగళ కలశ మొక్కటియే గాకుండుటకు, వానిని నూత్నపల్లవ సమేతములుగావించుటకు, వాయువుచే నర్ధభాగమును మాత్రమే తొలఁగింపఁజేయక, పైఁటను కుచతటము నుండి ప్రక్కకు జీఱువాఱఁజేసినాఁడు. అట్లు జీఱువాఱుటకు నైషధమహీనాథావలోకనమును గారణముఁ గావించినాఁడు. ఇది యొక మధురసన్నివేశము.

అదియునుగాక శ్రీనాథుఁడు స్త్రీవర్ణనము చేయవలసివచ్చినపుడు కుచతటము నెపట వర్ణించిన నేది యొక విశేషము పరికింపకమానఁడు. ఈ క్రింది పద్యమును మూలములేకుండఁగనే సంతరించియున్నాఁడు.

గీ. ఎల్ల చిగురాకుబోండ్లకు నెంత వేడ్క
యంత వేడుక దనలోన నతిశయిల్ల
నొక్క గుబ్బల కొమరాలు చక్కవచ్చి
కవిసె నొసలెల్లఁ గన్నులై మనుజవిభుని.

—నైష. 6.66.

చూడవచ్చినది గుబ్బల కొమరాలగుటచేఁ గాఁబోలు నందఱ యువతులకుఁగల వేడుక దానొక్కతెయే దాల్చి యొడలెల్లఁ గన్నులుచేసికొని, యా మనుజవిభుని జూచెనని వర్ణించియున్నాఁడు. ఇటులనే మూలములో లేని యంశములు గొన్ని జతగూర్చు పట్టుల—

"భూ, భవదేవేంద్రుని జూచె హేమకలశ
ద్వైరాజ్య సంపత్తిచే
భవసంభృత్కుచ కుంభపీఠిఁ బులక ప్రారంభమే
పారఁగన్."

అని యొక యువతికి నలుని జూచు వేడుకలో కుచకుంభ పీఠములఁబులకాంకురముల రేకెత్తించియున్నాఁడు.

మఱియు సంస్కృతనైషధమున నలుని గవాక్షములోఁ జూచెడి వనితా విలాసముల, వాటిని వివాహయాత్రలోఁ గానవచ్చిన మంగళద్రవ్యములనుగా వర్ణించియుండ, వానిని బ్రపంచించి క్రంత సాగించినాఁడు శ్రీనాథుఁడు.

శ్లో. లసన్నఖా దర్శ ముఖాంబుజస్మిత
ప్రసూన వాణీ మధుపాణిపల్లవమ్
యియాసతి ప్రస్య నృపస్య జజ్ఞిరే
ప్రశస్త వస్తూని తదేవ యోషితః.

—సం. నైష. 15.76

శ్రీహర్షుని సంయోజనమున యువతుల నఖములద్దములు. ముఖములు పద్మములు. మందహాసములు పూవులు. వాక్కులు తేనెలు. పాణులు పల్లవములునై యపర వాయువతీ సమూహమే మంగళవస్తుసముదాయమైనది.

సీ. కలికి చూపులు రత్నకలికా కలాపంబు
గుబ్బచన్నులు హేమకుంభవితతి
మెఱుఁగుఁ జెక్కులు క్రొత్త మించు టద్దంబులు
పాణి యుగ్మంబులు పల్లవములు
వెలఁది మందస్మితంబులు కమ్మఁబువ్వులు
పలుకులు వల్లకీ కలకలములు
పరిపాటలోష్ఠబింబములు తేనితొలల్
తను కాంతి సోగల గందంపుఁ బసుపు
గాఁగ సౌభాగ్య విధిన మంగళ పదార్థ
వరములు గ్రంతినగుచు భావంబులోఁ జెఁ
జారకాంతలు రాజకుమార దర్శ
నోత్సవంబున కేతెంచుచున్న యపుడు.

—నైష. 6.68.

ఈ క్రంత నీవిధముగ సాగించుటకు వలయు మంగళసామగ్రిని సమకూర్చుటలో శ్రీనాథుని నాఁటి వైవాహిక పరిపాటి మనకు వ్యక్తమగుచున్నది. ఈ విధముగ శ్రీనాథుఁడీ నైషధానువాద సరణియం దచటఁ గాని శృంగారరస భావముల నభివ్యక్తము సేయునపుడు కేవల మూలానుసరణమునే పాటింపక, తద్రస సామగ్రిని దన యభిరుచి ననుసరించి, కొంతకొంతఁ విపులీకరించియో, లేక సంక్షేపించియో రసాభినివిష్ట మతియై రచన సాగించియున్నాఁడు.

# విషాదం పొంగి పొర్లింది

**శ్రీ జనస్వామి కోదండరామశాస్త్రి**

కొబ్బరి బొండంలాంటి మన్నటితల చివర పిలక జుట్టు వ్రేలాడుతూండగా కొంటెతనంగా గంతులు వేస్తూ ఆనందపరవశుడైపోతూన్న ఆరేళ్ళ వయసుగల చెయిన్లను చూసి గుమ్మంలో నిలబడివున్న మీనాక్షి "దురదృష్టవంతులము! తన ఆటపాటలకు ఎంతో ఉబ్బొంగిపోయి ముద్దూ, మురిపెం చూపగల్గిన తండ్రిని శైశవంలోనే కోల్పోయాడు" అని మనసులో అనుకుంటూ కంట నీరెట్టుకుంది. న్యాయవాది వెంకటనరసింగరావుకు చాలా కాలమువరకు సంతానము లేదు. భార్యాభర్త లిరువురు సంతానముకొరకు ఎంతో పరితపిస్తూ అనేక వ్రతములు, దానధర్మములు జరిపారు. చివరకు ఒక పురుష శిసువు జనించాడు. తన పితామహుని పేరు నిలపదలచి వానికి 'చెయిన్లు' అని నామకరణంచేసి ఎంతగానో తృప్తిపడ్డాడు నరసింగరావు. కాని వాడి పసితనంలోనే అతన్ని అకాల మృత్యువు పొటన పెట్టుకున్నది. నరసింగరావు మంచి పేరు ప్రతిష్టలు రాబడీగల వకీలు. అయినప్పటికీ దానధర్మబుద్ధిగలవాడు కావడంచేత అతను సంపాదించిన ఆస్తి అతని అనంతరము విశేషముగా నిల్చింది కాదు. నరసింగారావును దూషించేవారు ఒక్కరు కూడా ఉండకూడదనే తలంపులో, అతని భార్య మీనాక్షి కొన్ని బాకీలనుంచి తేలికగా తప్పించుకునే మార్గాలను ఎంతోమంది ఎన్నోవిధాలుగా ఉపదేశించినప్పటికీ వాటిని చెవిని పెట్టుకోక 'నాఒక్క బిడ్డ యీమిగిలిన ఆస్తిని అనుభవిస్తేచాలును' అనుకుని నిశ్చింతగా స్థిరచరాస్తులను కొన్నింటిని విక్రయంచేసి బాకీలన్నిటిని పూర్తిగా తీర్చివేసింది. ఇక ఒక చిన్న మేడ, కొద్దిగా మాగాణిభూమి మిగిలింది. ఆస్తిపోకడకై ఆమెకు చింతపట్టలేదు. 'చూడబోతే వీడిది కొంచెం కొంటెస్వభావంగా తోస్తోంది. ఈ ప్రపంచంలో వీడు ఎలాబ్రతికి బట్టకట్టగలుతాడో' అని ఎప్పుడు తనకుమారునికొరకు విచారపడుతూండేది మీనాక్షి.

చెయిన్లు తలిమాట లెఖ్కచేసేవాడు కాదు. ఎపుడూ ఏకాధింగా అల్లరిచేస్తూండేవాడు. ఇరుగు పొరుగు అమ్మలక్కలు మా అబ్బాయిని కొట్టాడనో, మా అమ్మాయిని తిట్టాడనో యీరకంగా మీనాక్షితో చెబుతూండేవారు. మీనాక్షి వాణ్ణి ఒళ్లో కూర్చోపెట్టుకుని ఎన్నో సదుపదేశాలు చేస్తూండేది. అవేవి ఆ పసిహృదయంలో పనిచేయలేదు. చిరాకు ఎంతో విసుగుదల పొంది ఒకదెబ్బ వెయ్యాలని హస్తము ఎత్తగానే తనభర్త స్వరూపం మనసులో తొణికిసలాడటము, ఆ వెంటనే హస్తము క్రిందకు దిగిపోవటమూ జరుగుతూండేది.

చెయిను పాఠశాలలో ప్రవేశించి ఆరుమాసాలయింది కాని అక్కడ హాజరవటం మాత్రము పదిహేను దినములుమాత్రమే. పంతులుగారికి జీతం కాపరు పైకంమాత్రము ప్రతినెలా ఒకటో తారీఖు యింకా నాలుగురోజు లున్నదనగానే మీనాక్షినుండి ముట్టుతూవుండేది. 'అమ్మా బళ్ళోని పిల్లలందరూ ఎగతాళి చేస్తూన్నారు. ఈ పిలకజుట్టు తీయించుకుని క్రాపింగు పెట్టించుకుంటానమ్మా' అని అపుడపుడు మారాము చేస్తూండేవాడు. "అలా వీల్లేదురా! ఇది మనవంశ సాంప్రదాయం. ఇరవై సంవత్సరాలపాటు మీ తండ్రి వకీలుగా పనిచేశారు. వారి ప్రఖ్యాతికి ఎన్నడూ పిలకజుట్టు అడ్డుతగలేదు. నీకు సరిగా అక్షరజ్ఞానమైనా కలగలేదు. నీకు యీ పిలకజుట్టు నామోషీగావున్నదా?' అని మీనాక్షి మందలిస్తూండేది. అసలు చెయిన్ల స్వరూపం మొదటి తడవ చూడగానే ఎవరికైనా నవ్వు కలిగిస్తుంది. సన్నగా యీనకఱ్ఱ బద్దవంటి శరీరం, వీపువద్ద కొంచెంగావంపు, పెదవులుదాటి ముందుకువచ్చే కొంచెం పొడుగాంటి పళ్ళు, మిట్టపల్లాలతో కూడి నిడువైన నున్నని శిరము, దాని వెనుక కొబ్బరి పీచులాంటి చిన్నపిలక, కొంచెం పెద్దదిగా కనిపించే బుజ్జిముక్కు, కోపంవస్తే అరుగంటలపాటు ఏకధాటిగా శోకాలు పెడుతూ ఏడిచేవాడి తీరు చూసి పాటిపిల్లలు వాణ్ణి తెగ వెక్కిరిస్తూండేవారు.

బడిగంట ధ్వనించగానే ఆ తరగతిలోని పిల్లలందరూ వచ్చేశారు. పంతులుగారు వచ్చి కుర్చీలో ఆసీనుడై పిల్లలవంక ఒకతేప తేరిపార జూచారు. ఏదో జ్ఞాపకం వచ్చినట్లుగా కండ్లు పెద్దవిచేసి ఇలా ప్రశ్నించారు: "ఒరే అబ్బాయిలూ చెయిన్లుయేడిరా?"
"వాడు కొలనుగట్టుమీద తిరుగుతున్నాడండి."

"అట్లాగా, ఇవ్వాళ్ళ వాడిపనిపట్టాలి" అనిపళ్ళు పటపటా కొరుకుతూ కుర్చీలోనుంచి లేచాడుపంతులుగారు. నలుగురు శిష్యులు ఆయనవెంటవెళ్లారు. పంతులుగారిని చూడగానే చెయిను ఒక మూలకు పరుగెత్తాడు. పంతులుగారు కూడా చేతి పేముబెత్తం పట్టుకుని వాడివెంట పరుగెత్తాడు. తారాచువ్వలాగా చెయిన్లు వాయువేగంతో పరుగు తీస్తున్నాడు. వాడికి కొంచెం వెనుకగా ఆయాసపడిపోతూ మహోత్సాహంగా పరుగెత్తుతున్నాడు పంతులు. పంతులు కొంచెం దగ్గరపడేసరికి చెయిన్లు యింకో మూలకు దారితీశాడు. ఆ మూలనకూడా పంతులు ఎంతో శ్రమపడి సమీపమవుతూండేసరికి దగ్గర్లో వున్న చెట్లతోపులోనికి దూరి మాయమైనాడు. పంతులూ, ఆయన విద్యార్థులు అక్కడకుకూడా ఎగబడేసరికి అతివేగంగా కట్టపైకి పరుగెత్తి కొలనులోకి ఒక్కదూకు దూకి నీళ్ళల్లో మాయమైనాడు. పంతులుగారికి గుండెల్లో అదురుతీగె ప్రాకటం ప్రారంభించింది. భీతితో ఆయన శరీరం ఒణికిపోయింది. దేహమంతా ముచ్చెమటలు పోశాయి. మరునిముషంలో చెయిను నీటిపైకి తేలి ఒడ్డుకు సమీపంలో యీతకొడుతున్నాడు. పంతులుగారికి పిరికితనం ఒదిలిపోయింది. ఆయన గుండెల్లో ధైర్యం కుదిరింది. విస్మయంతో, సంతోషంతో ఆయన నేత్రాలు మెరిశాయి. కాని వెంటనే పట్టలేని ఆగ్రహం పొంగుకుని వచ్చింది. "అరే ధిడవా! ఎంత పనిచేశావురా? ఒరే! నెమ్మదిగా దిగి వాణ్ణి లాక్కొని రండిరా!" అని ఆదేశించాడు గురువుగారు. వెంటనే ఒక విద్యార్థి నీళ్లలోకిదిగి చెయిన్లను కొంచెంముందుకు నెట్టాడు. పంతులుగారు వెంటనేవచ్చి చెయిపట్టుకుని చెయిన్లను బయటకు తీశారు. చెయిన్లు పట్టుబడ్డ గజదొంగ లాగా నలుగురుపిల్లలమధ్యనా నిలబడ్డాడు. వాడినున్ని తలపై నలుగురు నాలుగు మొట్టికాయలు మోగించారు. ఆఖరుకు పంతులుగారు ఓపిక చేసుకుని పెడరెక్కలుగట్టిగా బిగించి పేముబెత్తాన్ని వాడి ఒంటిపై వేగంగా ప్రయోగించటం ప్రారంభించారు. అపరిమితాగ్రహావేశాల్లో మునిగివున్న ఆగురుదేవుల వారికి ఆ బాలుని ఘోరవిలాపము అణుమాత్రమైనా వినిపించలేదు. కొంతసేపైన తరువాత పేము బెత్తము అంటిన అగ్నివర్ణమును చూచుసరికి ఆయనకు కోపం కొంచెం వెనుకాడింది. వాని అరచేతిపలుచని చర్మం అకుసుమంచి రక్తం పొంగుకుని వస్తోంది. ఈ శిక్ష చాలక కోబోలు పాఠశాలకు వెళ్ళక యింకా కొన్ని మొరటు శిక్షలకూడా గురిచేశాడు. చెయిన్లు పాఠశాలనుంచి విడుదల కాగానే ఒక్క పరుగున ఇంటికి వచ్చి ఘోరంగా ఏడుస్తూ తల్లిమెడను చేతుల్తో పెనవేసుకున్నాడు. మీనాక్షి అదిరిపోయింది. ఆమె గుండెల్లో దడపుట్టింది. 'ఏమిట్రా చిన్నా' అన్న ప్రశ్నకు జవాబుఉంపెదు. గుండెలు పగిలేలాగు ఏడుస్తూన్నాడు. కొంతసేపు గడిచిన తరువాత ఎఱ్ఱగా వాచి ఓప్రక్కన పగిలి రక్తంప్రవహిస్తూన్న అరచేతిని చూపించాడు. మీనాక్షి శరీరంకోపోద్రేకంలో వూగిపోతూన్నది. చెక్కిళ్లపై అశ్రుప్రవాహం జారుతోంది. మనసులో ఆకస్మికంగా అగ్నిజ్వాలలు రగులుతున్నాయి.

"ఎవరురా యీపని చేసింది?"

"పంతులుగారు......" ఇక మరి చెప్పలేకపోయాడు.

వెంటనే పంతులుగారి కోసం పనిమనిషిని పంపింది మీనాక్షి. పది నిముషాల్లో పంతులుగారు వచ్చారు. మీనాక్షి గుమ్మంలోపల తలుపు రెక్కచాటున నిలబడి పంతులుగారిని అడిగింది:

"ఏమండీ! మీరు బిడ్డా పాపా గలవారుకదా? యీపని ఎందుకుచేశారు?

ఆ ప్రశ్నలోగల గంభీరత, రోషావేశము జవాబు చెప్పేందుకు పంతులుగారి కంఠస్వరమును పెగలనిచ్చినవి కావు. ఏమని జవాబుచెప్పాలో ఆయనకు తోచలేదు. రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచినపిమ్మట మరల అందుకుంది మీనాక్షి.

"చూడండి మేష్టారూ, మీ హృదయంలో పితృత్వం నశించి పోయిందనుకుంటాను. ఇటువంటి పైశాచికఘోరణిలో గురుత్వం సాగిస్తే విద్యార్థిలోకం దద్దరిల్లిపోదండీ? ప్రపంచాన్ని గురించి ఎన్నో విష

యాల్ని తెల్సుకోవాలని ఆతురత చూపే పసిహృదయాల్ని ప్రథమదశలోనే ఇటువంటి సింహస్వప్నాలతో కల్లోలపర్చటమే మీరు చేస్తున్న విద్యావిధానమా?" పంతులుగారు నమ్రశిరస్కుడై మౌనంగా నిలబడివున్నాడు.

"మా కొంటెపిల్లవాణ్ణి మీ పాఠశాలకు పంపి తనకు ఇకమీదట ఎక్కువ శ్రమకల్పించటం నాకు ఇష్టంలేదు." పంతులు గారు మారుపల్కకుండా వచ్చినదారినే వెళ్లారు.

కాలచక్రపు గంభీరచలనములో రెండు వసంతాలు కళ్లుమూసినవి. తేలికగా తగ్గిపోగలదనుకున్న స్వల్పజ్వరమే క్రమేణా విషమించి మీనాక్షిని ప్రాణాపాయస్థితిలోకి దించింది. అంత్యకాలంలో తన అల్లారు ముద్దు బిడ్డ ఏకైక సంతానము అయిన చెయిన్ను చూపి వాని హస్తమును తన అన్నగారి చేతిలో వుంచి ఆఖరి పల్కులుగా ఇలా అన్నది: "వీణ్ణి వృద్ధిలోకి తీసుకునివచ్చే బాధ్యత నీపైవుంచి నిశ్చింతగా ప్రాణాలు ఒదులుతున్నాను. నీ చెల్లెలి యీ కడసారి కోరికను నీస్వార్థమును ఎంత చంపుకుని అయినా సిద్ధింపచేయగలవనుకుంటాను." "నువ్వేమీ అదుర్దా చెందనవసరంలేదు చెల్లీ. చెయినను నా పన్నెండో సంతానంగా చూసుకుంటాను. వాడి అభ్యుదయమునకై నాశక్తి సామర్థ్యములన్నిటినీ ధారపోస్తాను." అని అంటూ ఆ మాతృహృదయానికి మాట యిచ్చాడు యీ పెద్దమనిషి.

మీనాక్షి శ్రాద్ధకర్మలు పూర్తిఅయిన తరువాత ఇల్లు అద్దెకుయిచ్చి చెయిన్ను తీసుకుని స్వగ్రామం చేరుకున్నాడు ఆమె అన్నగారు. దినములు దొర్లిపోయిన కొలదీ చిన్న బాల్యహృదయంలో అంధతమస్సులు వ్యాపిస్తున్నాయి. సహజంగా మానవునికి బాల్యావస్థలో అత్యవసరమైన మాతృత్వపు అమృతవర్షము, వాత్సల్యమిళితమగు ఆదరణ ప్రేమ పూరితమగు వాక్కు, అపరిమితమగు మన్నన, బాల్య చేష్టలను క్రీడలను చూచి మురిసిపోయేవారి ఆనందము వాడికి పూర్తిగా ఆ మేనమామ ఇంట అలభ్యమైనవి. స్వేచ్ఛా సంతోషములను పూర్తిగా కోల్పోయి అపరిమిత నిరుత్సాహ వాతావరణంలో మేనమామ ఇంట మసలుతున్నాడు. కాలచక్రపు కదలికలోని అనుక్షణము ఏదో ఒక అవమానంతో వాడి మనసు బాధపడుతూ వున్నది. మేనమామ ఇంటికి వచ్చిన మొదటరోజునే ఆయన పదకొండుమంది సంతానము చెయిన్ను చుట్టూచేరి "నీ బోడిగుండు చాలా బాగున్నదిరా! పిలక బావా" అనిఅంటూ వాడితలపై తలా ఒక మొట్టికాయ ఇచ్చుకున్నారు. ఇక ఆనాటి మొదలు, ఆ యింట్లో చిన్న నుండి పెద్దవరకూ వాణ్ని వాడి పేరుతో పిలిచేవారే లేరు. 'పిలకబావ' అనేది వాడికొక నూత్న నామధేయమై పోయింది. ఇరుగు పొరుగువారు కూడా ఆ పేరే లంకించుకున్నారు. చివరకు పాఠశాలలోని ఉపాధ్యాయుడుకూడా ఆ పదమే వాడుతున్నాడు. సిగ్గుతో, బాధతో వాని లేత హృదయం నిరంతరమూ కుమిలిపోతూన్నది. భోజనసమయానకూడా వాడికో బాధ తప్పటంలేదు. మేనమామ సంతానంలో కొంచెం వయసువచ్చిన నలుగురూ గాక, మిగిలిన ఏడుగురూ ఏకసమయాన భోజనానికి హాజరవుతూంటారు. వడ్డింపు విషయంలోకూడా పక్షపాతం చూపబడుతూనే వుంటుంది. ఆ ఏడుగురి చివర చైను కూర్చోవలసి వుండేది. కూర, పులుసు మొదలైన ఆదరువులు ఆ ఏడుగురికీ సరిపోయిన తరువాత ఏమైనా మిగిలితే చెయిన్నకు వడ్డించటం, లేకపోతే ఇన్ని పచ్చడి మెతుకులతోనే వాడి తిండి పూర్తి. ఒక చిన్న జర్మన్ సిల్వర్ గిన్నె వాడి భోజనపాత్ర, 'నా వెండికంచం ఏమైందీ?' అని ఒకరోజున అడిగినందుకు మేనమామ వలన వాడికి చావాచితకా తన్నులు తగిలాయి. ఆకలి మంటలు జ్వలించిపోతూన్న కడుపుతో ఆ గిన్నె ముందు పెట్టుకుని కూర్చోవటం, తన పిల్లలకు వడ్డించగా మిగిలింది కొంచెమో గొప్పో మేనమామ భార్య ఆ గిన్నెలో పారేసిపోవటమూ జరుగుతూండేది. ఇక భోజనంచేస్తూన్నది మొదలు మేనమామ బిడ్డల్లో ఒకడు 'ఒరేయ్, పిలకబావకు ఆవకాయ ముక్కంటే చాలా యిష్టంరా!' అని అంటూ ఎంగిలి ముక్కను వాడి గిన్నెలోకి విసురుతుంటాడు మరొకడు మజ్జిగన్నం దూకిస్తాడు. ఇంకొకడు పులుసులోని ముక్కలు విసురుతూంటాడు. ఇంకొకడు వెనుకనుండి పిలకజుట్టు లాగుతుంటాడు. తింటూన్నంతసేపూ వెక్కిరింపు వేళాకోళాలో గడుస్తూంటుంది. తన బిడ్డలయొక్క యీ ప్రయోజకత్వాన్నంతా చూసి మేనమామ భార్య సంతోషిస్తూంటుంది. అన్నపుగిన్నె ముందు కూర్చున్నప్పటి నుంచి గతించిన దినాలు వాడికి గురుకొస్తూవుంటాయి. వెండికంచంలో వేసి అన్నం వడ్డించి పెరుగుముంతే, మీగడగిన్నె

ప్రక్కనపుంచి, చిన్న చిన్న ముద్దలుగా చేసి చేతిలో పెడుతూ భోజనంపూర్తి అయేవరకూ కంచికామాక్షి కథలు చెప్తూంటే తనతల్లి మీనాక్షమ్మ... ఆ వాత్సల్యం ఆ గారాబం...... నీరు నిండిన నేత్రాల్లో తిలకోంచు కుని ఏమిటో ఆలోచిస్తూంటాడు వాడు.

'ఒరేయ్ ఏడుస్తున్నాడురోయ్' అని ఒకడూ 'వాడికట బాగా సాగింమకు వేందుకు అమ్మ లేదే అని చింతిస్తున్నాడు లేరా' అని మరొకడూ 'యీకోణంగి మొహాన్ని మాసుకుని అవిడ ఎంత పొంగిపోయేదను కున్నావురా!' అని మేనమామ భార్య యీవిధంగా ఎవరికితోచిన ప్రకారం వాళ్లు మాట్లాడుతూంటే వారు.

చెయిన్లు మేనమామ పంజరంలో వుంచి తను యింట ఒక రామచిలుకను పెంచుతున్నాడు. ఆ చిలుకకు చిన్న చిన్న మాటలుకూడా నేర్పాడు. అది మానవ భాషలో రెండు మూడు అక్షరాల మాటలను మాత్రం తేలికగా ఉచ్చరింపగలదు. చెయిన్లు కనిపించగానే అది 'బావా' అని పలుకుతూంటుంది. అంత మర్యాదగా వాణి ఆ ఇంట్లో ఎవరూ పిలవరు. ఆ పిలుపులోని సాదరత్వం వాడిగుండెను కొంచెంగా చల్లబరుస్తూంటుంది. ఒకరోజున చెయిన్లు తనతల్లిమాట జ్ఞాపకం వచ్చినందున కన్నీటి కణములు రాలుస్తూ అరుగుపై కూర్చున్నాడు. ఎదురుగా వరండాలో వ్రేలాడుతూండిన పంజరములోని పక్షి 'బావా' అని పిలిచింది. ఆ అనునయ కంఠస్వరం వాని దీనహృదయమునకు కొంచెం శాంతిని చేకూర్చింది. అశ్రువులు నిండిన నేత్రాలను నలుపుకుంటూ పంజరమువద్దకు వెళ్లి నిలబడ్డాడు. ఏకాగ్రంగా చిలుకవంక దృష్టి సారించాడు. ఈ నరహృదయం ఆ పక్షి హృదయం ఒక నిమిష కాలం ఏదో సంబంధమును విప్పి చెప్పుకున్నవి. పరస్పరంగా సానుభూతి చూపుకున్నాయి. చెయిన్ల మనసులో ఏదో సంచలనం కలిగింది. ఏవేవో భావాలు సుడితిరుగుతున్నాయి. కంఠస్వరం గద్గదికమై పోతూండగా వాడినుండి యీ మాటలు వెలువడినయ్. "గాలిలో హాయిగా తిరుగుతూండే రామ చిలుకా, నీకు యీ గతి ఎందుకుపట్టింది? నీకుకూడా మీ నాన్న చచ్చిపోయినాడా?"

"చుప్. చుప్. చుప్..." అని అంటూ మొహం వికారంగా వంచి పలికింది రామచిలుక.

వారిద్దరి మధ్య నాలుగునిమిషాల కాలం నిశ్శబ్దంగా గడిచింది. తరువాత చెయిన్లు పెదవులు దీనంగా కదిలాయి. "ఈ ఇంట్లో నీ స్థితి నా స్థితి ఒకటే. మన ఇద్దరికీ ఏమీ భేదం లేదు. నీవు యీ పంజరంలో బందీవి. నేను యీ నాలుగు గోడల్లోనూ బందీని. నువ్వు యీ పంజరంలోనుంచి బయటపడలేవు నేను యీ ఇంట్లోనుంచీ తొలిగి పోలేను..." వాడి గుండెలు దుఃఖభారంతో ఒణుకుతున్నాయి. ఇక మరి మాట్లాడలేకపోయాడు. అది మొదలు చెయినకు పంజరబద్ధమైన రామచిలుకతో అత్యంత సంబంధం ఏర్పడింది. ఆ పక్షిజీవి వాడి లేత గుండెలో అనురాగస్థానమును ఆక్రమించింది. ఆ ఇంట్లో ప్రాణం నిల్పుకోగలంగులకు మాత్రమే చాలినంతగా తనకివ్వంగా ఆహారం లభ్యమవుతూన్నదో, ఆ చిలుకకు కూడా అంతమాత్రముగానే జరుగుతూన్నదని చెయిన్లు తెలుసుకున్నాడు. నీరసపడిపోతూండిన తన శరీరంమాదిరిగానే ఆ రోజు కారోజు గడిచినకొలదీ ఆ పక్షికూడా దుర్బలమై కాంతిహీనమైపోతూన్నది. దానిని ఆ విధంగా వాడిపోనివ్వకూడదని వాడు మనసులో దృఢప్రతిజ్ఞ చేసుకున్నాడు. వాని ప్రేమాదరణలు మారిగో నేవారు గాని తిరిగి వాటిని వాడియందు చూపేవారుగాని ఆ ఇంట్లో ఎవరూ లేరు, ఆ పక్షిజీవి ఒక్కటితప్ప! దినమునకు కనీసం నాలుగుసార్లైనా పంజరందగ్గరకు వెళ్లి ఆ చిలుకతో సంభాషణ జరుపుతూంటాడు. తన గోడువలు దానితో సెరుద్దిగా చెప్పుకుంటాడు. ఆ తంకరటంకరపలుకుల ద్వారానే దాని హృదయావేదన తెలుసుకుంటూంటాడు. ఇతరుల బాధలను గుర్తింపగల ఉదాత్తమైన ఆత్మకలిగి వుంటే, భాషా సంబంధమైన ఇబ్బంది ఒక పెద్ద అడ్డంకి కాదుకదా! ద్రవించే హృదయం లేనివాడియందు ఎంతపదలాలిత్యమును ప్రదర్శింపచేసినా వ్యర్థమే! తనకు ఏ ఆహారవస్తువు లభించినా అందులోతాను చాలా కొద్దిమాత్రమే స్వీకరించి మిగిలినదాన్ని భద్రంగా తీసుకునివెళ్ళి ఎవరూ చూడకుండా ఆ చిలుకకు పెడుతూంటాడు. 'రాగిణీ' అని తన పక్షి మిత్రునికి ముద్దుపేరు పెట్టుకున్నాడు. చేతివేళ్ళను పంజరపు సందుల్లోనుండా లోపలకు పోనిచ్చి రాగిణి శిరమును సానునయంగా నిమురుతూ 'రాగిణీ నేను బ్రతికివుండగా నీకేమీ భయంలేదు. మా నాన్న చనిపోకమునుపే నీవు నాకు కన్పించివుంటే ఎంత సౌఖ్య

పడివుంటే దానివో..." అని అంటూంటాడు చెయిన్ను అప్పుడప్పుడు. దానిని కోరికల్లో ఒక కోరికను మాత్రమే వాడు ఎంతో కాలంనుంచీ అంగీకరించలేక పోతున్నాడు. "ఆ పనిమాత్రం నావల్ల కాదు. నన్ను మా మామయ్య చంపేస్తాడు" అని నిష్కర్షగా అనుకున్నాడు. కాని దానిదైన్య వైఖరి వాని మృదుచిత్తము కరిగిస్తూన్నది.

పాఠశాలలో పేద విద్యార్థులకు పలకలు పుస్తకములు ఉచితంగా పంచుతున్నారు. ఉపాధ్యాయుడు నిరుపేద బిడ్డలపట్టిక చదువుతున్నాడు. ఇన్ స్పెక్ట్రెస్ నుండి ఒక్కరొక్కరే అవి అందుకుంటున్నారు. పట్టికలో చదివిన పేర్ల ప్రకారం చెయిన్ల మేనమామ బిడ్డలు ముగ్గురు పలకాపుస్తకాలు తీసుకున్నారు. చెయిన్లకు యీ విషయం విపరీత విస్మయమును కలిగించింది. ఆ రోజున వాళ్ళు చిరిగిపోయిన దుస్తులు ధరించి బడికి రావడానికిగల కారణం వాడు తేలికగా గ్రహించాడు. ఇంతలో ఉపాధ్యాయుడు వాడి పేరే చదివాడు. కర్ణపుటముల్లో అగ్నికణములు దూసినట్లుగా బాధపడుతున్నాడు. లేచి నిలబడ్డాడు గాని ముందుకు కదల్లేదు. ఉపాధ్యాయుడు కళ్ళెఱ్ఱ చేసి 'కదలవేరా మొండికోడి వెధవా' అని అరిచాడు. చెయిన్ల కాళ్ళు ముందుకు సాగటం లేదు. ఏదో రకమైన భీతితో వాడిహృదయం ఉడికిపోతూన్నది. మానవత్వం శాపము ఒక వింతైన స్వయంశక్తి వాడి కాళ్ళు పట్టివుంచుతూన్నది. క్రైస్తవమత ధర్మావగాహనతో మృదుతరమై ఉన్న ఇన్ స్పెక్ట్రెస్ హృదయమును వాడి అమాయకపు చూపులు తేలిగ్గా ఆకర్షించాయి. ఆ బాలుని నిరాకరణకు ఏదో గూఢ కారణముండగలదని ఆమె తలచింది. 'మీరు వూరుకోండి మేష్టారూ' అని చెప్పి ఉపాధ్యాయుడి చికాకును సర్దుబాటు చేస్తూ ఏదో మాత్రి విషయాన్ని తెలుసుకోవాలనే వాంఛను వెల్లడిచేసే దృష్టితో ఈ వస్తువుల్ని తీసుకోవటం నీకు ఇష్టం లేదా నాయనా?' అని వాత్సల్యంగా ప్రశ్నించింది.

"మీరు అన్నది నిజం. నాకు ఇష్టం లేదు." వాడి కంఠస్వరం లోహపు గంటవలె ఖంగున ధ్వనించింది. చెయిన్లు వినీతుడిగా చేతులు కట్టుకుని నిలబడి ధైర్యంగా మనసులోగల భావాన్ని స్పష్టంగా చెప్పాడు.

"ఎందువల్లనో..." ఇన్ స్పెక్ట్రెస్ అధరముపై మందస్మిత పుష్పాలు రెక్కలు విప్పుకుంటున్నాయి.

"నేను బీదవాణ్ని కాదు గనుక—" యుద్ధ రంగమునందలి ప్రథమశ్రేణిలోని సైనికుని హృదయంలో మాత్రమే అటువంటి నిర్భయత గాంచ గలుదుమేమో ?

ఇన్ స్పెక్ట్రెస్ ఆశ్చర్యంగా ప్రశ్నార్థకంగా ఉపాధ్యాయుని వైపు చూసింది. ఆయన తగిన జవాబు లేక బెదిరిపోయిన చూపులతో ఏదో ఆలోచిస్తూ నిలబడ్డాడు. చెయిన్లు ద్విగుణీకృతమైన నిబ్బరంతో మరల యీ విధంగా అన్నాడు. "ఇది సత్యం. నేను నిరుపేద బిడ్డను కాను. మా నాన్న వకీలుపనిచేసి బోలెడు సంపాదించాడు. నాకు తెనాలిలో మేడ, మాగాణి భూములూ వున్నాయి."

క్రీస్తుబోధలకు సంబంధించిన ఒక యథార్థ దృశ్యమును ప్రత్యక్షంగా ఆమె చూడగలుగుతూన్నది. ఆమె హృదయం సంతోషంగా సగర్వంగా క్రీస్తుదేవునికి జోహార్లు సమర్పించుకుంది. 'బాల్యహృదయం స్వర్గతుల్యం' అని ఆమె భక్తిహృదయంలో ఏసుదేవుడు మందస్మిత వదనంతో అమృతవాక్కులు విరజల్లుతున్నాడు.

"నీకు యీ విషయమంతా ఎవరు చెప్పారు నాయనా?"

"మా అమ్మ చెప్పింది. అదే కాదు. సత్యవాక్కు మానవునికి రక్షణ కవచముగా ఉపయోగపడగలదని చెబుతూండేది. అందుచేతనే నేను ఇపుడు అబద్ధం ఆడదల్చుకోలేదు."

"అమ్మతల్లి ఇప్పుడు ఎక్కడవున్నది నాయనా?"

ఈ ప్రశ్న వినీవినటంతోనే చెయిన్ నేత్రాలలో నీరు నిండింది. ఎదురుగావున్న ఉపాధ్యాయుడు 'ఈలోకంలో లేదు' అని జవాబు చెప్పాడు. దుఃఖము కొంచెం సర్దుబాటు చేసుకుని చెయిన్లు యిలా అన్నాడు: నేనే కాదు, మామయ్య బిడ్డలు కూడా ఏ మాత్రం బీద వాళ్లు కారు. వాళ్ళకు పెద్దపెద్ద మేడలు నాలుగున్నాయి. మామయ్య చెట్టుకింద ప్లీడరీ పనిలో బోలెడు సంపాదిస్తున్నాడు. వెంటనే ఉపాధ్యాయుడు కల్పించుకుని "ఆమాట నాకు తెలుసును. కానీండి, పాపం ఆ బ్రాహ్మణుడు 'అధిక సంతాన

వంతుణ్ణి. ఈ సహాయం చేసిపెట్టవలసింది అంటూ నిన్న సాయంకాలం వెతుక్కువచ్చాడండి. అందువల్ల జాలి కలిగి రాత్రే ఆ పేర్లను జాబితాలో చేర్చాము," అన్నాడు. "డామిట్! ఏమి పని యిది? అటువంటి దొట్టునపై జాలేమిటి? ఎవరో కొద్దిమంది వ్యక్తుల్ని సంతోషపర్చగలందులకు పాపకూపంలో దూకుతావా? ఎవరో అనుభవించవలసినవాటిని మరి ఇంకెవరికో కట్టపెట్టమాడటం భావ్యమా? ఆ ముగ్గురి వద్దనుంచి పలకలూ పుస్తకాలు తీసికోండి."

చెన్న మేనమామ బిడ్డలు ముగ్గురూ వాటిని ఇచ్చివేయక తప్పిందికాదు. ఈ సమాచారం చెన్న మేనమామకు అందుటకు ఎంతో సేపు పట్టలేదు. క్రోధావేశపరుడై ఆయన చెన్న రాకకు ఎదురుచూస్తున్నాడు. చెన్ను విచారగ్రస్తముఖ వదనంతో తూలిపోతూ, భీతితో ఒణికిపోతూ లోపలకు వచ్చాడు.

"ఒరేయ్, పిలకబావా ఇటురా" అని భయంకర నాదంతో ఒక పొలికేక. వాడి క్షీణదేహం గజగజలాడుతూ నీడవలె మెల్లిగా జరుగుతూ ముందుకు వచ్చింది. "దొరసానిగారితో ఏమని చెప్పావ్" చెన్న నుండి జవాబులేదు. కేసరిముందు నిలబడివున్న మేకపిల్లవలె భీతితో అదిరిపోతున్నాడు.

"మాట్లాడవేమి? నేను ఒక భాగ్యవంతుడననీ, అంతకంటె నీవొక జమిందారువనీ చెప్పుకున్నావా?"

చెన్ను యీ తడవకూడా మౌనాన్నే అవలంబించాడు. వాడి భుజములు ఒణుకుతున్నాయిగాని ఆ పెదవుల బిగింపులో చాలా కొద్దిమందిలో మాత్రమే చూడగలిగిన ఆత్మశక్తి దాపతు ఒక ఉన్నతలక్షణం ద్యోతకమవుతున్నది.

"ఎంత నిర్భాగుండై గలవాడివిరా?" ఒక్క గంతులో మీదకురికాడు. తనచేతులు నొప్పి పుట్టనంతవరకూ వాణ్ణి కొట్టి తదుపరి ఆ అల్పదేహాన్ని క్రిందకు నెట్టి కాలుతో తన్నటం ప్రారంభించాడు. తన్ను తన్నుకీ ఆ ఎముకలగూడు భూమిపై ధూళిలో గాలిలోని కాగితపు ముక్కవలె అతి వేగముగా దొర్లుతోంది.

"నా యింటికి నీవు ఒక శనిగ్రహమైనావు. నాలుగేళ్ల వయసునే తండ్రిని చంపావు. ఆరవయేట తల్లిని పొట్టన పెట్టుకున్నావు. ఇప్పుడు నన్ను చంపాలని నాయింటికి చేరావు. కాని నిన్ను నేను..." దారుణమైన వికృతధ్వని, దానివెంట అమిత బాధాపూరితమగు మూలుగు వినిపించింది. ఈ ఘోరదృశ్యానికి కొంచెం దూరంలో నిలబడివున్న ఇంటి యిల్లాలి హృదయంలో మాతృత్వం, మానవత్వం తలెత్తినవి. చంకలోని బిడ్డను క్రిందపడించి ఒక అంగలో ఆయనచేతికి అడ్డవచ్చి యిలా అన్నది. "ఆ అర్భకుడి శరీరం ఇందాకటి దెబ్బలకే విరిగిపోయి వుండాలి. ఇక వూరుకోండి. వదినెను తల్చుకునైనా మీ కోపం చంపుకోండి. పాపం! ఆవిడ వీడిపై ఎన్నో ఆశలు నిల్పుకుని ప్రాణం విడిచింది."

"నువ్వు అవతలకు వెళ్ళు. దాని త్వష్ట్రిపు పెంపకమే యీ భూతాన్ని ఇంతవరకూ తీసుకొని వచ్చింది. అధికారుల ముందు యీ నీచుడు నా పరువు తీసినాడు." అని అంటూ భార్యను వెనుకకు నెట్టి మరొకతడవ ఆ క్షీణదేహాన్ని బలంగా త్రొక్కుతూ ముట్టగించాడు.

"అబ్బా ... అమ్మా!..." వేదనాపూరితమగు విలాపస్వరం. ఇంటి యజమానురాలి గుండెలు దడదడలాడినై. ఆమె డొక్కల్లో ఒక ప్రక్కన మంట లేచింది. "పసితనంలో నే నాతాపితలు దూరమైపోయిన ఆ బిడ్డన్ని యివ్వాళ్ళ యీ లోకానికేకూడా దూరం చేస్తారా? మీకు నమస్కరించి చెప్పుకుంటున్నాను. పవిత్రుడైన ఆ నరసింగరావు పొత్తును మీరు అమానుషంగా బలిపెట్టకండి..." అని రెండు చేతులతోను తన ముఖాన్ని కప్పుకుని ఏడుస్తూ ఒక మూలన కూలబడింది. చివరకు ఎంతో సేపటికి ఆయనకు కోపావేశం తగ్గింది. కాని చెన్నకు ఆ రోజంతా దూషణ తిరస్కారములుమాత్రం తప్పలేదు.

ఆ సాయంకాలసమయాన కుంటుకుంటూ మెల్లిగా మెట్లుఎక్కి డాబామీదకు వెళ్ళాడు. ఆ ఉదయాన మేనమామ కొట్టిన దెబ్బలవాపతు బాధ, నొప్పులూ ఇంకా పూర్తిగా తగ్గలేదు. వానిని చీకాకు పర్చుటకుగాని వెక్కిరించుటకుగాని అక్కడ ఎవరూ లేరు. నిశ్శబ్దత నిరాటంకంగా పరిపాలన జరుపుతూన్నది. చెన్ను దీక్షగా కూర్చుని ఏకాగ్రతగా ఆలోచిస్తున్నాడు. వాని స్మృతిపథమున తల్లిముఖబింబం నృత్యం చేస్తోంది. ఆ లేతగుండె తన బాధల్ని వెళ్లబోసుకుంటూంటే, ఆమె నేత్రములనుండి రక్తకణములు రాలుతూన్నవి. కరుణ ఒలికే ఆమెదృష్టులు వాని పీడిత హృదయమును ఆదరిస్తూన్నవి. సంధ్య చీకట్లు

అలముకుంటున్నాయి. ఉజ్జ్వలకాంతుల్ని కోల్పోయి తీగదశలో ప్రవేశించిన కృష్ణపక్ష చంద్రుడు ఆకాశ మార్గాన పిల్లినడక ప్రారంభించాడు. యుగయుగాలుగా యీ లోకపు దుఃఖసంఘటనలకు సాక్షీభూతములుగా వుంటూ వచ్చిన తారలు మాత్రం ఎప్పటి మాదిరిగానే మిణుకు మిణుకు మంటూన్నాయి.

చెయిన్ను ఎదలో వర్ణింపలేని దుఃఖప్రవాహం ఒక్క తడవగా పొంగి పొరలింది. ఆ దుఃఖావేశమును గుండెల్లో అణుచుకోలేక పోయినాడు. ఆకాశంలోకి అదే రీతిని దృష్టిని సారిస్తున్నాడు. వాడికి తెలియకుండానే వాని పెదవులు కదులుతున్నాయి. "అమ్మా, ఎప్పుడు వస్తావమ్మా? అసలు ఎన్నటికీ తిరిగి రానే రావా? పోనీ నన్ను కూడా వెంటతీసుకుని వెళ్లకపోయినావా? యీ మామయ్య ఇంట్లో యిక నేను వుండలేనమ్మా. అమ్మా!...అమ్మా!...యీ మోకాలిమీది గాయం ఎంత మంటగా వున్నదో తెలుసా? ప్రొద్దున మామయ్యతో కొంచెం నెమ్మదిగా కొట్టమని చెప్పక పోయినావా? ఒళ్లంతా తీపుగా వున్నది. ఈ యింట్లోని మనుష్యుల్ని చూస్తూంటేనే నా కేమిటో భయంగా వున్నదమ్మా! ఆ రోజున మన వూళ్ళోని పంతులుగారు, ఆయన్ని అంత జోరుగా చివాట్లు పెట్టారే? మరి యివ్వాళ్ల అంతకు నాలుగురెట్లు అధికంగా చావ మోదిన యీ మామయ్యను నీవు వచ్చి ఎందుకు కొట్టేవని గట్టిగా అడగకూడదా అమ్మా? నీ అన్నయ్య కదా అనే ప్రేమతో వూరుకున్నావా?......అమ్మా! నీవు ఎక్కడ వున్నావమ్మా? ఒక వెన్నెలరాత్రిపుడు నీ పక్కలో నన్ను పడుకోబెట్టుకుని కొమ్మక్క కథ చెపుతూ ఆకాశం అవతల యింకొక లోకం వున్నదని చెపితివే? నీవు యిపుడు ఆలోకంలో వున్నావా? నన్ను చూసినట్లూ వుంటుంది. మామయ్యతో ఇంతగట్టిగా కొట్టవద్దని చెప్పినట్లూ వుంటుంది. నువ్వొకతడవ వచ్చిపోకూడదా అమ్మా?...నడుములోని పెద్ద ఎముక జివ్వన లాగుతూన్నదమ్మా. ప్రొద్దున మామయ్య ఎంతో ఎత్తునుంచి కిందకు పడేసినపుడు రాయికి తగిలి ఆ ఎముక ఎంత మోత అయిందనుకున్నావ్! అలాంటి సమయంలోనైనా నువ్వు వచ్చి నన్ను రక్షించకూడదా అమ్మా? పోనీ నీకు రావటానికి వీలు చిక్కకపోతే యింత బాగా కొట్టవద్దని మామయ్యకు ఒక్క వుత్తరమైనా రాయవమ్మా! ఇక నేను యీ దెబ్బలు తినలేను. నువ్వు వెయ్యి మాటలు చెప్పినాసరే యీ దెబ్బలు తినటం ఇక నా చేతకాని పని...పోనీ నన్ను కూడా నీదగ్గరకే తీసుకెళ్ళకూడదూ? నేను కూడా అక్కడే వుండునుగా...

......యీ చివరి మాటలు పలుకుతూన్నపుడు, వాటికి సమాధానంగా వాని మాతృదేవత సందేశము నేదైనా మోసుకొచ్చిందా అనునట్లుగా, వాయుమార్గాన అతి వేగంగా ఎగిరిపోతున్న ఒక పక్షి కంకరటెంకరగా అరుస్తూ ముందుకు సాగింది.

ప్రతిరోజూ ఉదయకాలాన పాఠశాలకు వెళ్లి పోయేముందు ఒకతడవ పంజరముదగ్గరకు పోయి రాగిణిని పరామర్శచేసి రావటం చెయిన్నకు అలవాటు. ఆ అలవాటుప్రకారమే ఆ రోజు వుదయకూడా పంజరముదగ్గరకు వెళ్ళాడు. చెయిన్నను చూడగానే మామూలు పద్ధతిగా రాగిణి సంతోష ధ్వానములతో ఆహ్వానింపలేదు. తల వంచుకుని దిగులుగా విషాదంగా పంజరంలో పడి వున్నది.

"అలా విచారంగావున్నావేమి రాగిణీ?" అని అడిగాడు చెయిన్ను. రాగిణి నెమ్మదిగా నేత్రములు విప్పి అన్నది" బావా?"

"ఏమిటి రాగిణీ, యివ్వాళ్ళ యిలా వున్నావే? నీకింత విచారందేనికీ? నా ముద్దుల పిచ్చితల్లీ బాధపడబోకు." చిలక అరిచింది.

"నేను......"

"ఆఁ నీవూ..."

"చచ్చి......"

"అయ్యో! నీవు చచ్చిపోతానంటున్నావా? అయితే నేను మాత్రం ఎందుకూ బ్రతకటం? నా పిచ్చి తల్లీ, అంతపని చేయబోకు నీవు మంచిదానివికదమ్మా! చెడ్డవాళ్ళు అటువంటి పనులు చేస్తారుగాని మంచి వాళ్ళు చెయ్యరు. ఏం రాగిణీ, అలా మాట్లాడకూడదు సుమా!......"

రాగణి కండ్లగొలుకులనుండి నీటిబొట్లు రాల్తున్నట్లున్నాయి. ఆ దీనదృక్కుల్లోని వేదనాగ్ని వాని హృదయాన్ని ద్రవింపచేసింది.

"అయ్యో? ఏడుస్తున్నావా రాగిణీ? ఏడవకు, నీకు ఏంకావాలో చెప్పు. నా ప్రాణం యిచ్చి

"అయినా తెచ్చిపెడతా." అని మహాయోధునివలె వీరప్రతిజ్ఞగా పలికాడు చెయిన్లు. రాగిణి తనకాళ్లను రెంటినీ జోడించి చెయిన్లకు నమస్కారం చేసినట్లు కనబడింది. దాని గుండెల్లోని బాధను వాడు స్పష్టంగా తెలుసుకున్నాడు.

"ఏమీ లేదుగాని ఆ పనిచేసి యీ యింట్లో బ్రతకగలనా అని..." ఒక నిముషకాలం శిరము పైకెత్తి ఆలోచించాడు. వాడికి మితిమీరిన మనోధైర్యం కుదిరింది. "ఏమైనాసరే కానియ్. నేను నీకు మాట ఇచ్చాను గనుక నీకోరికను నేనుతప్పకుండా నెరవేర్చి తీర్తాను. కష్టం వున్నవారికి సహాయం చేయుటం తప్పు పనేమీకాదు..." బంధనబాధనుండి ఏ జీవినైననూ విముక్తి పొందించటం మహా పుణ్యకార్యమని ఏదో గగనశక్తి వేయికంఠాలతో చాటుతూన్నది. నూతనోల్లాసంలో, అమూల్యసాహసంతో చెయిన్లు వెంటనే పంజరంమీదకు హస్తమును పోనిచ్చి అడ్డంగావున్న చువ్వలలో రెండింటిని పటుక్కున విరిచాడు.

రాగిణి స్వాతంత్ర్యసిద్ధిచే పొందిన సంతోషంతో పుప్పొంగిపోతూ వాయుపథంలోకి ఒక్క గంతులో పరుగిడింది. గాలిలో స్వేచ్ఛగా ఎగురుతూవున్న ఆ పక్షిజీవిని తన్మయత్వంతో పరికిస్తున్నాడు చెయిన్లు.

'ఏమిట్రా చూస్తున్నావ్?...అని వెనుకవైపు నుంచి మేనమామ వచ్చాడు. వెంటనే ఆయన దృష్టి పంజరంపై వ్రాలింది. "చిలక ఏదీ?" అని గాండ్రింపు.

వెంటనే తలపైకెత్తి చూచేసరికి ఎంతోకాలమైన మీదట దాస్యబంధనాలనుండి తప్పించుకున్న ఆ పక్షీజీవి స్వేచ్ఛాగానం సల్పుతూ ఆకసవీధిలో విహారం సల్పుతూన్నది. జరిగిన కథంతా వెంటనే గ్రహించాడు ఆయన. పట్టపగ్గాలులేని అహంకారంతో చెయిన్లను ఎత్తికుదేశాడు. శరవేగంగా ఆ క్షీణదేహంపై దెబ్బలు తన్నులు పడుతున్నాయి.

"అబ్బ......అబ్బబ్బ......అమ్మ........."

"నోర్మూయ్...ప్రాణం తీసేస్తాను. నా ఇంటి ప్రతిష్ఠ మంటకల్పుతున్నావ్. రాక్షసుడివి. నిన్ను వ్యాళవధించేస్తాను......" ఆయన నోటినుండి మాటలు స్పష్టంగా వెలువడటంలేదు. కించిత్తు ఆటంకంకూడా లేకుండా నిర్దయగా ఆ అర్భకతనువుపై బలప్రయోగం జరిగింది. తన నిర్దోషిత్వాన్ని ఋజువుపర్చుకోదగిన వాతావరణం యీ లోకంలో లేక దారుణ హింసాకాండకు తన జీవాన్ని సమర్పించి వూరుకున్నాడు చెయిన్లు. పాపపుణ్యాలెరుగని ఆ అమాయక జీవి బాష్ప ప్రవాహ జనితమగు ఉష్ణశక్తికి మానవహృదయం తూల్లుపడదా? "అయ్యయ్యో, ఇవ్వాళ్ల వాడిప్రాణం తీసెయ్యకండి. అన్నివిధాలా వాడు దురదృష్టుడు." అని అంటూ లబలబలాడి ఏడుస్తూ ఆయన సతీమణి లోపల్నుంచి వచ్చింది. క్షణక్షణానికీ ఆ హింసాపాతకుని మనసులో కోపతీవ్రత హెచ్చవుతూ వున్నకొద్దీ ఆయన అవయవాల శక్తి తగ్గిపోతూన్నది, ఆయన హస్తములు దమ్ముపడి తమ ఉక్తిని వెల్లడించుకుంటున్నాయి. చూడండి, మనము మాత్రం బిడ్డలు కలవాళ్లం కామా? సంతానవంతుడైన కిరాతకుడు కూడా యిటువంటి పనికి పూనుకోడే! ఆ ప్రవహిస్తూన్న రక్తం మనకొంపను కాల్చేయదటండీ? ఇకనైనా వూరుకోండి." అని సతీమణి బ్రతిమాలింది. ఆయన అహంకారం అంతటితో తృప్తిచెందలేదు. అర్థజీవంతో ఘోరబాధతో ఊపిరి పీల్చుకుంటూన్న ఆ అభాగ్యుణ్ణి నెమ్మదిగా నేలనుండి లేవతీసి వానిచే గోడకుర్చీ వేయించి ఇలా కఠినంగా శాసించాడు. "కాస్సా చేతులూ కదిలించావా అంటే అవి నా చేతిలో ముక్కలై పోగలవు. జాగ్రత్త!" భార్యాభర్తలిద్దరూ భోజననిమిత్తం లోపల కెళ్ళిపోయారు. బాలభానుని అరుణ కాంతుల్లో ఆ బాధిత బాలకుని విషాదవదనం మిలమిలమెరుస్తూన్నది. కాలచక్రం పదినిమిషాల ముందుకు జరిగింది. చెయిన్ల శరీరం అపరిమితబాధపడుతూన్నది. వాని చిత్తపథమున గతించిన స్వల్పజీవిత విశేషాలు దృశ్యరూపంలో తాండవిస్తున్నాయి. మోకాళ్ళలో నొప్పి అతితీవ్రంగా వ్యాపిస్తోంది. పదములలోని నరాలు బలమైన సుత్తి దెబ్బల బాధను కలిగిస్తూన్నవి. నిమిషములు గడిచినకొద్దీ అవయవములు పటుత్వహీనములై ఘోరతాపముతో అలమటింపచేస్తున్నాయి. తలలోని నరాలు తెగిపోయేటంత వేగంగా కదులుతున్నాయి. స్వేదబిందుప్రవాహం శరీరాన్ని తడిముద్దగా చేస్తోంది.

"అమ్మా?......" అని తీవ్రావేదనగా ఒకతడవ ఆక్రందించి నేత్రములు మూసుకున్నాడు చెయిన్లు. ఆ కండ్లమూతలలో తల్లి వానిని ఆదరణగా పలకరిస్తోంది. నీరు తిరిగిన నేత్రాల్తో ఓదారుస్తోంది.

"వాయసా రా! నాలోకిరా! నిన్ను యీ విధంగా హింసించే వాళ్లెవరూ ఇక్కడ వుండరు. కరుణహృదయమే కరువైన ఆలోకంతో నీకిక పనిలేదు..."

"తప్పకుండా వస్తానమ్మా. ఇక నేను ఇచట వుండలేను."

"హింసాప్రవృత్తులు, బాధలూ లేని లోకంలో స్థానం చూపిస్తాను. త్వరగా రా వాయసా."

"వస్తున్నాను. అమ్మా వస్తున్నాను."

ఆఖరిమాపు యీ దారుణలోకం పైకి విసిరి, ఆత్మీణకాయం నీరసంగా క్రిందకు జారిపోతూన్నది. భూజీవి విశాల హృదయ భాగమునుండి ఒక సన్నని వేదనాస్వరం వెలువడింది. మానవలోకపు హింసాకాండకు చెందిన మారణహోమంలో ఆరోజున మరొక అమాయకజీవి దగ్ధం కావింపబడ్డాడు.

గోడమీద వంకర టింకర అక్షరాలతో కొంచెం అస్పష్టంగా ఇలా వ్రాయబడివున్నది "నేను చేసింది తప్పుపని కాదు. మనుజుల ఎప్పుడూ రాగిణిని తెచ్చి పంజరంలో బంధించకండి."

ఇట్లు

'వకీలు నరసింగారావు కుమారుడు యజ్ఞేశ్వర చెయిన్లు.' సమీపంలో ఇంటి కప్పుపై రాగిణి నిలబడి పెట్టిగా అరుస్తూ విలపిస్తోంది. ఆ దీన నాదములోని భావం ఈ విధంగా అయివుండాలి "బావా! నీవు ఎంత త్యాగజీవివి! నా స్వేచ్ఛ నీ ప్రాణాన్ని బలికొన్నది. నీవు నీ ప్రతిజ్ఞను నిలబెట్టుకున్నావు. కాని నేను నీ ఋణం ఎలా తీర్చుకోగలను?......" బారి అపోసి రేపన్ భవనంలో ప్రఖ్యాత న్యాయవాది నరసింగరావు జ్ఞాపకార్థం ప్రతిష్ఠింపబడిన ఆయన చిత్రపటం సరిగా ఆ సమయానికి గోడమీద నుండి ఆకస్మికంగా క్రిందకు జారిపడి పటాపంచలుగా పగిలిపోయింది. ఆ శిథిలచిత్రం గాజుముక్కలన్నీ విహాకవనమై ఏరి ప్రోగుపెడుతున్నాడు ఆ భవనపు కాపలామనిషి.

# వాల్మీకి కోకిల

శ్రీ శనగన నరసింహస్వామి

భారత వర్ష గౌరవ న
భా ధ్వజమైన మహర్షి ధర్మ వి
స్తార పయోధి రత్న గుణ
సారము గంటములోన దాచు సం
స్కార దశావతార రస
కారణ వాణి, తదంతరార్థ సం
స్మారక రేఖమై కొనలు
సాగుత మా మధుమాన వేళలన్

---

జానకీ జగదేక చారు చారిత్రము
తలచి మోదాశ్రుల దడియువాడు;
రామాక్షర ద్వయారాధనా ఫలముగ
నభినవామృతధార లందువాడు;
సౌదర్య సంపూర్ణ సామరస్యములోన
గల రహస్యము చూడ గలుగువాడు;
వాయు సంతాన సేవాధర్మ కర్మము
వెలగట్ట తుదముట్ట వలచువాడు;

సార వాఙ్మయ సంసార చక్రమునకు
ఆదిమూర్తి ప్రజాపతి యయినవాడు;
కావ్యముఖమున సర్వజగద్ధితమతి
మా కగుత మార్గదర్శి వాల్మీకి మౌని

శశి మండలమునుండి జాఱి డిగ్గిన సుధా
కళ యని చూడ నాకాంక్ష పడమొ;
కలశవార్నిధినుండి కలగి చిందిన కమ్మ
మీగడ యని చూడ మేలు పడమొ;
అభ్రవాహినినుండి అలలరాయిడి త్రుళ్లు
వార్బిందులని చూడ వాంఛ పడమొ;
స్వర్ద్రుశాఖికనుండి జాలువారిన పుష్ప
రసమని చూడ సంరక్తి పడమొ;

అది శ్రవఃపేయమో నయనైక వేద్య
మో వచింపగ రాదు సమ్మోహజనక
మా మనోహర మధుర శయ్యాపథమ్ము
వాగగోచర మది ఆర్షవశ్యవాణి

వర్ణపీథికి [redacted] ముందు నీ వ్యాళిపట్టు
మాపురా భారతీయుల మధ్య రసిక
రాజ్య మేలిన, మధురిమా రాశియయిన
మా కవనరాశి వోయి కళాతపస్వి!



# తెలుగు కన్నడసాహిత్యాల బాంధవ్యం

శ్రీ కె. సుబ్బరామప్ప

తెలుగుల, కన్నడిగుల సంబంధ బాంధవ్యాలు చాలా ప్రాచీనమైనవి. ఆచార వ్యవహారాలలో కూడా ఉభయులకూ వ్యత్యాసాలు లేవు. ఒకరు ఏ యే పండుగ పబ్బాలు ఆచరిస్తారో యింకొకరూ అవే ఆచరిస్తారు. నృపతుంగుడు 9 వ శతాబ్దంలో "కవిరాజమార్గంలో" "కావేరి యింద గోదావరి వరిగె" అని కన్నడ దేశ విస్తారాన్ని గూర్చి చెప్పుకొన్నాడు. దీన్నిబట్టి చూస్తే 9 వ శతాబ్దం నాటికి యీనాడు అచ్చ తెనుగు దేశమైన గోదావరీ తీరప్రాంతానికి కన్నడభాష వ్యాపించి వుండిందని తెలుస్తుంది.

భాషా సాహిత్య విషయాలలో తరచి చూస్తే తెలుగువారికి ఒక నిర్దిష్టమైన లిపీ, సాహిత్యమూ, రాక పూర్వమే కన్నడిగులకు అవి యేర్పడి ఉండినాయని తెలుస్తుంది. అంటే 9 వ శతాబ్దంలో నృపతుంగ రచితమైన లక్షణగ్రంథం "కవిరాజమార్గం" మూలాన అంతకు పూర్వమే కన్నడ భాషలో కొందరు గ్రంథాలు వ్రాశారని తెలుస్తుంది. "ప్రయోగ శరణం వ్యాకరణం" కదా! తెలుగువారిలో చూస్తే 11 వ శతాబ్దంలో నన్నయభట్టు భారతం వచ్చేవరకు కావ్యాలు లేవు. ఇదే తెలుగువారి తొలి కావ్యం. ఆనాటికి తెలుగువారు కేవలం "కాపట బీసచే" చదువుకొని 'గాథలు త్రిప్పుతూ' వుండేవారట. 11 వ శతాబ్దికి పూర్వం తెలుగువారి సాహిత్యం అంతా జనపద సాహిత్యం అయిన స్త్రీల పాటలు, జోలపాటలు, ఊడ్పుపాటలు మొదలైన గేయాల రూపంలో వుండేది. కన్నడంలో కావ్యరచన తెలుగువారికంటే ముందే జరగడంచేతను, వారికి ఒక నిర్దుష్టమైన లిపి వుంటూ వచ్చి వుండటంచేతను, తెలుగు లిపికీ కన్నడ లిపికీ అట్టే వ్యత్యాసాలు లేకపోవడం చేతనూ తెలుగువారుకూడా కన్నడిగుల లిపినీ సాహిత్య కృతులనూ అనుకరించారని చెప్పవలసి వస్తుంది. దీనికి కారణలున్నాయి. ఈ మాట నేను అంటే తెలుగు వారు తక్కువ అనీ కన్నడిగులు ఎక్కువ అనీ ప్రతిపాదిస్తున్నానని తెలుగు బాంధవులు నన్ను ఆక్షేపణ చేయవద్దును.

కన్నడ తెలుగు సాహిత్యాలలో ఇచ్చి పుచ్చుకోవడం అనాదిగా యెలా జరిగిందో మనవి చేస్తాను.

కన్నడిగులకు పంప, రన్న, పొన్న అనే రత్నత్రయం ప్రాచీనకవులలో వున్నట్టు తెలుగువారికి నన్నయభట్టు, తిక్కన సోమయాజి, ఎఱ్ఱప్రెగ్గడ అనే కవిత్రయం వున్నారు. తెలుగువారికి నన్నయ్య ఆదికవి. కన్నడిగులకు నృపతుంగుడు ఆది కవి అయినా అతడు లక్షణగ్రంథం వ్రాయడంచేత పంపనే ఆదికవి అయినాడు. పంపకవి వ్రాసింది నన్నయ్య వ్రాసిందీ భారతమే. పంపని కాలం 10 వ శతాబ్దం. నన్నయ్యది 11 వ శతాబ్దం. ఉభయులూ చాళుక్యరాజుల ఆస్థానాల్లో ఉండినవారు. పంపడు పశ్చిమ చాళుక్యులను ఆశ్రయించాడు. నన్నయ్యభట్టు పూర్వచాళుక్యులను చేరాడు. చాళుక్యులు కన్నడిగులని డా. నేలటూరి వేంకటరమణయ్యగారు సమర్థించారు. పంపకవీ నన్నయ్య విభిన్నమతాల కోసరం సాహిత్యాన్ని ప్రచార సాధనంగా వుపయోగించారు. ఒకరు జైనమతం ఇంకొకరు వైదికమతం అవలంబించి కావ్యరచన సాగించారు.

పూర్వకాలంలో మతము నాశ్రయించుకొని సాహిత్యం అభివృద్ధి చెందిందనే అంశం మనం మఱచిపోరాదు. కన్నడ సాహిత్యంలో చూడండి! జైన యుగమనీ, వీరశైవయుగమనీ, బ్రాహ్మణ యుగమనీ, సాహిత్యయుగ విభజన చేసుకున్నారు. కన్నడ రత్నత్రయం జైనమతావలంబులై ఆ మతప్రచారంకోసరం సాహిత్యరచన చేశారు.

పంపడు తొలుత ఆంధ్రదేశం అయిన వేంగి మండలంలోని వేంగిపల్లులో నుండినవాడు. ఆనాడు అక్కడ మతంలో ఒక విప్లవం బయలుదేరింది. జైన బౌద్ధమతాలను అణగంటింపచేసి వైదిక మతాన్ని

స్థాపించాలని ప్రయత్నాలు జరిగినాయి. ఆ సందర్భంలో పంపడు పశ్చిమ చాళుక్యరాజైన అరికేసరి యొక్క ఆస్థానానికి వచ్చి రాజుకు చేదోడువాదోడుగా వుంటూ, రాజుతో యుద్ధరంగాలకు కూడా పోయి ఆదిపురాణాన్నీ విక్రమార్జునవిజయం పేరుతో భారతాన్నీ వ్రాశాడు. ఆదిపురాణంలో వున్నంత జైనమతప్రచారతీవ్రత భారతంలో లేదు. భారతం అలాతీసుకుని రావడానికి వీలుకాలేదు. ఎందుకంటే దానికి మూలం సంస్కృతభారతం. వేదవిహితంగా మూలగ్రంథం రచింపబడివుంది. కాని పంపడు అక్కడక్కడ కొన్నిమార్పులు చేసుకున్నాడు. తన భారతానికి అర్జునుడు నాయకుడు. ధర్మరాజు కాదు. ద్రౌపదికి అయిదు మంది భర్తలు లేరు. అర్జునుని భార్య మాత్రమే ఆమె. శ్రీకృష్ణునికి పంపభారతంలో ప్రాధాన్యం లేదు. అవాడు ఇంకొక విశేషం ఏమిటంటే కన్నడిగులూ తెలుగువారూ కూడా సంస్కృత భాషను పూర్తిగా ఆశ్రయించి ఉపయోగించుకున్నారు. సంస్కృతానికి యీ భాషలపైన యెంత ప్రభావంవుందో చూడండి. కన్నడ, తెలుగు వ్యాకరణ గ్రంథాలను సంస్కృతభాషలో వ్రాశారు అప్పటి కవులు. నాగవర్మ "కర్ణాటక భాషాభూషణం," భట్టాకళంకుడు "శబ్దానుశాసనం" నన్నయభట్టు "ఆంధ్రశబ్ద చింతామణి" సంస్కృతంలో వ్రాశారు. సంస్కృతంలో వాటి సూత్రాలు. వీనికి ఆయా భాషల్లో యితరులు వ్యాఖ్యానం వ్రాసుకోవలసి వచ్చింది తర్వాత.

పంపభారతం 10 వ శతాబ్దంలో వచ్చే వేళకు తెలుగుదేశంలో కూడా అది చాలవరకు వ్యాప్తికివచ్చిందని చెప్పవచ్చు. కన్నడప్రాంతంలో వుండిన కన్నడ కవి నారాయణభట్టు అనే వైదికకవి అక్కడ చెలరేగుతూవున్న జైనమతం గట్టి పూర్వ చాళుక్యరాజ్యమైన గోదావరీతీరస్థమైన రాజమహేంద్రవరానికి వచ్చి రాజరాజనరేంద్రుని ఆస్థానం చేరుకున్నాడు. 11 వ శతాబ్దంలో నన్నయ్య వ్రాసిన తెలుగు భారత రచనలో "తనకిష్టుడును సహాధ్యాయుడును" అయిన నారాయణభట్టు 'అభిమతంబుగ తోడయి', 'భారత ఘోరరణంబునందు నారాయణునట్లు' సహాయం చేశాడని నన్నయ్య గ్రంథాదిలో చెప్పుకున్నాడు. ఇంతటి గొప్పసహాయం కన్నడ కవి తనకేమి చేసివుంటాడు? తప్పకుండా పంప భారతాన్ని ఆద్యంతాలు చదివి వినిపించి పంపకవి రచనావిధానాన్నీ, రీతినీతులనూ వివరించి వుంటాడు. అందువల్లనే పంపభారతంలోని ఛందోనుకరణాలూ, వర్ణనా సన్నివేశాలూ, రచనారీతులూ, కొన్ని తెలుగు భారతంలోనికి వచ్చినాయి. పంపడు తనకు పోషకుడైన అరికేసరికి అంకితం చేసినట్లే నన్నయ్య తనకు పోషకుడైన రాజరాజనరేంద్రునికి తనగ్రంథం అంకితం చేశాడు. కృతిపతిని వర్ణించడంలో ఉభయుల రచనల లోను పోలికలున్నాయి. ఆశ్వాసాదులలో పద్యం వెంటనే గద్యం రెండు గ్రంథాలలోను వుంది. ఆశ్వాసాంత్యగద్యాలూ అంతే. మధ్యాక్కర, మధురాక్కర మొదలైన శ్రోత్రవృత్తాలను పంపని రచనలనుంచే నన్నయ్య గ్రహించాడు. "లలితపదం," ప్రసన్న కథా కవితార్థం," "అక్షర రమ్యత" — ఇవి పంపడు ఉపయోగించుకొన్నవి అలాగే నన్నయ్య అనుకరించాడు. గ్రంథాదిని దేవతాస్తుతికూడా పంపడు చేసినట్లే చేశాడు. కన్నడపదాలు ప్రత్యయభేదాలతో కొన్ని నన్నయ్య భారతంలో ప్రవేశించినాయి. ఉదాహరణకు: అరణ్యపర్వం, 3 ఆశ్వాసం 330 వ గద్యంలో "కొలసమునకు మెచ్చి" అని వుంది. (కొలస=పని) పంపభారతంలో పాండురాజు దర్శించిన శతశృంగ పర్వత వర్ణననూ, అచ్చటి మునాశ్రమంలో వైరివర్గానికి చెందిన జంతుజాలం అన్యోన్యంగా వుంటూ వున్న పరిస్థితినీ, వేదాలను చదువుతూవుండే చిలుకలూ మొదలైన వర్ణన అంతా నన్నయ్యభట్టు దుష్యంతుడు ప్రవేశించిన కణ్వాశ్రమంలో వున్నట్టు ఒక సీస పద్యంలో వర్ణించాడు. (సీ॥ "శ్రవణసుఖంబుగా సామగానంబులు చదివెడి శుకములు చదువు దగిలి" మొ॥ ఆది. 4 వ ఆశ్వాసం. శకుంతలోపాఖ్యానం.)

"చోద్యంపట్టు" అని పంపడుముగిస్తే నన్నయ్య "చోద్యమంది" అని యీ వర్ణన ముగించాడు. విభక్తి పల్లటాలలోకూడా పంపని అనుసరించిన పట్టులు తిలకించండి :—

"నారదన పేర్దు" (6-21) "వైరియమాడిద" (8-90), తన్నమడిద (12-190), నరకాంతకనంనడె నరేంద్రం (12-129) వీనిని తెలుగుచేస్తే, అదేరకమైన విభక్తిపల్లవాలు నన్నయ్య అనేకచోట్ల వాడివాడని తెలుస్తుంది. నారదుని చెప్పిన, వైరిచేసిన, తనచెప్పిన, నరకాంతకుని నరేంద్రుడు పలికెను.—ఈలాగే, పంపభారతంలో ఆఖరున అర్జునునికి పట్టాభిషేకం చేసే

సందర్భంలో నదీజలాలు, సముద్రజలాలు, దేవేంద్ర లోకంలోని పువ్వులూ తెచ్చి అభిషేకించినారని వర్ణించిన నాలుగైదు పద్యాలను పోలిన పద్యాలు నన్నయభట్టూ వ్రాశాడు. పంపని సంస్కృతి సమాస భూయిష్ఠమైన పద్యాలలోని కన్నడప్రత్యయాలకు బదులు తెలుగు ప్రత్యయాలు చేర్చితే నన్నయ పద్యాలనే శంక కలుగుతాయి.

కన్నడదేశంలో వీరశైవమతం బసవణ్ణ వచనాల ద్వారా వ్యాప్తికివచ్చిన వైనం చూచి యీ మతావలంబి అయిన పాల్కురికి సోమనాథుడు తెలుగు దేశంలో యీ మతాన్ని వ్యాపకం చేయడానికి దేశి కవితా రచనకు దిగి బసవణ్ణ వచనాలమాదిరి జనప్రియత్వానికి రాగల్గిన ద్విపదఛందస్సులో "బసవపురాణం" "పండితారాధ్యచరిత్ర"లను వ్రాసి వీరశైవమతవ్యాప్తికి తోడ్పడ్డాడు. ఈ తెలుగు గ్రంథాల బహుళవ్యాప్తిని కన్నడదేశంలో గుర్తించుకుని 14 శతాబ్దంలో భీమకవి బసవపురాణాన్ని కన్నడంలోనికి అనువాదం చేశాడు. పాల్కురికి సోమనాథుడు తనకు స్వప్నంలో కనిపించి బసవపురాణాన్ని కన్నడీకరించమని చెప్పినాడని భీమకవి గ్రంథాదిలో చెప్పికొన్నాడు. సోమనాథుని "పండితారాధ్యచరిత్ర"లోని "గురుభక్తయాండారు చరిత్ర"ను 1650 లో ప్రాసభూషణ చెన్మశెట్టి అనే కవి వార్ధక షట్పదులలో కన్నడీకరించాడు. ఇది యింకా అచ్చుకాలేదు. దీని మూడు తాటాకుప్రతులు మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో వున్నాయి. ఇతడు గ్రంథాదిలో యిలా వ్రాసుకొన్నాడు: "పాల్కురికి సోమనాథను తందెభాషె యల్లిబరెద ద్విపది ఆరాధ్య చరితెయ గురుభక్తయాండారు చరితెయ కంనడిసి" (అనగ పాల్కురికి సోమనాథుడు తన తండ్రిభాషలో వ్రాసిన ద్విపద ఆరాధ్యచరిత్రలోని గురుభక్తయాండారుచరిత్రను కన్నడంలో అనువదించుచున్నాను అని.) తండ్రిభాష తెలుగైనప్పుడు తాయిభాష (మాతృభాష) కన్నడం అయివుండవలెకదా! మూడు తాటాకుప్రతులలోను యిలాగేవుంది. పాల్కురికిసోమనాథుణ్ణిగూర్చి కన్నడదేశంలో సుమారు 12 మందికి పైగా వీరశైవకవులు తమ గ్రంథాదులలో పేర్కొన్నారు. సోమనాథుడు కన్నడంలో "శీలసంపాదనె," "సద్గురురగళె", "చెన్నబసవస్తోత్ర", "శరణు బసవ రగళె" వ్రాశాడని తెలుగుకవిచరిత్రలే చెప్పుతున్నాయి. కన్నడదేశంలో జనప్రియత్వం అందిన "హరహరా శ్రీ చెన్నసోమేశ్వరా!" అనే మకుటంతో వ్రాయబడిన "సోమేశ్వర శతకము" ఇతడు వ్రాసిందే. కన్నడ సాహిత్య పరిషత్తువారు దీన్ని ప్రకటించారు. వారు ప్రకటించిన పీఠికలో పాల్కురికి సోమనాథుడే వ్రాసినట్లు శంకించారు. కన్నడదేశంలో యింతటి ప్రసిద్ధిచెందిన ఇతని స్వస్థలం మైసూరు సంస్థానానికి చేరిన తుంకూరుజిల్లాలోని యీనాటి హాల్కురికి అని కొందరు విమర్శకుల అభిప్రాయం. కీ. శే. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారుకూడా పండితారాధ్య చరిత్రకు పీఠిక వ్రాస్తూ యిదే అభిప్రాయాన్నిచ్చారు. ఇప్పటి హాల్కురికి సోమనాథుని కాలానికి (12 శతాబ్దం) పాల్కురికిగానే వుండేది. 10 నుండి 14 శతాబ్దంవరకు కన్నడంలో "ప"కారంతో ఆరంభంఅయ్యే పదాలు "ప"కారంగానే వుండేవి. అవి యీనాడు హకారంగా మారిపోయినాయి. పంప భారతంలో "కోగిలె పాడువ", "యుద్ధమల్లుహీపతిగ పుట్టి", 14 వ శతాబ్దంలో వ్రాసిన కన్నడ బసవపురాణంలో "పక్కిగళు గగనక్కె నెగెదవు"అనే ప్రయోగాలున్నాయి. ఆ పదాలు యీనాడు హకారాదిగా ఉచ్చారణ చేస్తారు. పాడువ—హాడువ అనీ, పుట్టి-హుట్టి, పక్కి—హక్కి. అలా నేమరికొన్ని చూడండి: పత్తి—హత్తి; పల్లు—హల్లు; పగలు—హగలు; పల్లి—హళ్ళి; పంపయ్య-హంపయ్య; పావు-హావు అదేరీతిగానే పాలు—హాలు అని మారివుండితీరాలి. తెలుగు దేశంలో పాల"కుర్తి" వుంది కాని పాల్కురికిగాని పాలకుర్కిగాని లేదు. "కురికి" లేక "కుర్కి"తో అఖరు అయ్యే గ్రామాలపేర్లు కన్నడదేశంలో వున్నాయిగానీ తెలుగుదేశంలో లేవు. ఉదా: కోలారుజిల్లాలో కుందలకుర్కి, అగలకుర్కి అనే గ్రామాలున్నాయి. కాబట్టి సోమనాథుని నివాసస్థానం అయిన పాల్కురికి మైసూరు సంస్థానంలోని తుంకూరు జిల్లాలోనిదే అయివుండాలి. ఇదిగాక శివకవులు తమ్మునుగూర్చిగానీ, భవులను గూర్చిగానీ, తమ గ్రంథాలలో పొగడుకొనే ఆచారం లేదు. సోమనాథుడు "బసవనిపుత్రుండ, బసవని గోత్రుండ" అని చెప్పుకున్నాడేకాని తన తల్లిదండ్రులను గూర్చి కూడా యెక్కువగా చెప్పుకోలేదు. అందుకనే వీరి కాలమూ నివాసస్థలాలు మొదలైనవి విమర్శకులు ఊహచేసుకోవడానికి అస్పదం అయినాయి.

తెలుగులోని యింతటి విద్వాంసుడు కన్నడ దేశీయుడని,కన్నడం మాతృభాషకలవాడు అని చెప్పడం సాహసం కాదా అని అనవచ్చు. ఇది సాధ్యమని ఋజావుచేయవచ్చు. కన్నడ సాహిత్యానికి అపారంగా సేవచేసి పేరు ప్రతిష్ఠలు గడించినవారిలో అనేకులు అచ్చ కన్నడిగులు కాదు. వారి మాతృభాషలు వేరు. మొట్టమొదట కర్ణాటక కవిచరిత్ర వ్రాసిన కీ॥ శే॥ఆర్. నరసింహాచార్యులుగారు, వచనభారతం వ్రాసిన శ్రీ ఆలసింగాచార్యులుగారు, శ్రీ మాస్టి వేంకటేశయ్యంగారు, టి. పి. కైలాసం (సుప్రసిద్ధ నాటక రచయిత) కె. వి. అయ్యర్ (ఈతని నవల "శాంతలా" ను ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారు 13 భాషల్లోకి అనువాదం చేయించడానికి తీసుకున్నారు) వీరిది తమిళం. కన్నడిగుల ఆస్థానకవి గోవిందపై గారిది కొంకణ భాష, సుప్రసిద్ధ కవి ద. రా. బేంద్రె గారిది మరాఠీ. కన్నడ ప్రొఫెసర్ కీ॥ శే॥ వెంకన్నయ్య, ప్రసిద్ధ వచనకారదయితలు, త. రా. సుబ్బరావు "(త. రా. సు"), వీరకేసరి. సీతారామశాస్త్రి, దేవుడు నరసింహశాస్త్రి–వీరిది తెలుగు. ఇంతెందుకు అచ్చ తెలుగువాడైన శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు మైసూరు చేరిన తర్వాత కన్నడం నేర్చుకుని కన్నడంలో వ్రాసిన "సాహిత్యమకు జీవనకలె" అనే పుస్తకం యీ సంవత్సరం (1958) కన్నడ బి.ఏ., (ఆనర్సు) తరగతికి పాఠ్యగ్రంథం.

ఇది ఒక వివాదాస్పదమైన స్వారస్యమైనసంగతి. విమర్శకులు, పరిశోధకులు పరిశీలించతగిన విషయం.

ఏది యెట్లున్నా వీరశైవమతవ్యాప్తికోసం తెలుగు కన్నడ కవులు ఏకమైనారు. ఒకరిని యింకొకరు అనుకరించారు. కన్నడకవి చామరసు వ్రాసిన "ప్రభు లింగలీల"ను అనుసరించి తెలుగులో పిడుపర్తి బసవన గ్రంథం వ్రాశారు. అదిప్పటికి యీనాడు తెలుగు సాహిత్యంలో ప్రచారంలో వుంది.

కన్నడసామ్రాట్టు అయిన బుక్కరాయని ఆస్థానంలో నాచనసోముడు "ఉత్తర హరివంశం" అనే గ్రంథంవ్రాసి తెలుగుసాహిత్యానికి అపారమైనసేవ చేశాడు. ప్రౌఢదేవరాయని ఆస్థానంలో కవిసార్వభౌముడైన శ్రీనాథుడు గౌడ డిండిమభట్టును ఓడించి అతని కంచుఢక్కను పగులగొట్టించి ప్రౌఢదేవరాయల చేత ముత్యాలమంటపంలో కనకాభిషేకం చేయించు కున్నాడు. శ్రీనాథునికి కన్నడభాషకూడా బాగా తెలుసు. ఎవ్వరేమనుకున్నను నిజముగా తాను కర్ణాట భాషను ఆడుతున్నానని అన్నాడు.

పిమ్మట కృష్ణదేవరాయని కాలం వస్తుంది. ఈ కాలాన్ని తెలుగు సాహిత్యంలో స్వర్ణయుగమని అంటారు. కన్నడ సామ్రాట్టు అయిన యీతని ఆస్థానంలో అష్టదిగ్గజాలు అనే యెనిమిదిమంది తెలుగు కవు లుండేవారు. తెలుగుదేశాన్ని యెక్కువభాగం యేలినవాడవడంచేత, తెలుగుభాష నేర్చుకుని తెలుగుభాషామాధుర్యాన్ని మెచ్చుకుని "దేశభాషలందు తెలుగు లెస్స" అని తాను తెలుగులో వ్రాసిన "ఆముక్తమాల్యద" లో పేర్కొన్నాడు. ఇది యితడు వ్రాయలేదనీ పెద్దన్న వ్రాసి అతనిపేరు పెట్టాడనీ ఒక విమర్శ బయలుదేరి యిప్పుడు అణగిపోయింది. "దేశభాషలందు తెలుగులెస్స" అనే మాటలు తెలుగు వారు సగర్వంగా చెప్పుకుంటారు. పరాయివాడు అన్నాడు కాబట్టే మనకింత గర్వకారణం. ఈతని ఆస్థానంలో కన్నడకవులు, తమిళకవులుకూడా వుండే వారు. కన్నడ భారతం వ్రాసిన కుమారవ్యాసుడు, తిమ్మణ్ణకవి యీతని ఆస్థానంలోనివారే. రాయల ఆజ్ఞ ప్రకారం తిక్కనసోమయాజి వ్రాసిన భారతాన్ని అనుకరించి కన్నడంలో కుమారవ్యాసుడు వ్రాయక వదలిన ఎనిమిది పర్వాలను తిమ్మణ్ణకవి పూర్తిచేశాడు. ఈ విషయం తిమ్మణ్ణ భారతం గ్రంథాదిలోవుంది. మన ముక్కుతిమ్మన (నంది తిమ్మన) పారిజాతాపహరణ ప్రబంధం వ్రాసి కృష్ణరాయలకు అంకితంచేశాడు కదా! దీనికి మూలం ఒక కన్నడకవి వ్రాసిన కావ్యం. 13 వ శతాబ్దంలోని కన్నడకవి రుద్రభట్టు "జగన్నాథ విజయం"లో కృష్ణపారిజాత కథను 200 పద్యాలలో వర్ణించాడు. ఆ కథాభాగాన్ని ముక్కుతిమ్మన 609 పద్యాలుగ పెంచి గొప్ప ప్రబంధంగా రచించాడు. రుద్రభట్టు వ్రాసినప్రకారం నారదాగమనం, నారదుడు పారిజాతపుష్పాన్ని శ్రీకృష్ణునకు రుక్మిణి యింటిలోవుండగా యివ్వడం, పారిజాతపుష్ప మహిమ వర్ణనవల్లసత్యభామకు కోపంరావడం,అలగడం,కృష్ణుడు అలకతీర్చడం, (సత్యభామ కాలితన్నుమాత్రం ముక్కు తిమ్మన సృష్టి. ఇది ఆ కాలంనాటి రసికత్వాన్ని సూచిస్తుంది.) పారిజాతవృక్షాన్నె తెచ్చి పెరటిలో నాటించడం–ఇవన్నీ యథాక్రమంగా ముక్కుతిమ్మన అనుసరించాడు. ఒకటె రెండు కన్నడ పద్యాలకు సరి

రైనభావం వచ్చే తెలుగుపద్యాలు యివ్వబడినాయి చూడండి:

“జగన్నాథ విజయం” నుండి:

“బగవంతి సొబగీ మహోత్తమచితం, ప్రద్యుమ్ననం తెప్ప,
పెన్నగనం పెత్తి, మహత్వ దిగ్గ మహిషీ సంపత్తి యిం
తాల్దిదికాగ,
లక్ష్మీ వనితా వతారగనుతుం, మిక్కొంగవాక్యందము
ఈర్ష్యగళం మాణ్దిరె, సత్యభామె తకెదలే సౌభాగ్య
మాత్సర్యమం.”

ముక్కు తిమ్మన:

ఉ. అందరిలోన పెద్ద మహిమా
న్వితి రుక్మిణిగాన పూవు గో
విందుడు దానికిచ్చె తగ
వే యని లక్షణ యోర్చ్చ పైచేఁ గా
ళింది శమించె భద్ర యువు
దెమ్మని యూరడిలెక్ సుదంతి లోఁ
కుందుట మాసె జాంబవతి
కోప మసంగెను మిత్రవిందయుక్.

జగన్నాథ విజయం:

౧. తడవే పుష్పాగ్ర దివ్యం
బడివం రుక్మిణి యొళ్ళిదిం హరి మెరిదుం
గడ సత్యభామె గెలగం
ముడిక్కిద వార్పారె తిక్కొళ్ళిం సఖియోళ్.

౨. అబలు యకోళ్ మయ్యాంపల్
సొబగింగా సత్యభామె కేడెం తెసెగా
సొబగీ అలరం ముడిసరె
సొబగే కచ్ఛత్రమాయు ధీమ్మకను తెయా.

ముక్కు తిమ్మన:

౧. ఇన్ని దినంబులక్ సవతు లిందరలో (1-65)
౨. చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు (1-66)
అనే పద్యాలలో చేర్చివాడు.

పారిజాతపుష్పవర్ణనలో జగన్నాథ విజయం లోని వర్ణననే ముక్కుతిమ్మన అనుసరించాడు.

౧. అలినీలాలక, ౨. అడిగినయంతలోన, 3. వేసవి చలువయు ఈ పద్యాలకు తగిన కన్నడ పద్యాలున్నాయి.

అల్లసాని పెద్దన “నిరుపహతిస్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము” ఈ పద్యం రాయల ఆస్థానంలో నిర్మొహమాటంగా చెప్పి సెబాస్ అనిపించుకొన్నది పెద్దనకు సుమారు మున్నూరేండ్లకు ముందుండిన కన్నడకవి మల్లిఖార్జునిది: ఈ కన్నడ పద్యమును తిలకించండి:

“నిరుపహతిస్థలం, మృదు కరాసన, మెళిణి సింపు
దంబులం
నరసిద పుస్తక ప్రతతి, లేఖక వాచక సంగ్రహం నిరం
తర గృహనిశ్చితస్థితి, విచారక సంగతి, సత్కవిత్రి సా
దరతియు నుళ్ళి సత్కవియు మాసువదాగదె కావ్య
వార్తెయుం.”

కృష్ణదేవరాయని సామంతరాజైన యలహంక ప్రభువు, బెంగుళూరు నిర్మాత, కెంపేగౌడ తెలుగులో “గంగాగౌరీ విలాసం” అనే యక్షగానం వ్రాశాడు. బ్రౌన్‌దొర వ్రాయించి పెట్టివుంచే దీని వ్రాతప్రతి యిప్పుడు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో వుంది. (తెం. సూచిక ౮ యక్షగానములు సం. ౧౮౬౪ పుట ౨౦౯౪-౯౮.)

తరువాత కన్నడ - తెలుగు సాహిత్యాలతో సంబంధం కలిగిన ప్రధానమైన వ్యక్తులు వేమన- సర్వజ్ఞ కనిపిస్తారు. వీరిరువు సమకాలీకులై వుభయులూ భేటీ అయి సంభాషించుకొన్నట్టు తెలుస్తూవుంది. “సర్వజ్ఞ-వేమన సంవాదం” అనే ఒక పుస్తకం మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో వుంది. ఇందులో సర్వజ్ఞ వచనాలకు సరియైన భావం వచ్చే వేమనపద్యాలు కన్నడ లిపిలో ప్రకటింపబడి వున్నాయి. ఉభయుల జీవితాలలోను సామరస్యం వుంది. ఇద్దరూ మొదట సంసారబంధంలో వుండి కష్టసుఖాలను అనుభవించి సంసారబంధాలను త్రెంచుకొని విరక్తులై సన్యాసులై దేశాటనం చేశారు. సంఘాన్ని, దురాచారాలను విమర్శిస్తూ, వచనాలను పద్యాలను చెప్పారు. ఉభయులూ లోహాలను బంగారు తయారు చేయుటంలో ప్రయత్నించి విఫలురైనారు చూడండి:

సర్వజ్ఞ: “సీగ భాగయువారు, కాగ హోరెయు గడ్డ
సాగరదసత్తు వోడగూడలు
హేము ఆగలే అప్పా సర్వజ్ఞ.

వేమన:

1. చెట్టుమీద కాయ గట్టుమీద మన్ను
పుట్టలోని వాని బడుగు దడుగ
గట్టిగా యీమాడు కనకంబు తానయా. విశ్వ.

2. ఇంగిలీక మహిమ హేమింప నేరక
చిత్రపటము వ్రాసి చెలఁచివారు
బొందకెముదుపాల పొంగింప నేరరు . విశ్వ.

సర్వజ్ఞ : "ఎత్తుగాణవ పలాత్తు సుత్తిబంద రయేను?
చిత్తదలి శివనె నెయద దేశవను
సుత్తి ఫలవేను సర్వజ్ఞ.

వేమన :

ఆత్మలోని లింగ మదిరియను గానక
తీర్థవాసులంచు తిరుగువారు
గంగంబు మోసిన గార్దభంబులు గార . విశ్వ.

సర్వజ్ఞ వచనాలు మూడు పాదాలు — వేమన పద్యాలు మూడు పాదాలు.

మైసూరును ఏలిన రాజులుకూడా తెలుగు సాహిత్యానికి పోషకులైనారు. చిక్కదేవరాయని కాలములో (1720) అతని దళవాయి కళలె వీరరాజు తెలుగు వచన భారతం వ్రాశాడు. ఇదే తెలుగులో మొదటి వచనకావ్యం. తెలుగు సాహిత్యంలో యీ వచనకావ్యం బయలుదేరిన పిమ్మటే ప్రత్యేకముగా వచనగ్రంథాలు బయలుదేరినాయి.

ఈతని తండ్రి కళలె సంజరాజు తెలుగులో "హాలాస్య మాహాత్మ్యం" అనే గ్రంథం వ్రాశారు. మైసూరురాజు కంఠీరవ నరసరాజు (మూకరసు) తెలుగులో యక్షగానాలు వ్రాశారు. కొన్ని యిప్పుడు మదరాసు ఓరియంటల్ లైబ్రరీలో వున్నాయి. ముమ్మడి కృష్ణరాయని ఆస్థానకవిగా వుండిన కుందలకుర్తి చంద్రకవి "కృష్ణభూపాలీయం" అనే పద్యకావ్యం వ్రాశాడు. దీనిని మైసూరు సర్కారువారు అచ్చు వేశారు. రాళ్లపల్లిఅనంతకృష్ణశర్మగారు పీఠిక వ్రాశారు. నన్నయ్యభట్టు వ్రాసిన "ఆంధ్రశబ్ద చింతామణి" కి తెలుగు భాషాంతరీకరణ ఉంది. ఇవిగాక భాషాసాహిత్య విషయంలో ఆదానప్రదానాలు యీనాటికీ జరుగుతూవున్నాయి. ఢిల్లీ సాహిత్య అకాడమీవారి ఆశ్రయంక్రింద కన్నడగ్రంథాలు తెలుగులోనికి తెలుగుగ్రంథాలు కన్నడంలోనికి పరివర్తనం అవుతున్నాయి. ఈ గ్రంథాలేగాక ఉత్తమమైన కన్నడ తెలుగు గ్రంథాలు అనేకం యీ రీతిగా ఒక భాషలోనుండీ ఇంకొకభాషకు రాదగినవి అనేకం వున్నాయి. ఆంధ్ర సాహిత్య అకాడమీవారు, కన్నడ సాహిత్య పరిషత్తువారు యీ పనికి పూనుకోవలెనని కోరుతున్నాను.

## ఏకలిపి ఆవశ్యకత

తెలుగు కన్నడిగులయొక్క మధుర బాంధవ్యాలు మరింత నికటంగా పెంపొందాలంటే ఉభయులకూ ఒకే లిపి వుంటే యిది సిద్ధిస్తుందని నా ఆశయం. ఈ సంగతిని నేను అనేక కన్నడిగుల సమావేశాల్లోనూ, తెలుగువారి సమావేశాల్లోనూ వివరించాను. ఇటీవల కర్ణాటకంలో సంచారంచేస్తూ ఆచార్య వినోబాభావే కూడా దీన్ని సమర్థిస్తూ ఉభయ భాషలవారూ ఈ కృషికి ప్రయత్నించాలని హుబ్లీలో కన్నడ సాహితీ వేత్తలను కోరారు. రెండుభాషల లిపిలోను అట్టే వ్యత్యాసాలు లేవు. నేనిప్పుడు కన్నడ అనర్గళవారికి తెలుగు అనుబంధవిషయంగా బోధిస్తూ తెలుగు లిపి సులువుగా వారికి నేర్పిస్తున్నాను. స్వరములలోను, వ్యంజనాలలోను చిన్నమార్పులు చేసుకుంటే ఇది సాధ్యమవుతుంది. టైప్ రైటర్, లినో టైప్ మొదలైన వానిని దృష్టిలో పెట్టుకుని రెండుభాషల ప్రతినిధులు చేరి ఒక నిర్ణయానికివస్తే ఉభయులకూ సన్నిహితత్వం మరింత బాగుపడుతుంది.

# కలగూరగంప

## విజయవాడ: ఉండవల్లి గుహాలయాలు

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

విష్ణుకుండినుల కాలము నాటివని మొదట గ్రహించి పరిశోధకుడు జవాయి దూబ్రియల్ అన్నాడు. లాంగ్హర్స్టు అవి పల్లవుల గుహాలయాలన్నాడు. నిజాన్ని గురించి ఇంకా కొందరికి సందేహముగానే వుంది. భావరాజు కృష్ణారావుగారు అవి విష్ణుకుండినుల కాలము నాటివే అన్నారు. ఈ వరుసను ఆంధ్రపత్రికలోనే ఎవరో అవి విష్ణుకుండినులవాటివని నొక్కి వ్రాశారు.

అయితే దొరికే సాక్ష్యము మాత్రము వాటిని పల్లవుల కాలానివనడానికి అనుకూలముగా ఉందనిపిస్తోంది.

విష్ణుకుండినుల చిహ్నము—సింహము—ఉండవల్లి గుహాలయాలలో కనబడుతూందనీ, అందువల్ల అవి విష్ణుకుండినులవాటేననాలనీ జొబోలు దూబ్రియలు వాదము. సింహము మాత్రమే కాదు, ఏనుగులుకూడా అర్ధశిల్ప ఫలకాలలో — ఆ సింహాలతో పాటు — కనబడుతున్నాయి ఉండవల్లిలో. సింహాలకు ప్రత్యేకత యేమీ లేదు. గుహాస్తంభాలముందు ఒక అంతస్థుమీద సింహాల బొమ్మలు నిండు శిల్పాలున్నాయి. ఈ సింహాలు అర్ధశిల్పసింహాలను పోలిలేవు; ఎల్లోరా గుహలలోని దుమర్లేనా గుహలముందుకూడా సరిగ్గా ఇలాటి సింహాలే ఉన్నాయి. కనుక ఈ సింహాలు ఆదిలో ఉన్నవి కావు, ఆ గుహల కాలక్రమ నిర్మాణములో తీరినవి అంటున్నాను. ఈ నాటి ఋషుల బొమ్మలు కూడా ఉన్నాయి ఈ సింహాల పక్కన. అవి ఈ నాటి 'భిక్షుల' నిర్మాణాలు.

విష్ణుకుండినుల శిల్పములు విరివిగా లేనేలేవు. వారు శ్రీ పర్వతస్వామి పాదపద్మారాధకులూ, శైవులూను. ఉండవల్లిలోని శైవశిల్పాలు—ఇటీవలి వారు ఎంత సిమెంటు దిద్దుబాటు చేసినా, పశ్చిమ చాళుక్యుల శిల్పాలవలె కదలికని సూచిస్తూనే వున్నాయి గాని పల్లవ శిల్పాలవలె రాయిగట్టె నిటారుగా నిలచి లేవు. ఈ శిల్పాలు తూర్పు చాళుక్యుల వాటివిగాని అంతకుముందువి కావంటున్నాను. శాతవాహనులూ, ఇక్ష్వాకులూ మెత్తనైన చలువరాతిలో తీర్పించిన శిల్పాల తరువాత ఘంటసాలలో తీర్చిన వైదిక శిల్పాలు సరస్వతీ, కుమారస్వామీ చైతన్యరహితాలు. బౌద్ధుల తర్వాత కొంత నిలద్రొక్కుకుని పాలించినవారు విష్ణుకుండినులు. ఇక్ష్వాకులనాడు అణగారిపోయిన శైవము వీరి ప్రాపువల్ల మళ్లీ ప్రచారములోనికి వచ్చినది. అయితే నటరాజూ, మహిషమర్దనీ వీరి కాలములో కాక, బాదామి చాళుక్యుల ప్రాభవముతో రూపొందినవంటున్నాను. బెజవాడ ద్వారపాలుడు–ఈ నాడు మద్రాసు మ్యూజియములో నున్నవాడు - ఎర్రరాతి శరీరమువాడు, బాదామి చాళుక్యవంశానికి చెందిన తూర్పు చాళుక్యులనాటివాడు కాని, భావరాజు వారన్నట్లు విష్ణుకుండినుల కాలమువాడు కాడు. విరూపాక్షులూ, మాలా అన్నీ బాదామి చాళుక్యుల ద్వారపాలుర పోలికలే చూపుతున్నాయి. ఈ పోలికలు కల్యాణిచాళుక్యుల అలంపుర శిల్పాలలోకూడా కనబడుతున్నాయి. ఏతావతా, విష్ణుకుండినుల శిల్పము గుర్తించదగినంత లక్షణములతో రూపొందలేదంటున్నాను. కనుక ఉండవల్లిలోని విగ్రహశిల్పము విష్ణుకుండినుల కాలానిది కాదంటున్నాను.

ఉండవల్లిలోని అనంతశయన విగ్రహమూ, పాపపానుపూ, ఫణములూ, ఎగిరే కుంభాండులూ మహాబలిపురపు అనంతశయనుని పోలికలు విరివిగా పెంచుకున్నవి కనుక పల్లవుల నిర్మాణములే అంటున్నాను. మహా

బలిపురములో వలెనే ఈ అనంతశయనుడు గుహయొక్క పక్క గోడలో రూపొందినాడు చూడండి అంటున్నాను. ఉండవల్లిలోని స్తంభాలమీది అగ్రముక్క (Capital) పల్లవుల స్తంభాలమీది అగ్రముక్క వలె ముందు పలక బుజారేఖలతోనూ, తర్వాత రూళ్ళ కర్రలు చేర్చినట్టు వర్తుల రేఖల అంచుతోనూ ఉన్నది చూడండి. ఉండవల్లిలోనిది పెల్లి పెల్లిగా ఊడిపోగలిగిన ఎర్రరాయి. పల్లవ భోగము ప్రాంతంలో ఉండి చేజెర్లలోనూ ఉండవల్లిలోనూ అదునుదొరికినప్పుడు పాలకులైన పల్లవులు తమ శిల్ప సమయాలన్నిటినీ ఒక్కమారు పెంచేసుకోలేదు, అందుచేతనే స్తంభాలను దిగువన సింహాలు తయారు కాలేదూ అంటున్నాను. అయితే మరి పల్లవ శిల్పపు పోలికలు ఏ కొంచెమైనా ఉన్నాయా అంటే పైన చెప్పిన వాటికితోడు మరి రెండు మనవి చేస్తాను. చిత్తగించండంటున్నాను.

కృష్ణదాటి విజయవాడ ప్రవేశించి, మల్లేశ్వర స్వామి కొండకు సేవనువైపువనున్న గుహాలయాలు గమనించండి. ఒక దానికి—కృష్ణవైపు తిరిగి నిలబడితే కనబడేటట్టుగా ఒక ద్వారపాలుడి బొమ్మ వున్నది. చాలామటుకు శిథిలమైపోయిందిగాని కిరీటమూ, దానికి ఇరువైపులా త్రిశూలపు పక్కరింకులూ కనబడుతున్నాయి. మొగల్రాజపురపు గుహకు ఇటూ అటూ వున్న ద్వారపాలురకూకూడా ఇలాంటి కొమ్ముల కిరీటము కలదు. భైరవకొండ ద్వారపాలురకూ యిది ఉన్నది. మహాబలిపురపు గుహలకు ద్వారపాలురకు కూడాఈ కొమ్ముల కిరీటమున్నది. అంతమాత్రమే కాదు. అర్జునరథములో వుండిన నరసింహవర్మ బొమ్మకూ, గణేశరథము మీది శిల్పముఖానికీ, దాని దిగువన అర్చిలో ఉన్న అర్ధశిల్పానికీ ఈ కొమ్ముల కిరీటమున్నది. 'మొహింజోదారో' పశుపతి కిరీటానికి తర్వాత పల్లవ శిల్పమువరకూ ఈకొమ్ముల కిరీటము ఏ రాజవంశము వారికీ లేదు. వారి తరువాత కూడా లేదు. ఇది పల్లవుల స్వంతము. వెంకయ్య గారు చెప్పిన ఏనుగు తలకిరీటము ఈరూపానికి మారిందా అని నాకు సందేహముగా ఉన్నది. ఈకొమ్ములు దంతాలూ, పైకి నిక్కబొడిచిన స్తూపకము, తొండమూ కాకూడదా?

దాన్ని అక్కడితో వదిలేద్దాము. పల్లవుల ప్రధాన చిహ్నము—కొమ్ముల కిరీటము—ఉన్న విగ్రహాలు పల్లవులవే కావాలిగదా? మొగల్రాజపుర, విజయవాటికా గుహాలయాలు పల్లవులవేనన్న మాట. అక్కడి స్తంభాలు ఉండవల్లి స్తంభాలవలెనే వున్నాయి. ఇంకొక్క సాక్ష్యము—తిరుగులేనిది—మనవి చేస్తున్నాను. మొగల్రాజపురం గుహలముందు చూరుమీద గూళ్ళు, ఆ గూళ్ళలో ముఖాలూ ఉన్నాయి. ఈ గూళ్ళలో ముఖాలూ చెక్కడము పల్లవులూ, వారితర్వాత తూర్పు చాళుక్యులూ చేశారు. ఈముఖాల్లో ఒకటి సరిగ్గా మహాబలిపురపు గంగావతరణ చిత్రములో దిగువన, కుంభము భుజముమీద పెట్టుకున్న మునిముఖము లాగ ఉన్నది. అశిల్పి ఇక్కడ ఇది చెక్కి వుండవచ్చును. మొగల్రాజపుర గుహలు పల్లవుల నిర్మాణమే. బెజవాడగుహలూ ఉండవల్లి గుహలూకూడాను. అంతటా పల్లవుల శిల్పాలున్నాయి.

# గ్రంథవిమర్శనము

## ద్రావిడభాషా పరిశీలనము

### ప్రథమ ద్వితీయ సంపుటములు.

గ్రంథకర్త : కళాప్రపూర్ణ శ్రీ వఝుల చినసీతారామస్వామిశాస్త్రి, ఆంధ్ర విశ్వకళాపరిషత్ ప్రచురణ. వెల: 16-0 0 (మొదటి సంపుటము), 16.0.0 (రెండవ సంపుటము).

ఇవి ప్రథమ ద్వితీయ సంపుటములు కలసి 1052 పుటల మహాగ్రంథము. ఇందలి విషయానుక్రమణికయే 60 పుటలకుఁ బెరిఁగినది. ఈ విషయ రాశియంతయు ప్రధానముగ నేడు ప్రకరణములుగ విభజింపఁబడి యున్నది. అవి: ధ్వనిప్రకరణము, ధాతుప్రకరణము, నామప్రకరణము, సంఖ్యావాచక ప్రకరణము, సర్వనామ ప్రకరణము, క్రియాప్రకరణము, శబ్దసామ్య ప్రకరణము ననునవి. విషయము—ద్రావిడభాషలనఁబడు తమిళ, కర్ణాటాంధ్ర మళయాళముల పరస్పర సామ్య పరిశీలనము. ఈ సామ్యము,ధ్వని, ధాతు, నామ, సంఖ్యావాచక,సర్వనామ, క్రియా, సదృశశబ్ద, పరిశీలనమువలనఁ దెలియఁదగినది. ప్రయోజనము ఏతద్విధ సామ్యానుమిత ప్రాచీన మూలద్రావిడ భాషా తత్త్వనిరూపణము. అట్టి మూలద్రావిడ భాష యిప్పుడు లేదు. కొన్ని వేలసంవత్సరములకుఁ బూర్వ ముండియుండు నది ప్రకృత ద్రావిడ భాషలయందుఁ గనవచ్చు బహువిధ సామ్యములచే ననుమానింపఁబడుచున్నది. ప్రథమానుమాత, కాల్డ్వెలు పండితుఁడు. అతఁడు క్రిందటి శతాబ్దిలో దీనినిఁ బ్రతిష్ఠాపించుచు నొక గ్రంథమును రచించెను. అది మూలగ్రంథముగా, నేతద్విశ గ్రంథ పారంపర్యముచే నొక క్రొత్తశాస్త్రము పెరుఁగుచున్నది. అది శబ్దశాస్త్రము కాదు. శబ్ద తత్త్వశాస్త్రము. శబ్దశాస్త్రము లాక్షణిక సంప్రదాయము లోనిది. బహుళార్థ వ్యాప్తికల సంక్షిప్తసూత్ర స్వరూపముకలిగి ధారణా యోగ్యములగుట వాని స్వభావము. సంక్షోదము వానియందు గుణమే. శబ్ద తత్త్వశాస్త్రములు ప్రతీచ్య మనీషి ప్రవర్తితములు. విస్తరము, నిర్ణయమున కనువు పడని సందేహాస్పదమైన బహుముఖీనత, దీని స్వభావము. దీన, క్రమబుద్ధికము. అంతర్గత భాషాతత్త్వ నిరూపణాత్మకము లగుటచేఁ బ్రయోజనము మిక్కిలి పరిమితము. దీని నొక ప్రత్యేక శాస్త్రముగ గ్రహించి జీవితమంతయు వెచ్చింపఁ దలఁచినవారి బుద్ధివైశద్యమునకు మాత్ర ముపయోగించినది.

ఇట్లనుట యీ పరిశ్రమము నెడ ననాదరమువలనఁ గాదు. ఈ వయస్సులో శ్రీ శాస్త్రిలవారు ప్రదర్శించిన అగాథమైన శ్రమ సహిష్ణుతను పరోక్షముగఁ గొండాడుటయే. పరోక్షప్రియా ఇవహి దేవాః! శ్రీ శాస్త్రిల వారింతకుఁబూర్వము చింతామణి విషయ పరిశోధనము, ఆంధ్ర వైయాకరణ పారిజాతము ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము వను మహా గ్రంథములను, తెనుఁగు వ్యాకరణమునకు భాష్య ప్రాయములైన వానిని విరచించి యాంధ్ర వాగ్దేవతకు సమర్పించి యున్నారు. కాని ద్రావిడభాషా పరస్పర సంబంధ విశదీకరణ దక్షు శబ్ద తత్త్వశాస్త్రపు లేమి యాంధ్ర సరస్వతీ వైభవమునకొక కొఱంత యయ్యె ననియూ, గళితపారమగు వయసులో వారా కొఱంత తీర్పఁ గల శ్రమ సహిష్ణులగు సమర్థుల యభావమును బర్యాలోచించియూ, తమ చేతిమీదుగనే దానినిఁదీర్చుటకై యీ మహాగ్రంథ రచన కుపక్రమించి పూర్తి

చేసి పూర్ణకాములైరి. ఏతద్గ్రంథ రచనావశ్యకత— మూల ద్రావిడభాషా సిద్ధాంత గ్రంథమును రచించిన కాల్డ్వెలు పండితునకుఁ దత్సిద్ధాంత దృఢ ప్రతిష్ఠాపనోపయోగియగు తమిళ, కర్ణాట, మలయాళ, ప్రాచీన వ్యాకరణ వాఙ్మయ పరిశ్రమము చాలమిని ఆయా భాషలయందలి అర్వాచీన వ్యాకరణ వాఙ్మయముల నే యాధారముగఁ దీసికొని సిద్ధాంతమును నిర్ణయింపఁ బ్రయత్నించుటచేఁ బెక్కు స్ఖాలిత్యములును, స్వవచో వ్యాఘాతములు నొదవినవనియు,— స్వతంత్రముగ నా యా భాషలయందలి ప్రాచీన వ్యాకరణ వాఙ్మయములయందుఁ దగినంత పరిశ్రమము లేని నేటి ద్రావిడ భాషా తత్త్వ పరిశోధకులు, గతానుగతికముగ దోష భూయిష్ఠములగు కాల్డ్వెలు మార్గము నే పట్టి తత్త్వమునకు దూరస్థు లగుచుండుటనుబట్టి సిద్ధాంత దృఢ ప్రతిష్ఠకై యాలోపములను సంస్కరింపవలసి వచ్చుటయే యేతద్గ్రంథరచనకు మూలహేతువని శ్రీ శాస్త్రులవారు తమ 'విజ్ఞప్తి' లోఁ దెలిపియున్నారు.

ఏతద్గ్రంథ రచనాధికార ఫలితమైన తమ భూయః పరిశ్రమమును వివరించు పట్టున శ్రీ శాస్త్రులవారు ఆ యా భాషలయందలి ప్రాచీన వ్యాకరణ వాఙ్మయాభ్యాసమునఁ దమకు గురువులైన వారినిఁ గృతజ్ఞతతో సంస్మరించి యున్నారు. ప్రాచీన విద్వత్పరంపరకిది, యసాధరణమైన భూషణము.

శ్రీ శాస్త్రులవారు తమ జీవితము నంతయు వెచ్చించి సంపాదించినది యేతద్గ్రంథ రచనాధికారము. ఈ గ్రంథమునందలి విషయముల తత్త్వమును బ్రమాణీకరించుటకు వలయు సమగ్ర విజ్ఞాన సముపార్జనకు నొక జీవితము చాలదని చెప్పుటకన్న యీ గ్రంథ ప్రాశస్త్యమునుగూర్చి చెప్పుట యుండదు.

## రామకృష్ణుని రచనావైఖరి

[శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు. ప్రకాశకులు: ఉస్మానియా కళాశాల, తెలుఁగు భాషాసమితి, కర్నూలు. ప్రతులకు: బాలసరస్వతి బుక్ డిపో, కర్నూలు. వెల: రెండురూపాయలు.

కర్నూలు ఉస్మానియా కళాశాల తెలుగు భాషా సమితి ఆధ్వర్యంలో రామకృష్ణకవి రచనా వైఖరిపై తామిచ్చిన ప్రసంగాలు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారే గ్రంథరూపంలో వెలయించారు.

ప్రసంగ ప్రారంభంలో శ్రీ నారాయణాచార్యులుగారు తెనాలి రామకృష్ణునివరకు సాగిన ప్రాచీనాంధ్ర కవితాపరిణితి సంగ్రహంగా స్పృశించారు.

'రామకృష్ణుని రచనావైఖరి' అని ఈ గ్రంథానికి పేరు. అయినా దీనిలో తెనాలి కవి పాండురంగ మాహాత్మ్య రచనావైఖరి మీద నే ఎక్కువగా పర్యాలోచన సాగింది.

ఆయా ఘట్టాలలో వీరు రామకృష్ణుని రచనారీతులలో విశిష్టత చక్కగా వివరించారు. ఇంతే కాక రామకృష్ణుని కథాకథన నైపుణికూడా సోదాహరణంగా నిరూపించారు.

రామకృష్ణుడు వర్ణ్య వస్తుస్వభావ వర్ణనలోను, సంశ్లిష్టరూపంలో పాత్రస్వభావోన్మీలనంలోను గట్టి దిట్ట. శ్రీ నారాయణాచార్యులుగారు ఈ గ్రంథంలో ఆయా ఘటాలలో ఈ విషయంలో ఇచ్చిన ఉదాహరణలు ఈ విషయంలో చక్కని తార్కాణాలు.

అయితే వీరు చేసిన ఈ క్రింది పద్యపాద వ్యాఖ్యానం సరిగా లేదు.

'కరివ కంఠీరవాహతి నఖ క్షతి జరత్కారి శిర స్ఫురిత శార్కరిల తిలము.'

ఈ పద్యం వ్యాఖ్యానిస్తూ వీరు 'జరత్కారుల శిరములను శుక్తికలతో పోల్చుటాక యపూర్వ స్వాతంత్ర్యము' అన్నారు. అయితే కవి ఇక్కడ జరత్కారుల శిరములు శుక్తికలతో పరిపోల్చలేదు. ఏనుగుల కుంభస్థలాలలో ముత్యాలున్నట్లు వర్ణించడం ప్రాచీన కవి సమయం. ఈ సంప్రదాయం అందరికీ తెలిసినదే. కవి ఇక్కడ సింహాల నఖాఘాతాలచే విభిన్నమైన ఏనుగుల కుంభస్థలాలనుండి రాలిన ముత్యాలతో ఆ వన ప్రదేశం అంతా 'శార్కరిల'మయినదని మాత్రమే వర్ణించాడు. అంతేగాని ఏనుగుల శిరస్సులే ముత్యాలతో పరిపోల్చలేదు.

### రామకృష్ణుని హాస్యము

ఇక రామకృష్ణుని హాస్యాన్ని గురించి గ్రంథకర్త ప్రత్యేకంగా ఒక ప్రకరణంలో వివరించారు.



కొందరు కొందరు కవులు వ్యక్తి జీవితంలో హాస్యచతురులు, చమత్కారప్రియులు కావచ్చును. కాని వారి రచనలలో అది ప్రతిఫలింపక పోవచ్చును. రామకృష్ణుని పేరట ఆంధ్రదేశంలో అనుశ్రుతంగా వినవస్తున్న కథలనుబట్టీ, చాటువులనుబట్టీ అతడొక హాస్యచతురుడు, చమత్కార కుశలుడు అయిన వ్యక్తిలాగే మనకు సాక్షాత్కరిస్తాడు. బహుశః రామకృష్ణుడు వ్యక్తిగతంగా హాస్యప్రసంగ చతురుడయిన వ్యక్తి కావచ్చును. అంతమాత్రంచేత అతని కావ్యాలలో హాస్యం ఆవిర్భవించాలన్న నియమమేమీ లేదు. ముఖ్యంగా పాండురంగమాహాత్మ్యంలో హాస్యరస స్ఫోరకమైన కథలుగాని, ఘట్టాలుగాని ఎక్కడా కనబడవు. అయితే అక్కడక్కడ కొంతవక్రోక్తి, కొంత చమత్కృతి, అవహేళన మాత్రమే కనిపిస్తాయి. అంతేగాని పరిపుష్టమైన హాస్యరసం రామకృష్ణుని కావ్యాలలో [illegible] పాండురంగమాహాత్మ్యంలో ఎక్కడా కనబడదు. శ్రీ నారాయణాచార్యులుగారీ ప్రకరణంలో ఎంత ప్రయత్నించినా—రామకృష్ణుని కావ్యంలో పరిపుష్టమయిన హాస్యమున్నదని స్ఫురింపచేయలేదు.

మన ప్రాచీనాంధ్ర సాహిత్యంపై చాలావరకున్నవన్నీ గతానుగతికమైన విమర్శనలు. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారీ గ్రంథంలో నూతన దృక్పథంతో కొన్నిచోట్ల కొంత లోతయిన విమర్శ చేశారు. రామకృష్ణుని రచనాపైఖరి నిశితంగా అవగాహన చేసుకోదలచినవారికి ఈ గ్రంథం కొంతవరకు తోడ్పడుతుంది.

'శాస్త్రి'

### శృంగార తరంగిణి

శ్రీ అక్కిరాజు ఉంకటేశ్వరశర్మ. ప్రతులకు అక్కిరాజు వెంకటేశ్వరశర్మ, పండితులు, ఏ. సి. కాలేజి, గుంటూరు. వెల: రూపాయి పావలా.

అమరుక శతకం సంస్కృత వాఙ్మయంలో సుప్రసిద్ధమైన శృంగార శతకం. సుప్రసిద్ధులయిన ఆలంకారికులంతా ఈ శతకంలోనుంచి ఉదాహరించారు. అమరుక శతకంలోని 'నిశ్శేషచ్యుత చందనం' అనే శ్లోకం జగన్నాథ పండిత రాయలకు

అప్పయ్యదీక్షితునికి పాండిత్య నికషోపలమై ప్రసిద్ధి పొందింది.

గ్రంథకర్త తాము చేసిన అమరుక శతక పద్యానువాదానికి 'శృంగార తరంగిణి' అని కొత్త పేరు పెట్టారు. గ్రంథం చివర సంస్కృత అమరుక శతకం కూడా యథాతథంగా ముద్రించారు. ఇందువల్ల ఆంధ్రానువాదం చదివేవారికి అది మూల రచనతో సరిపోల్చి చూచే అవకాశం కలిగింది. ప్రాచీన కాలం నించీ దీనికి ఏడెనిమిది ఆంధ్రానువాదాలు బయలు దేరాయి.

కవిత అనువదించడం స్వతః దుష్కరం. అందుచేత, ప్రాచీనులేమి, అధునాతనులేమి తమ రచనలు చాలావరకు ఛాయానువాదాలుగా సంతరించు కొన్నారు.

ఈ కవి అమరుకానువాదంలో కొన్నిపట్ల యథాతథంగా ఆంధ్రీకరణ చేశారు. కొన్ని కొన్ని ఘట్టాలలో కేవలం ఛాయానువాదాలతో నే సంతృప్తి పడ్డారు. కేవలం యథాతథంగా మూలానువాదం చెయ్యాలని ప్రయత్నించగా, కొన్ని ఘట్టాలలో మూల మాధుర్యం అనువాదంలోనికి సరిగా జాలువార లేదు. ఉదాహరణకు 'నిశ్శేషచ్యుత చందనం' అనే సుప్రసిద్ధ శ్లోకానువాదమే తీసుకుందాము. దీనికి వీరి ఆంధ్రానువాదం ఇది:

"స్తన తల చందనా లరలె
    సర్వము పోవి విమృష్ట రాగ, మీ
కనులకు బోయె సాంతముగ
    కజ్జలమున్, పులకించె తన్వి నీ
తనువిది. వాపికేగితివి
    స్నానములాడగ దూతి! బంధుకే
డను గనలేవె ఆ యధము
    డాయవు గాదె! యసత్యవాదినీ!"

ఈ అనువాదంలో మూడవ పాదాంతంవరకు అనువాదం సరసంగానే కొనసాగింది. అయితే నాలుగవ పాదం మాత్రం తేలిపోయినట్లయింది.

అయితే కొన్ని కొన్నిచోట్ల యథామూలంతో కొంత కొరవడినా అనువాదాలు చాలా హృద్యంగా సాగాయి. ఈ క్రిందిపద్యం దీనికి తార్కాణం.

"సరసున గంకణాల్ గదలె
    సంతత మ్రొక్కులున్ గమించె వే
పరువిడె ధైర్య మెక్కడొ త్రుటి,
    బర్విడె జిత్తము ముందె నా మనో
హరుడు ప్రయాణమైన తరి
    వన్నియు దోడనె కూడ నేగ, నీ
టరి యయి నిల్చినావె! అకటా!
    సఖులన్ విడిచెంది జీవితా!"

ఆంధ్రానువాదకర్తలు కవి సముచితమయిన కవితా వేశము, పాండితి, శక్తికలవారు. వీరి అనువాదం సహృదయు పరిశీలనార్హము.

'శాస్త్రి'

## నివేదనము

శ్రీ కందుకూరి రామభద్రరావు. ప్రకాశకులు: కందుకూరి పుండరీకాక్షుడు. ఎమ్. ఎస్‌సి., ఎస్. కె. బి. ఆర్. కాలేజి, అమలాపురం, తూర్పుగోదావరిజిల్లా. వెల: ఒక రూపాయి.

శ్రీ కందుకూరి రామభద్రరావుగారింతకు పూర్వంలో వీరి మొగ్గ మొదలయిన అయిదారు ఖండ కావ్య సంపుటాలు ప్రచురించారు. ఇది ఆ కృతుల తరవాత వెలువడిన రచన. కనకనే దీనిలో క్రమికమయిన పరిణతి స్పష్టంగా కనిపిస్తున్నది.

నిజానికిది ఒక శతకం వంటిది. కాని దీనిలో ఒక మకుటం లేదు. కవి తన జీవితానుభూతులు, సుఖ

దుఃఖాలు పరమేశ్వరునికి నివేదించుకుంటాడు. అయితే ఆ ఈశ్వర స్వరూపం ఇదమిత్థంగా ఎక్కడా సుస్పష్టం కాదు. కవికి ఈశ్వరుడు పంక్తులలో కేవలము ప్రభువు మాత్రమే. ఒక్కొక్కచోట 'ప్రభూ!' అనే సంబోధనకూడా కనబడదు.

శ్రీ రామభద్రరావుగారు తమ హృదయ భావాలు సహజంగా సరళంగా వ్యక్తీకరించడానికే ప్రయత్నిస్తారుగాని తెచ్చి తెచ్చికోలు భావాల కెగ ప్రాకరు. కవకనే వీరి కవనంలో అంతటా ఒక ని[illegible]మయిన పరిణతి, స్వచ్ఛత కనిపిస్తూంటుంది. కొన్ని చోట్ల వీరి రచన ఉదాత్తమయిన గంభీరతతో సాగిపోతూ హృదయం జల్లుమనిపిస్తుంది. ఈ క్రింది రచన వీరి ఉదాత్త కవితాకృతి పరిణతికి చక్కని ఉదాహరణ:

ఒక పరివాహ పెంజడి,
మరొక్క తిరిన్ జిరుచిన్కు జల్లు, వే
రొకరయొప్ప వెంపపాల్పు, మరియొక్క
మహార్ద్రము మందరశ్మిలో
రకరకముల్ గదా! బ్రతుకు రథ్యను
నా పయనంపుదారి చి
త్రికముల కాంతిశాంతులు,
తిభాగతిముల్ సుఖదుఃఖ ఛాయలుల్."

ఈ కావ్యానికి అవసర నైవేద్యము రచించిన శ్రీ కాటూరి వెంకటేశ్వర రావుగారి వాక్యాలివి:

"ఈ నివేదనమునందు అడుగడుగున గ్రంథకర్త చిత్తపరిణతి, విశాలమైన విశ్వప్రేమభావము, మానవత్వమందలి రక్తి మనకు గోచరించి హృదయావర్జకముగ నున్నవి. కావ్యమునుండి మనకు కాంక్షింపదగినంతకంటె ఇతరము ఉండెదుకదా!"

పై వాక్యాలలో పీఠికాకర్త కృతి కావ్యస్వభావం సముచితంగా రూపొందించారు.

'శాస్త్రి'

# స్వీకారము

రుద్రమదేవి. గేయకథ: విద్వాన్, పి. రామకృష్ణారావు బి. ఎ. బి. ఇడి, టీచర్. జైహింద్ సెకండరీ స్కూల్, మచిలీపట్నము. వెల: పావలా.

శ్రీ సీతారామ లక్ష్మణాంబికాంగ శాస్త్రము: పండిత శ్రీ ముదునూరి చిట్టిబాబు పంతులు. ప్రతులకు: గ్రంథకర్త: రామచంద్రపురము, తూర్పుగోదావరిజిల్లా, వెల: ఒక రూపాయి. ఇది శరీరం అంతటా గోచరించే సాముద్రిక లక్షణాలనుబట్టి మానవుల స్వభావాలు, అదృష్టాలు మొదలయినవి నిర్ణయించవచ్చునని వివరించే పుస్తకం.

శ్రీ సాయిబాబా పూజాస్తవములు: రచయిత బాపట్ల హనుమంతరావు, చిన్నగంజాము, వెల: 8 అణాలు.

మహోర్మి విష్క్రమణము: ఖండకావ్యము. రచన రావమల్ల నీలకంఠారెడ్డి. ప్రతులకు: గ్రంథకర్త. పైడిపాలెమ్ పి. ఓ. వయా కొండాపురం, కడపజిల్లా. వెల: 6 అణాలు.

సామ్యవాద ప్రకాశిక: డి. యస్. రెడ్డి. ప్రకాశకులు: పట్టణ ప్రజాసోషలిస్టుపార్టీ, హిందూపురము. వెల: 50 నయా పైసలు.

కృష్ణవేణి: కృష్ణవేణీనది మాహాత్మ్యము, జన్మస్థానములు వర్ణించే చిన్న కావ్యము. రచయిత: ముదిగొండ సుబ్రహ్మణ్య కవి, తెనాలి. వెల: అర్ధరూపాయి.

దయామయి: ఖండకావ్య సంపుటి. రచయిత: 'మధురస్వరాల వరాలు' వెల: నాలుగణాలు. ప్రతులకు కవితా సంస్థానం. వింజరాజుపల్లె.

శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహస్వామి గుడిగంటలు: మడిపడిగ బలరామాచార్య, ప్రచురణ. అరుణ శ్రీ గ్రంథమాల. 1870-1 జనరల్ బజారు, సికింద్రాబాదు. వెల: 30 నయా పైసలు.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**